# సంతానం అభయమిస్తున్న

పిల్లలు కలగకపోవడమనేది శాపమూకాదు, పాపం అంతకన్నా కాదు. ఎన్నెన్నో సాధారణ శారీరక సమస్యలకు చికిత్సలున్నట్లే సంతానోత్పత్తికీ వైద్యశాస్త్రంలో చక్కని మార్గాలున్నాయి. అయితే సెక్స్ అనేదాన్ని బూతుగానే, పాపంగానో భావించే మన సమాజంలో ఈ మార్గాన్ని అన్వేషించి కృతార్థులయ్యేవారు చాలా అరుదు. అంచేత ఎన్నెన్నో విషయాల్లో తన ఆధిపత్యాన్ని ప్రతిష్టించుకున్న పురుషుడు సంతానలేమి విషయంలోనూ లోపాన్ని స్త్రీలకే అంటగట్టి చేతులు దులుపుకున్నాడు. అందుకనే సంతానంలేని మహిళ గొడ్రాలిగా చిన్నచూపుకు గురవుతోంది. సంతులేదన్న నెపంతో మగవాడు పెళ్ళిమీద పెళ్ళిచేసుకుంటూనే ఉన్నాడు.

## తప్పంతా స్త్రీలదేనా?

పిల్లలు కలగకపోవడానికి బాధ్యులు కేవలం స్త్రీలేకాదు. పురుషులలో ఉండే కొన్ని లోపాలవల్లకూడా సంతానం కలగకపోవచ్చు. కాని చాలామంది పురుషులు ఈ సత్యాన్ని ఒప్పుకోరు. సెక్స్ సామర్థ్యం తమలో పుష్కలంగా ఉందనీ, అయినా సంతానం కలగడంలేదంటే అది భార్యలోని లోపమేనని వారు వాదిస్తారు. అంతేకాదు ఆమెకే పరీక్షలు అవసరమని డాక్టర్ల చుట్టూ తిప్పుతారు తప్ప తాము పరీక్షలు జరిపించుకోడానికి ఒప్పుకోరు. అయితే ఇక్కడ ఓ విషయం గమనించాలి. కేవలం సెక్స్‌లో సామర్థ్యం వున్నంతమాత్రానే పిల్లలు పుడతారని, తమలో మరేలోపం లేదని అనుకోవడం పొరపాటు.

వైద్యుల సర్వేప్రకారం పెళ్లయిన భారతీయ దంపతులలో ఇంచుమించు 15 శాతం మంది సంతానలేమితో బాధపడుతున్నారు. వీరిలో సగం కేసుల్లో పురుషుల లోపంవల్లే సంతాన ప్రాప్తి కలగడంలేదని నిరూపణ అయింది. దీన్నిబట్టి మనమెంత అజ్ఞానంలో ఉన్నామో తేటతెల్లమవుతోంది.

## భార్యాభర్తలిరువురికీ పరీక్షలు అవసరం.

దంపతుల కలయికతోనే సంతాన ప్రాప్తి అన్నది జగద్విదితం గనుక పిల్లలు పుట్టని సందర్భాల్లో భార్యాభర్తలిద్దరూ వైద్య పరీక్షలు తప్పనిసరిగా చేయించుకోవాలి. ఈ విషయంలో సిగ్గు, మొహమాటం ప్రదర్శించడం అవివేకం. స్త్రీల సమస్యల్ని పరిష్కరించేందుకు గైనకాలజిస్టులు ఉన్నట్లే పురుషుల్ని పరీక్షించి వారి సెక్స్ సమస్యల్ని పరిష్కరించేందుకు యాండ్రాలజిస్టులున్నారు. వారి ద్వారా సరైన చికిత్స పొందితే సత్ఫలితాలు ఖాయం. శరీరంలోని అన్ని అవయవాలకి రకరకాల జబ్బులు వస్తున్నట్లే మర్మాంగాలకి కూడా జబ్బులు రావడం సహజం. కేవలం కొన్ని అక్రమ సంబంధాలవల్లే వీటికి వ్యాధులు వస్తాయని ఊహించడం సబబుకాదు. పరిశుభ్రతా లోపంవల్ల కూడా రావచ్చు. మరేదైనా లోపంవల్లనైనా రావచ్చు. ఫలితంగా సంతాన ప్రాప్తి కలగకపోవచ్చు. కనుక స్త్రీలైనా పురుషులైనా మిగిలిన రోగాల విషయంలో డాక్టర్లనెలా సంప్రదిస్తామో గర్భోత్పత్తికి కారణభూతమయ్యే అవయవం విషయంలోనూ సిగ్గుపడకుండా వైద్య పరీక్షలు చేయించుకోవాలి. అవసరమైతే తగిన చికిత్స పొందాలి.

# లేనివారికి ఆధునిక వైద్యశాస్త్రం

సంతానలేమి అనేది వ్యాధికాదు. కర్మ సిద్ధాంతానికి సంబంధించిన విషయం అంతకంటే కాదు. సరైన చికిత్స చేయించుకుంటే సంతానం పొందడమనేది అసాధ్యం కాదు. అయితే మనవాళ్లు డాక్టర్లకు చూపించి చికిత్స పొందడానికి బదులు దైవానుగ్రహంకోసం పుణ్యక్షేత్రాలు తిరుగుతూ ధనాన్ని కాలాన్ని వృధా చేస్తుంటారు.

ఫలానా దంపతులకి సంతానం కలగడంలేదనేది ఏ ప్రాతిపదికమీద ఎలా నిర్ణయించాలి? దీనికోసం ఎంతకాలాన్ని ఆధారంగా తీసుకోవాలి? అనే ప్రశ్నలకి అమెరికన్ ఫెర్టిలిటీ సొసైటీవారు ఇలా జవాబుచెప్పారు. ఎవరైనా దంపతులు ఒక సంవత్సరకాలంపాటు ఎలాంటి కుటుంబ నియంత్రణ పద్ధతుల్నికాని, సాధనాల్నిగానీ ఉపయోగించకుండా శారీరక సంబంధాలు కొనసాగిస్తున్నా భార్యకు గర్భధారణ జరగలేదంటే వారికి సంతానసాఫల్యతలో సమస్య ఉన్నట్లే అంచనావేసుకోవచ్చు. ఎందుకంటే సంతానం కావాలనుకున్నవారిలో 70-80 శాతంమంది తొలి కలయిక తర్వాత ఒక సంవత్సరం తిరక్కముందే గర్భధారణ పొందుతున్నారు. మిగిలినవారిలో 10-15 శాతం రెండోసంవత్సరం పూర్తయితేగానీ గర్భధారణ పొందలేకపోతున్నారు. రెండు సంవత్సరాలకు కూడా గర్భధారణ జరగని పక్షంలో ఆ దంపతులు వెంటనే వైద్యపరీక్షలు చేయించుకుని సరైన చికిత్సను పొందడం మంచిది. సాధారణంగా 20-30 సం॥లోపు వయస్సున్న



వారిలో సంతానప్రాప్తికి అవరోధంగా నిలుస్తున్న కారణాల్ని పరిశీలించి, వాటిని అధిగమించడానికి చికిత్స చేయడం సులభం. ఆపైన వయసున్నవారిని కూడా పరీక్షించి ప్రయత్నించవచ్చుగానీ వయస్సు పెరిగేకొద్దీ సంతానసాఫల్యం కష్టసాధ్యమే అవుతుంది. అంచేత సంతానం లేని దంపతులు గుళ్ళు, గోపురాలు తిరుగుతూ ఏళ్ళుతరబడి కాలాన్ని, ధనాన్ని వృధాచేసుకోకుండా వైద్యపరీక్షలు, చికిత్సలు చేయించుకోడానికి చొరవ చూపడం మంచిది.

## భర్తల బాధ్యత ఎంతవరకూ?

పురుషుల విషయంలో సంతానరహితుడ్ని 'నపుంసకుడి'గా గేలిచేయడం మన సమాజంలో అలవాటుగా వుంది. అదికూడా తప్పే. రతిలో సామర్థ్యం ప్రదర్శించడం, పిల్లల్ని పుట్టించగలగడం అనేవి వేరువేరు అంశాలు. అంగస్తంభన లేకపోవడం, రతిసామర్థ్యం లేకపోవడం నపుంసకత్వానికి చిహ్నాలు. అయినా కూడా 'ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్'ద్వారా నపుంసకుడైన భర్త వీర్యాన్ని భార్య గర్భంలోకి ప్రవేశపెట్టి గర్భధారణ చేయించవచ్చు. అయితే నపుంసకత్వం ప్రాప్తించడానికి, సెక్స్‌లో పటుత్వం లోపించడానికీ కూడా ఎన్నో కారణాలున్నాయి. మధుమేహరోగులు, మద్యపాన ప్రియులు, విపరీతంగా ధూమపానం చేసేవారిలో ఈ లోపం క్రమేపీ చోటుచేసుకునే అవకాశం వుంది. అలాగే హైబీపీవల్ల కూడా




పురుష జననాంగ నిర్మాణము



వీర్యకణము

ఈ సమస్య ఎదురుకావచ్చు. ఇంకా చెప్పాలంటే శరీరంలో హార్మోన్లు ఒక నిర్దిష్టమైన నిష్పత్తిలో ఉండాలి. అలాకాక అవి బాలన్స్ తప్పడంవల్ల కూడా రతిసామర్థ్యం తగ్గవచ్చు.

పిట్యూటరీ, థైరాయిడ్, అడ్రినల్ గ్లాండ్స్‌లోని లోపాలవల్ల కూడా ఈ సమస్య ఉత్పన్నం అయ్యే అవకాశం ఉంది. అవయవంలోని సన్నని ధమనులు పూడుకుపోవడంవలనో, దెబ్బ తినడంవలనో రక్తప్రసరణ సక్రమంగా కాక ఈ పరిస్థితి సంప్రాప్తించవచ్చు. ఇలాంటి సందర్భాల్లో మర్మాంగాలకు బైపాస్‌సర్జరీ, గ్రాఫ్టింగ్‌లద్వారా సమస్యను పరిష్కరించవచ్చు.

అలాగే దీర్ఘకాలిక రోగాలతో తీసుకుంటున్న వారిలోనూ, తారాస్థాయిలో మందుల వాడకం సాగిస్తున్నవారిలోనూ రతి సామర్థ్యం దెబ్బతినే అవకాశం ఉంది.

అయితే దురదృష్టవశాత్తూ మగవారిలో ఇలాంటి లోపం కన్పిస్తే ఇన్నాళ్ళూ దీనిని మానసిక సంబంధిత వ్యాధిగానే పరిగణించి, సైక్రియాటిస్టులు, వైద్యులు 'సైకలాజికల్ ట్రీట్‌మెంట్'నే ఇస్తూవచ్చారు. కాని నిజానికి ఇలాంటి కేసుల్లో కేవలం 10 శాతంమాత్రమే మానసిక సంబంధమైనవి. మిగిలిన 90 శాతం శారీరక పరమైనవి. ఈ సత్యాన్ని గమనించి సంతాన సాఫల్య కేంద్రాలలోనో, మంచి యాండ్రాలజిస్టు దగ్గరో పరీక్షలు చేయించుకొని తగు చికిత్స పొందితే ఫలితం కన్పించేందుకు అవకాశం వుంది.

## *నకిలీ సెక్స్ డాక్టర్లుంటారుసుమా!*

రతి సామర్థ్యం లేక ఆత్మన్యూనతాభావంతో మానసిక నరకం అనుభవిస్తున్న రోగుల్ని మరింత భయపెడుతూ ట్రీట్‌మెంట్ పేరిట వేలకువేలు గుంజే నకిలీ డాక్టర్లు ఈ రోజున వీధివీధినా వెలుస్తున్నారు. సమస్యపట్ల అవగాహన, తగిన అనుభవం లేకపోయినా మాటల గారడీతో వీరు రోగుల్ని మభ్యపెడుతుంటారు. శుక్లవృద్ధికి, వీర్యపుష్టికంటూ 'యాంటీడోట్స్' ఇస్తూ రోగుల్నించి డబ్బు పిండుకుంటుంటారు. అంతేకాదు వీరు పెద్దపెద్ద అక్షరాల్లో వార్తాపత్రికలలో ప్రకటనలుసైతం గుప్పిస్తూ




స్త్రీ జననాంగ నిర్మాణము

అమాయకుల్ని ఆకర్షిస్తుంటారు. వీరి వలలో పడకుండా క్వాలిఫైడ్ యాండ్రాలజిస్టుకి చూపించుకోవడం ఉత్తమం.

ఇదంతా ఒక ఎత్తు కాగా సెక్స్‌లో అపారమైన శక్తిసామర్థ్యాలు ప్రదర్శిస్తూ కూడా సంతానోత్పత్తికి నోచుకోనివారు మరోఎత్తు. ఇందుకు కారణం వీర్యంలో లోపం, వీర్యం ప్రయాణించేటప్పుడు నాళానికి ఏదైనా అడ్డుపడటం, లేదా వృషణాలలోనే లోపం ఉండవచ్చు. ఇలాంటి సమస్యల్ని క్షుణ్ణంగా మైక్రోస్కోప్‌ద్వారా యాండ్రాలజిస్ట్ పరీక్షిస్తారు. వీర్యంలోని శుక్లకణాల్ని కంప్యూటరైజ్‌డ్ స్క్రీన్‌పై లెక్కించి లోపాన్ని తేల్చుకుంటారు. అవసరాన్నిబట్టి ఇంపోటెన్స్ (లైంగిక సామర్థ్యం లేకపోవడం), ఇన్‌ఫెర్టిలిటీ (సంతానోత్పత్తి సామర్థ్యం లేకపోడం)లకీ మైక్రోసర్జరీ ద్వారా పరిష్కారం చూపిస్తారు. కొన్ని సందర్భాలలో వీర్యంలోనే లోపం ఉంటుంది. దీనికి ఆపరేషన్ అనవసరం. వీర్యం క్వాలిటీని పెంచడానికి, వీర్యంలో యాంటీబాడీస్‌ని పరిహరించడానికి మందులు వాడాల్సిఉంటుంది. అలాగే వీర్యశుద్ధికి అవసరమైన చికిత్సలుంటాయి. వెన్నెముకకి

సంబంధించిన లోపాలవల్ల కూడా సంతానోత్పత్తికి ఆటంకం కలగవచ్చు. వీటన్నింటిని యాండ్రాలజిస్టులు సునిశితంగా పరిశీలించి తగు చికిత్సలు చేస్తారు.

### స్త్రీలపరంగా...

స్త్రీలలోని లోపంవల్ల పిల్లలు కలగకపోవడం కూడా కొన్ని కేసులలో జరుగుతుంటుంది. ఇందుకు అనేక కారణాలుండే అవకాశమూ ఉంది. పురుమలకిమల్లే పిట్యూటరీ, థైరాయిడ్ గ్రంథులలోనో హైపోథేలమస్ లోనో లోపాలుండడం, హార్మోన్ల విడుదలలో తేడాలుండడం, అలాగే కంజెనెటల్ అబ్నార్మాలిటీస్ డెవలప్ కావడం. ఇలా వీటిలో ఏ ఒక్కలోపం వున్నా సంతానప్రాప్తికి ఆటంకమే! ఇవికాక స్త్రీపరంగా అండాశయం సరిగా ఉండకపోవడం. అండవాహికల లోపం ఉండడంవల్ల కూడా సంతానం ప్రాప్తించడం సమస్యే అవుతుంది. ఈ భాగాలకి క్యాన్సర్‌వంటి వ్యాధులు సోకినప్పుడు కొన్ని సందర్భాలలో వీటిని తొలగించడం అనివార్యం. అలాగే గర్భాశయం సరిగా రూపుదిద్దుకోకపోయినా సంతానోత్పత్తికి అవకాశం ఉండదు. ఇంకా ఎండోమెట్రియోసిస్‌వంటి వ్యాధులవలన కూడా సంతానోత్పత్తి సామర్థ్యం నశించే అవకాశం ఉంది. అలాగే సెక్స్ అంటే కొందరిలో ఉండే అనవసరపు భయాందోళనలవల్ల యోని కండరాలు బిగుసుకుపోవడం తద్వారా రతి కార్యక్రమానికే ఆటంకం కలుగుతుంటుంది. ఆ సందర్భాల్లో అసలు ప్రత్యుత్పత్తికి అవకాశమేది? ఈ కారణాలుగాక ఇంకా ఇన్‌ఫెక్షన్స్‌వలన, అలసట, మానసిక ఒత్తిడులవలన కూడా సంతానోత్పత్తి సామర్థ్యం తగ్గుతుంది. అలాగే వయసు పెరిగే కొద్దీ కూడా ఈ శక్తి తగ్గుతుంటుంది. కనుక ఈ కారణాల్ని దృష్టిలో పెట్టుకొని అసలు సమస్య ఎక్కడ ఉందనేది వైద్యులు పరీక్షలద్వారా నిర్ధారించుకుని చికిత్సలు చేస్తారు.

### సంతానం లేనివారు ఏమిచేయాలి?

దంపతులిద్దరూ సంతానసాఫల్యతా కేంద్రాలకు వెళ్ళి అవసరమైన పరీక్షలు చేయించు

కుని లోపం భార్యలో ఉన్నదో లేక భర్తలో ఉన్నదో మొదట నిర్ధారించుకోవాలి. అనంతరం వైద్యనిపుణుల సలహాపై అవసరమైన చికిత్సలు చేయించుకోవాలి. సంతాన సాఫల్య కేంద్రాలకు వెళ్ళదలచుకున్నవారు ఋతుక్రమం మొదలైన 13వ రోజున వెళ్ళాలి. వెళ్ళేముందు 3-4 రోజులపాటు దంపతులు శారీరకంగా కలవకుండా ఉండాలి. సంప్రదింపులు, వైద్యపరీక్షల నిమిత్తం మూడురోజులపాటు ఫెర్టిలిటీ సెంటర్‌కి అందుబాటులో ఉండేందుకు వీలుగా ఏర్పాట్లు చేసుకోవడం మంచిది.

## తెలియనితనంతోనే అనర్థం

అవిద్య, అర్థంపర్థంలేని మూఢనమ్మకాలు, లైంగిక విద్యపట్ల అవగాహనలేమి ఇత్యాది కారణాలవల్లే సంతానోత్పత్తి సాధన విషయంలోనూ మనవాళ్ళు లక్ష్యాన్ని చేరుకోలేకపోతున్నారు. ఫలితంగా పిల్లపాపలతో, సుఖసంతోషాలతో వర్థిల్లాల్సిన కాపురాలు సంతానప్రాప్తికి నోచుకోక దుఃఖసాగరంలో కొట్టుమిట్టాడుతున్నాయి.

## ఆధునిక విజ్ఞానంతో అంతులేని ఆనందం

ఒకప్పుడు పిల్లలు పుట్టకపోతే ఎవరో ఒకర్ని దత్తత చేసుకునేవారు. ఇప్పుడు రకరకాల పద్ధతులద్వారా ఫెర్టిలిటీని సాధించి ఆనందం పొందేందుకు అవకాశం ఉంది. భార్యాభర్తలు దాంపత్యసుఖం అనుభవించి కడుపునమోసి కన్నబిడ్డ ద్వారా వచ్చే ఆనందం దత్తుడిద్వారా రావడం అసంభవమేగదా? అంచేత సంతానోత్పత్తి సామర్థ్యాన్ని సాధించే ప్రక్రియలెన్నో ఈనాడు ప్రజలకందుబాటులోకి వచ్చేశాయి. వాటిని సద్వినియోగం చేసుకోగలిగితే సత్ఫలితాలు సొంతం అవుతాయి. సంతోషం వెల్లివిరుస్తుంది. బెస్టాఫ్‌లక్!

★

# చతుర

సంపుటి: 16
సంచిక: 8
సెప్టెంబర్: 1993


“ఆ ఉద్యోగం నాకిష్టంలేదని చెప్పానా? నా మాట వినకపోగా మొగుణ్ణయినా వదిలేస్తాగానీ, ఉద్యోగాన్ని వదలనంటావా? ఎంత పొగరు నీకు? అసలూ... పొగరు నీకేకాదు. ఆ ఉద్యోగస్థులందరికీ పొగరే” అంటూ హనీమూన్ ట్రిప్‌ని నరకంలా తయారుచేసిన ఆ నూతనవరుడికి అప్పుడే తెలిసింది భార్య పోలీసాఫీసరని.

**“మీ వాళ్లందరికీ అహం. మీరంతా నీచులు. మీది రాక్షస ప్రవర్తన” అంటూ రెచ్చిపోయాడు.**

పెళ్లికిముందు ఆమె ఉద్యోగ వివరాల్ని దాచి పెళ్లిచేసిన ఇరుపక్షాల పెద్దలు కూడా వారిద్దరి మధ్య సఖ్యత కుదర్చలేకపోయారు.

ఒకరికొకరు ఇష్టపడి పెళ్లిచేసుకున్న ఆ భార్యాభర్తల మధ్య ఆ ఉద్యోగం ఎలాంటి విన్యాసాలు చేసింది?

**చివరకి ఆమెకి మిగిలింది భర్తా? ఉద్యోగమా?** సున్నితమైన హాస్యంతో, సునిశితంగా ఆలోచింపచేసే ఎ.జయలక్ష్మిరాజు ‘విడాకులు’ ఈ నెల ‘చతుర’ సమర్పణ.

ఎ.జయలక్ష్మిరాజు

# విడాకులు

శ్లోకం చదువుతూ హారతి వెలిగించి దేముడికి ముమ్మారు హారతి ఇచ్చి వెనుదిరిగిన రాఘవయ్య ఎదురుగా ఖాకీ డ్రస్సుతో నిల్చుని హారతి కళ్లకద్దుకుంటున్న కూతురు పరిమళను కళ్లారా చూస్తూ నిలుచుండిపోయాడు.

"నాన్నగారూ! ఈ రోజు ఉద్యోగంలో జాయినవుతున్నాను ఆశీర్వదించండి!" అంటూ తండ్రి పాదాలకు నమస్కరించింది పరిమళ.

రాఘవయ్య కూతురి తలమీద చెయ్యి పెట్టి కళ్లు మూసుకున్నాడు, "రాఘవేంద్రా! నా కూతుర్ని దీవించు" అంటూ.

"వచ్చావా ఇక్కడికి. ఆ ఖాకీ డ్రస్సుతో పూజగదిలోకి రావద్దన్నానా?" అంటూ అక్కడికి చేరింది రాఘవయ్య పెద్ద కూతురు సుధ.

"నాన్నగారూ! మీరు దీన్ని బాగా నెత్తికెక్కించుకుంటున్నారు. అది చెప్పినట్లు అంతా వింటున్నారు. శుభ్రంగా ఏ టీచరు ట్రయినింగుకో నాలాగా పంపమంటే వినకుండా పోలీస్ ట్రయినింగుకు పంపించారు. ఆ డిపార్టుమెంటు వద్దంటే మీరిద్దరూ వినరు" అంది కోపంగా.

"ఇదిగో నా డిపార్టుమెంటును ఏమన్నా అంటే ఊరుకునేది లేదు. అమ్మ కూడా ఆ డిపార్టుమెంటుకు సేవచేసింది. ఆమెకు పుట్టిన వాళ్లమే మనం! అది గుర్తుంచుకో" అంది పరిమళ.

"ఆఁ ఆఁ గుర్తుందిలే. అందుకే అమ్మ మనమింకా పదేళ్ల పిల్లలుగా ఉండగానే డ్యూటీలోనే చనిపోయింది!! నీకా గతి పట్టకూడదనే నా బాధ! ఆ ఉద్యోగం కత్తిమీద సాము లాంటిది. అదీగాక ఆ ఉద్యోగాలు ఇంతకు ముందులాగా లేవు. పోలీస్ డిపార్టుమెంటులో నీతి నియమాలు మరిచి ప్రవర్తిస్తున్నారు. లాకప్ డెత్‌లు, రేప్‌లు చూట్టంలా రోజూ పేపర్‌లో..."

"అవన్నీ పక్కకుపెట్టు. పాపీ చిరాయువు అన్నట్టు, ఏ థ్రిల్, ఛాలెంజ్ లేకుండా అచ్చులు, హల్లులు, వత్తులు, దీర్ఘాలు చెప్పుకుంటూ నీలాగా బడిపంతులుద్యోగం నేను చేయలేను! సారీ నాన్నా! ఈ మాట మీకూ బాధ కలిగిస్తే క్షమించండి. ఈ డిపార్టుమెంటులోనయితే పది సంవత్సరాలు ఉద్యోగం చేసినా రెండు తరాలు గుర్తుంచుకునే చరిత్ర సంపాయించు కోవచ్చు. అది చాలు నాన్నా! ఈవిడగారు నాకంటే అరగంట ముందు పుట్టిందోలేదో నా మీద తెగ పెత్తనాలు చెలాయిస్తోంది. మరో ఆరేళ్లు ముందు పుట్టి ఉంటే ప్రాణాలు తీసేసేదే. సరే! వస్తా నాన్నా!" అంటూ కదలబోయింది.

"పరిమళా! అమ్మ ఫొటోకు నమస్కరించి వెళ్లమ్మా!"

అప్పటి వరకూ ప్రేక్షకుడిలా ఉన్న రాఘవయ్య నోరు విప్పారు.

పరిమళ అక్కడే గోడకు తగిలించి ఉన్న ఫొటో దగ్గరికెళ్లింది.

"తెలుగు సినిమాలోలాగా బయటకు వినిపించేలా ప్రార్థించక్కర్లేదు. దండం పెట్టుకుని వెళితే చాలు" అంటున్న సోదరివైపు గుర్రుగా చూసి తల్లి ఫొటోకు దండం పెట్టింది.

వెళుతూ "నాన్నగారూ! ఈవిడగారిని చూడటానికి పెళ్లి చూపులకు మొన్న ఓ లాలీ వచ్చిందికదా! ఈ అమ్మమ్మ మొహం నచ్చినట్టుందనుకుంటా! ఆ సంబంధం ఖాయం చేసి పెళ్లి చేసి పంపిస్తే ఇల్లు ప్రశాంతంగా ఉంటుంది. వస్తా నాన్నగారూ! వస్తానమ్మా పోలీసాఫీసరు పెళ్లామా?" అంటూ వెళ్లిపోయింది.

ఉక్రోషంతో ఎర్రబడిన మొహాన్ని ముచ్చటగా చూస్తూ పెద్ద కూతురి దగ్గరకు చేరి "ఏంటమ్మా! చిన్నపిల్లలా! నీ చెల్లెలే కదా!" అన్నాడు రాఘవయ్య కూతురి తల నిమురుతూ.

సుధ కంట్లో నీరుబికింది.

"అసలు మిమ్మల్నాలి. తండ్రికి పెద్ద కూతురంటే ప్రేమంటారు. మీకు మాత్రం అదంటేనే ప్రేమ. నా మాట ఒక్కటీ వినరు, ఖాతరు చెయ్యరు. ఆ పోలీస్ డిపార్టుమెంటు వద్దంటే విన్నారా?"

"జరిగిపోయినవి వదిలిపెట్టమ్మా! ఎవరు వద్దన్నా కాదన్నా దైవ నిర్ణయానికి తిరుగులేదు. అన్నం పెట్టుతల్లీ! ఆకలేస్తోంది" అంటున్న తండ్రిని పసిపిల్లాడిని చూసినట్టు చూసింది సుధ.

"నాన్నగారూ! నేను ఫెయిర్ చేసి పంపిన మీ కథకు ప్రయిజు డబ్బు వచ్చి నెల దాటుతోంది. నాకు చీరకొనిపెడతానన్నారు మరిచిపోయారా?" అంది పెరుగు వడ్డిస్తూ.

''మరిచిపోయానమ్మా! సాయంత్రం నీవు స్కూలునించి రాగానే గుర్తు చేయి బజారుకెళదాం సరేనా!'' అన్నాడు రాఘవయ్య.

''ఇంకో నవల ఉంది ఫెయిర్ చేసి పెట్టాలన్నారు. అది ఇవ్వనే లేదు''

''అవునమ్మా! ఆ నవల ముగింపులో ఉంది! అయినా నీవూ స్కూల్లో పిల్లలకు పరీక్షల గొడవలో బిజీగా ఉన్నావుకదా! నింపాదిగా ఫెయిర్ చేద్దువుగాని''అంటూ చెయ్యి కడుక్కున్నారు కంచంలో.

★ ★ ★

''ఇదేమిటి నాన్నగారూ! ఈ నవల పేరు 'విడాకులు' అని పెట్టారు?''

''ఏమ్మా! పేరు బాగాలేదా? నవల పూర్తిగా చదువు! చదివాక చెప్పు ఆ పేరు సరిపోయిందో లేదో!''

''అన్నట్టు సుధా! అది నా జీవిత చరిత్రకు సంబంధించిన నవల''

''అమ్మో! ఏమిటి నాన్నగారూ! జీవిత చరిత్ర అంటున్నారు? అంత పెద్దదా మీ చరిత్ర'' అంది నవ్వుతూ.

''చరిత్రలేని మనిషి లేడమ్మా! మీరెప్పుడూ నా చిన్ననాటి కబుర్లు చెప్పమంటూంటారు కదా! ఈ నవలలో అవన్నీ రాశాను. కాకపోతే ఇది నవల కాబట్టి వాస్తవాలతోపాటు కొన్ని కల్పితాలు కూడా చేర్చి రాశాను. సుధా! ఈ నవల చదివాక నా అంచనా ప్రకారం నీకు పోలీస్ డిపార్టుమెంటు అంటే ఉన్న ఏహ్యాభావం, దురభిప్రాయాలు తొలగిపోయి సరయిన అవగాహన కొస్తావనుకుంటున్నాను. అక్షరాలు నీటుగా రాయి. ఎక్కడైనా అనుమానం వస్తే నన్నడుగు'' అంటూ ఓ లావుపాటి పుస్తకం, పెన్ను, తెల్లకాగితాలు కూతురిచేతికిచ్చి వెళ్లిపోయాడు.

''అక్కయ్యా! ముందు నేను చదవనా?'' అడిగింది పరిమళ ఆ సాయంత్రం ఇంటికొస్తూనే సుధనుంచి విషయమంతా విని.

''నోర్ముయ్! కష్టపడి ఫెయిర్ చేసేది నేను. నేనే ముందు చదవాలి'' అంటూ లాక్కుని గదిలో కెళ్లిపోయింది సుధ.

''పోనీ! నాన్నగారన్నట్టు ఆ నవల చదివింతర్వాతనైనా దీని బుద్ధిమారి ఆ లాఠీని పెళ్లాడితే నా బాధ తీరుతుంది'' అనుకుంటూ వెళ్లిపోయింది పరిమళ.

రాఘవయ్య తన గదిలో భార్య ఫొటోవైపు చూస్తూ అనుకున్నాడు... 'దుర్గా నీ రూపం నా గుణాలు వచ్చిన పెద్ద కూతురికి పోలీస్ డిపార్టుమెంటు మీదున్న ఏహ్యాభావాన్ని తుడిచివేయటం నా వల్లకాక, నా జీవితమనే నవలను దాని ముందుంచాను. అర్థం చేసుకుని, మంచివాడూ, సర్కిల్ ఇన్స్పెక్టరూ అయిన ఆ ప్రకాష్‌ను పెళ్లాడితే అమ్మాయి సుఖపడుతుంది'' అనుకుంటూ కళ్లు మూసుకున్నాడు.

పాతికేళ్ల క్రిందటి జ్ఞాపకాలను నవలగా మలిచి రాసిన వాక్యాలను మరొక్కసారి గుర్తు చేసుకున్నాడు రాఘవయ్య!

★ ★ ★

చెంప ఛెళ్లుమనగానే దిగ్గున లేచింది కనకదుర్గ. ఎర్రబడిన చెంపను చేత్తో పట్టుకుని, నీళ్లు నిండిన కళ్లతో భర్తవైపు రోషంగా చూస్తూ.

''ఆ ఉద్యోగం చెయ్యటం నా కిష్టం లేదన్నానా? మూడు రోజుల్నుంచి చిలక్కి చెప్పినట్టు చెబుతున్నాను. చెవిటివాడి ముందు శంఖం ఊదినట్టుంది. నా మాట వినకపోగా మొగుణ్ణి వదిలేస్తానుగానీ, ఉద్యోగాన్ని వదిలేయనంటావా? ఎంత పొగరు నీకు? అసలు పొగరు నీది కాదు ఆ ఉద్యోగానిది. ఆ ఉద్యోగస్థులందరికీ పొగరు, అహంభావం, ప్రవర్తనలో రాక్షసత్వం, నీచత్వం! ఛీ! ఛీ! ఇదిగో, నేను చెప్పినట్లు ఉద్యోగం మానుకుని సంసారం చేసుకుంటే సరే! లేదా నీ దారి నీది. నా దారి నాది. నీ ఇష్టం! ఆలోచించుకో!'' అంటూ విసవిసా బయటకెళ్లి పోయాడు రాఘవ.

సాయంత్రం వచ్చేసరికి ఇంటికి తాళం వేసుంది. తను రావటం చూసిన ఇంటిగలావిడ తాళం చెవీ, ఓ కవరూ రాఘవ చేతిలో ఉంచి ''మీ ఆవిడ ఊరెళ్లిపోయింది బాబూ! అవునూ! ఏదైనా గొడవపడ్డారా!'' అంది, క్రికెట్ కామెంట్రీ వింటున్న వ్యక్తిని స్కోరెంత? అనడిగినంత ఆసక్తిగా!

వళ్లుమండింది రాఘవకు. అయినా తమాయించుకుని తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో అవునూ కాదూల మధ్య తలూపుతూ తాళం తీసుకుని లోపలికెళ్లిపోయి తలుపేసుకున్నాడు.

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడాలేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

మూతి మూడు వంకర్లు తిప్పుకుంటూ వెళ్లిపోయిందావిడ.

కవరు చింపి ఉత్తరం చదవసాగాడు రాఘవ ఆత్రంగా...

శ్రీవారికి,

నాకు ఉత్తరాలు రాయటం అలవాటులేదు. రాయక రాయక రాస్తుంటే భర్తకు ముద్దుగా, ప్రేమగా రాయవలసిన మొట్టమొదటి ఉత్తరం ఇలా రాయవలసి వచ్చినందుకు బాధగా కూడా ఉంది. నేను చిన్నప్పటినించీ ఎంతో పట్టుదల గల మనిషిని. అలా అని మీకు పట్టుదల ఉండదనీ, ఉండకూడదనీ అనుకోవటం లేదు.

నా పట్టుదలే నా ఈ ఉద్యోగానికి కారణం.

ఈ ఉద్యోగం కోసం నేను చాలా కష్టపడ్డాను.

ప్రతి మనిషికీ ఒక ధ్యేయం ఉంటుందనుకుంటున్నాను. నా జీవిత ధ్యేయం ఈ ఉద్యోగం.

నా ధ్యేయం నెరవేరింది కానీ...

కేవలం డబ్బుతోనే కాకుండా వృత్తి ధర్మం నెరవేర్చటంలో కూడా మనిషి తృప్తి అనుభవిస్తాడని మీకు తెలిసే ఉంటుంది. ఆ తృప్తి అనుభవించక ముందే నన్నీ ఉద్యోగం వదిలెయ్యమంటున్నారు.

ఉద్యోగం! భర్త!

ఈ రెండింటినీ నా మనసనే త్రాసులో ఉంచితే ఉద్యోగం వైపే మొగ్గు చూపుతోంది.

ఇంకో విషయం...

కొన్నాళ్లు మీరు, నేను దూరమయినా మీ మనసు మారితే మనం దగ్గరయే అవకాశం ఉంది. కానీ ఉద్యోగం పోతే మళ్లీ రాదు.

ఆలోచించండి.

కానీ ఒక్క విషయం.

మనస్ఫూర్తిగా మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఎప్పటికీ ప్రేమిస్తాను. మీ మనసుమారి నాకు దగ్గరవాలనీ, మనం మళ్లీ సుఖంగా కాపురం చేయాలనీ అందరి ఆడపిల్లల్లాగే నాకూ కోరిక ఉంది. అందుకే దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను, మిమ్మల్ని దగ్గర చేయమని.

మీ కోసం ఎదురు చూస్తుంటాను''

మీ కనకదుర్గ!

బాధగా, కోపంగా, అసహాయంగా ఫీలయ్యాడు రాఘవ, ఆ ఉత్తరం చదివి.

ఎందుకో అప్రయత్నంగా కళ్లవెంట నీళ్లు వచ్చాయి.

బాధగా కళ్లుమూసుకున్నాడు. అతని కనురెప్పల కిందనించి గడచిపోయిన రోజుల జ్ఞాపకాలు కన్నీటి చుక్కలుగా జారిపడ్డాయి.



రాఘవ ముత్తాత టీచరు!

తాతగారు టీచరు.

నాన్నగారు టీచరు.

రాఘవ కూడా టీచరే!

కానీ ఇంగ్లీషులో లెక్చరరు అనిపిలుస్తారు రాఘవని.

రాఘవ జీవితమంతా ఇప్పటి వరకూ చాలా సాఫీగా సాత్వికంగా గడచింది. అలాగే గడచిపోవాలని అతని కోరిక.

అతని కుటుంబంలో ఎవరేం సంపాయించారో, ఏం తింటున్నారో కనీసం పక్క ఇంట్లో వారికి కూడా తెలియనంత గుట్టుగా సంసారం సాగించారు రాఘవ తల్లితండ్రులు.

ఎవరి గొడవల్లోనైనా తల దూర్చటం కానీ, గొడవలు మీదికి తెచ్చుకోవటంగానీ వారి కుటుంబంలో లేదు.

బయట గొడవలు వినపడ్డా తలుపులేసుకుని లోపలినించి బయటకొచ్చేవారుకాదు.

రాఘవకు కూడా ఆ జీవితం అలవాటైపోయింది.

రాఘవకు ఓ అక్క ఉంది. ఆమె రాఘవ కంటే దాదాపు పదేళ్లు పెద్దది. ఆమెను కూడా

రాఘవ తండ్రి వెతికి వెతికి ఓ టీచరుకే కట్టబెట్టారు.

ఆమెకు పదహారేళ్ల కూతురు ఉంది. రాఘవ అక్క సుజాత తన కూతురు సుగుణ ను రాఘవకు కట్టబెట్టాలని చాలా ప్రయత్నా లు చేసింది.

కానీ మేనరికం... అందులోనూ చిన్నప్పటి నించి ఆ పాపను ఆ దృష్టితో చూడలేదని ససేమిరా ఒప్పుకోలేదు రాఘవ!

రాఘవ, కనకదుర్గను ప్రేమించి పెళ్లి చేసు కోలేదు. అతనికి ప్రేమ వివాహాల మీద నమ్మ కంలేదు. తనకు తెలిసిన వారిలో కొందరు ప్రేమించి పెళ్లి చేసుకుని, ఆ తర్వాత కీచులా టలు కోర్టులు, కచేరీలు అంటూ భ్రష్టు పట్టిన వారు కావటం అందుకు కారణం.

అలాగని పెద్దవాళ్లు చూపించిన అమ్మాయి మెడలో తాళికట్టడానికీ సిద్ధంగాలేడు.

తనే స్వయంగా ఓ అమ్మాయిని ఎన్నుకొని ఇష్టాఇష్టాలు తెలుసుకుని పెళ్లి చేసేసుకోవాల నుకుని పెళ్ళిళ్ళ పేరయ్య ఇచ్చిన ఫొటోలు పట్టుకుని దేశంమీద పడ్డాడు.

"నీకెందుకాశ్రమ. పెళ్లి చూపుల ఏర్పాటు నేను చేస్తానుకదా!" అని పేరయ్యగారు అన్న మాటను ఖండిస్తూ, "నాకు పెళ్లి చూపులు ఇష్టంలేదు. పెళ్లి చూపులనగానే ఆడపెళ్లివా రు చేసే హడావిడి, స్వీట్లు తినడం, ఎదురుగా కూర్చోబెట్టటం, ప్రశ్నలు వేయటం పాటలు పాడించటం! ఇంతా చేశాక అమ్మాయినచ్చక పోతే అవన్నీ వేస్టు. అందరికీ బాధ! కాబట్టి ఆ తతంగంవద్దు. ఫొటోలు, అడ్రసులు ఇవ్వండి. ఎవరో తెలియని వ్యక్తిలా వెళ్లి వాళ్లని చూసి వచ్చి చెబుతాను" అంటూ ఓ ఐదారు ఫొటోలు బాగున్నవి ఏరి తీసుకున్నాడు.

అలా సెలెక్టు చేసుకునే విషయంలో కూడా చాలా తంటాలు పడ్డాడు. ఎన్నో అనుభవాలు ఎదురయ్యాయి.

ఓసారి ఓ అమ్మాయి ఫొటో, అడ్రసు పట్టు కుని వాళ్ల ఊరెళ్లాడు.

ఫొటోలో అమ్మాయి ఇంచుమించు హేమ మాలినిలా ఉంది. లొట్టలేసుకుంటూ ఆ అమ్మా యితో ఓ తెలుగు సినిమాలోలా ఈస్ట్‌మన్‌కలర్ కలలు కూడా కనేశాడు. ఆ ఊరెళ్లి వాళ్లతో ఎలా మాట్లాడాలో రిహార్సల్ చేసుకుమరీ వెళ్లాడు.

వాళ్ల అడ్రసు వెతికి తలుపు తట్టగానే ఓ బోడిగుండు ముసలావిడ తలుపు తీసింది.

"సుబ్బరామయ్యగారిల్లు ఇదేనాండీ!" అన్నాడు.

"మరే! ఇదేనండి! ఎవరు కావాలి మీకు"

"నేను జనాభా లెక్కలు రాసుకునే ఉద్యోగి నండీ! మీ ఇంట్లో ఎవరెవరున్నారు! వాళ్ల పేర్లు, వివరాలు చెబుతారా బామ్మగారూ" అంటూ అక్కడున్న కుర్చీలో కూర్చుని...

"కాసిని మంచినీళ్లిప్పిస్తారా?" అన్నాడు.

"అదేం భాగ్యం!" అంటూ ముసలావిడ "ఒసే రుక్కూ! కాసిని మంచినీళ్లు తేవే!" అంటూ కేకేసింది.

నున్నగా బోడిగుండుతో ఉన్న ఓ అమ్మాయి వచ్చింది నీళ్లగ్లాసుతో.

రాఘవ స్టన్నయ్యాడు. ఫొటోలో ఉన్న అమ్మా యిలానే ఉంది. కానీ ఫొటోలో ఉన్న అమ్మాయి కి జడ, ఆ ఒత్తయిన జడలో పూలు ఉన్నాయి

బహుశ ఆ అమ్మాయి చెల్లెలేమో ఈ పిల్ల అయి ఉంటే బావుండును" అనుకుంటూనే నీళ్లు త్రాగుతూ, "అదేంటి బామ్మగారూ పాపం ఇంత చిన్న వయసులో... మీ అవస్థ.. అమ్మాయికీ వచ్చి పడిందే" అన్నాడు ఓ రాయి విసిరాననుకుంటూ.

"హయ్యో! హయ్యో... పాపం శమించుగాక అవేం మాటలు నాయనా! అమ్మాయికి భ[illegible] ఎక్కువ. ఆరు నెలలకోసారి ఆ ఏడుకొండల వాడికి తల నీలాలు సమర్పించనిది నిద్రప[illegible] దు. చూశావుటే రుక్కూ! నీ మొక్కు ఎలాంటి పెడార్థాలు తీస్తోందో! అందులోనూ ఆ కరు లు ముండావాడు పెళ్లి చూపులు వద్దంటున్నా డట. రేపో మాపో ఫొటో తీసుకుని తనే [illegible] మారు వేషంలోనో నిన్ను చూడ్డానికి తగలడ[illegible] డట. వాడొచ్చినపుడు అవిగ్గయినా తగిలించు కో! ఆ మూడు ముళ్లు పడితే విగ్గులు గిగ్గుల ఏట్లో పడేసి రోజూ మొక్కు తీర్చుకున్నా [illegible] తిప్పలేవో వాడేపడతాడు" అనేసింది.

"నువ్వు రాసుకో బాబూ! నాకవత[illegible] పనుంది" అందా బామ్మగారా తర్వాత.

ఉలిక్కిపడి పరధ్యాన్నంగా ఆమె చెబు[illegible]

న్న పేర్లు రాసుకోసాగాడు.

అతని మస్తిష్కంలో స్కూటర్ మీద తన వెనుక గుండుతో, సినిమా హాల్లో తన ప్రక్కన గుండుతో, పిక్నిక్‌లో తన పక్కన గుండుతో, ఆమెను ఊహించుకుంటూంటే రీళ్లు మారిపోసాగాయి.

అందరూ తనను చూసి 'గుండు పెళ్లాం మొగుడు' అంటూ నవ్వుతున్నారు.

"ఏమిటి నాయనా అలా మిడిగుడ్లేసుకుని ఉండిపోయావ్! రాసుకో!" అంది బామ్మగారు.

"అలాగేనండి!" అని మరి కాస్తకెలికి "అవును! బామ్మగారూ! అడుగుతున్నానని మరోలా అనుకోకండి! అమ్మాయికి ఇలా జీవితాంతం గుండు ఉంటే పెళ్లి కావటం కష్టం కదండీ!" అన్నాడు ఆశ చావక.

"చెప్పి చూశాం బాబూ! ఆ గుండును భరించేవాడినే పెళ్లి చేసుకుంటుందట. దాని మంకుపట్టు దానిది" అంటుండగానే లోపల్నించి ఓ నడివయసావిడ వచ్చింది.

"ఏమిటి అత్తయ్యగారూ! మీకు రోజురోజుకీ చాదస్తం ఎక్కువౌవుతోంది. అతను వచ్చిన పనేమిటి? మీరు చెప్పేదేమిటి?" అంటూనే...

"చూడండీ! మీరు వచ్చిన పని ముగించుకుని వెళ్లండి!" అంది సీరియస్‌గా లోపలికెళుతూ.

"అవునూ! మా పిల్ల గురించి ఇన్ని ఆరాలు తీస్తున్నావు కొంపదీసి ఆ కర్నూలు ముండావాడివి కాదుకదా!" అంది బామ్మగారు అనుమానంగా చూస్తూ!

ఉలిక్కిపడ్డాడు రాఘవ! వెంటనే సీరియస్‌గా "చూడమ్మా! నేను ఈ ఊరి ముండావాడినే! నాకిద్దరు పెళ్లాలూ, నలుగురు పిల్లలూ ఉన్నారు నరేనా" అంటూ బయటపడ్డాడు.

★ ★ ★

ఇంకోసారి అచ్చు బాపు బొమ్మలా ఉందనుకున్న ఓ అమ్మాయి ఫొటో తీసుకుని అడ్రస్ వెదుక్కుంటూ వెళ్లాడు.

బస్సు దిగి కాస్త దూరం వెళ్లగానే గుంపూ, గొడవా కనిపించి వెళ్లి చూశాడు. అక్కడ ఓ అమ్మాయి, మరెవరోకాదు రాఘవ చూడవచ్చిన అమ్మాయే, కరాటే డ్రస్సులో ఓ అబ్బాయిని దంచేస్తోంది.

విషయమేమిటంటే ఆడపిల్లను గురించి వాడు ఏదో కామెంట్ చేశాడట.

దుమ్ము లేచిపోయేలా ఆమె అలా కొడుతూంటే ఆ దెబ్బలన్నీ తనకే తగిలినట్టు ఫీలయ్యాడు రాఘవ.

తిరుగు బస్సెక్కి వచ్చేశాడు నిరాశతో!

తను కోరుకొనే అమ్మాయి కృష్ణశాస్త్రి కవితలా, బాపు బొమ్మలా, నండూరి ఎంకిలాగా, మునిమాణిక్యం కాంతంలాగా, యద్దనపూడి హీరోయిన్ వ్యక్తిత్వంతో ఉండాలని కలలుకనే వాడు. కానీ ఆ కలలు ఫొటోలకే పరిమితం అవుతున్నాయేతప్ప కోరిక తీరటంలేదు.

మరోసారి ఓ అమ్మాయిని చూడ్డానికి వెళ్ళాడు. ఫొటోలోమాత్రం అచ్చు శ్రీరంజనిలా ఉంది గుణసుందరి సినిమాలోలాగా!

ఆ ఊరు పల్లెటూరే అయినా టౌనుకు దగ్గరుండటంతో ఆ ఊరివాళ్ళు నాగరికంగానే ఉన్నారు! బస్సు దిగి నడచి వెళ్ళాల్సి రావడంతో నడుస్తున్నాడు! పరధ్యానంగా నడుస్తున్న రాఘవ, "ఏయ్! నైస్ షర్ట్! ఎక్కడకొన్నావ్?" అన్న మాట వినిపించి వెనుదిరిగాడు. దాదాపు అయిదారుమంది అమ్మాయిల మధ్యనించి వచ్చిందా స్వరం!

"కో ఆప్టెక్స్" అందో అమ్మాయి, రాఘవ నోరెళ్ళబెట్టి చూస్తుంటే.

"కాదు, కాదు, ఆ షర్టు మా తాతయ్యది" అందింకో అమ్మాయి.

ఆ అమ్మాయిల పకపకలు విని ఉక్రోషంగా వెనుతిరిగి నిలబడ్డాడు!

"ఏమిటి సంగతి" అందో అమ్మాయి.

"పాప ఏడ్చింది!"

"ట్రిబుల్ యక్స్ రం పోయమని చెప్పు. చిన్నప్పుడు నేను నీకు అదే పోసేదాన్ని!" అంటూ ముసలిగొంతుతో ఒకే అమ్మాయి ఏకపాత్రాభినయం చేస్తోంది!

ఒళ్ళు మండింది రాఘవకు!

అయినా వాళ్ళు అందరు? తను ఒక్కడు!

అందులోనూ ఆడపిల్లలు అయి వుండికూడా మగాడిని ఆటపట్టిస్తున్నారు. ఎంతకైనా సమర్థులే. ఎందుకొచ్చిన గొడవ అనుకుని ముందుకు సాగిపోయాడు!

"సాగిపోరా! నీగమ్యం చేరుకోరా!" అంటూ పాట వినిపించింది వెనకనుంచి.

ఊర్లోకెళ్ళి ఓ యువకుడిని పట్టుకొని ఫలానావారమ్మాయి అంటూ ఉరఫ్ శ్రీరంజని గురించి అడిగాడు.

"అమ్మాయి చాలా మంచిది, గుణవంతురాలు, పనిమంతురాలు, కాకపోతే ఒకేఒక్క అలవాటుంది. అదేమంత చెప్పుకోదగ్గది కాదనుకోండి. ఆ పిల్లకు అడ్వర్‌టైజ్‌మెంట్ల పిచ్చి! ఇప్పుడున్న అడ్వర్‌టైజ్‌లను రూపురేఖలు మార్చి రాబోవుతరంవారికి కొత్తదైపులో తయారుచేసి అందిస్తుంది!"

"రాబోవుతరమేమిటి? అందివ్వటమేమిటి?"

"2050 నాటికి ఇప్పుడీవిడ రాసిన కొత్తరకం ప్రకటనలు రేడియోల్లో, టీవీల్లో చదువుతారుట. ఇప్పటికి దాదాపు యాభైదాకా రాసింది. నూరు పూర్తవగానే రాగిరేకులమీద రాసి ఎక్కడైనా పూడ్చిపెడుతుందిట!"

"అయిడియా బాగానే వుందికానీ అవెలా ఉన్నాయో వినవచ్చా!"



''ఫర్వాలేదు! ప్రస్తుతానికి నవ్వుకోవచ్చు! మచ్చుకి కొన్ని చెబుతాను వింటారా?''

వింటానన్నట్లు తలూపాడు రాఘవ.

''పిన్నిగారూ! కాఫీ తీసుకొంటారా?''

''ఇంట్లో బ్రూ ఉందిగా!''

''ఆ! ఉంది! తెచ్చి ఆరునెలలే అయింది, ఇంకా ఎక్స్‌పయిర్ కాలేదు తెస్తానుండండి!''

''అబ్బ! ఇది ఈరోజు చేసిన కాఫీలా ఉందే!''

''ఇది ఏంకాఫీ అనుకున్నారు!''

''ఇది బ్రూ ఇన్‌స్టంట్ అయ్యుండాలి''

నవ్వాడు రాఘవ. ''సరే... ఇంకోటి'' అన్నాడు.

''మరదలుపిల్లా ఈ చొక్కాను సబ్బుతో రుద్ది నీలివేసి ఉతుకు''

''వద్దండీ! ఉతకక్కర్లేదు. ఆరవేయక్కర్లేదు! నీలీ వద్దు నీళ్ళూ వద్దు! ఈ చిన్న స్ప్రే సెంటుబాటిల్ చాలు చెమట వాసన పోవటానికి''

ఆ యువకుడు ఇంకో అడ్వర్‌టయిజ్‌మెంటు వినిపించకముందే రాఘవ బస్సెక్కేశాడు.

బస్సులో జుట్టు పీక్కున్నాడు రాఘవ!

తన పెళ్ళిచూపుల తతంగం గజనీదండయాత్రలా సాగిపోతుందేమిటా అని బాధపడిపోసాగాడు!

కొన్నాళ్ళు ఈ దండయాత్రకు బ్రేక్ వెయ్యాలి అనుకున్నాడు రాఘవ!

అలాగే పెళ్ళిమీద విరక్తితో ఓ సంవత్సరం వాయిదావేస్తూ గడిపేశాడు.

ఆలోచిస్తూ మరో సంవత్సరం గడిపేశాడు.

అలా రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. రాఘవకు 29 సంవత్సరాలు నిండి ముప్పైలో పడ్డాడు. తల్లిదండ్రులకు చాలా బాధగా తయారయ్యాడు. ఈలోగా రాఘవ అక్క తన కూతుర్నిచ్చి చేస్తానంటూ గోల.

దాంతో రాఘవ చాలా తీవ్రంగా ప్రయత్నాలు చేశాడు. ఓసారి బంధువుల పెళ్ళిలో కనకదుర్గ కనిపించింది. ఆ అమ్మాయి నచ్చటం తల్లిదండ్రులకు చెప్పటం నెలలోగా ముహూర్తాలు, పెళ్ళి, అన్నీ చకచకా జరిగిపోయాయి.

ఈ చకచకలో రాఘవ తల్లిదండ్రులు, అటు కనకదుర్గ తల్లిదండ్రులు అమ్మాయి పోలీస్ డిపార్టుమెంటులో యస్.ఐ.గా ఉద్యోగం చేస్తోందన్న విషయం రహస్యంగా దాచారు.

అలా దాచిన విషయం కనకదుర్గకు తెలుసుగానీ, రాఘవకుమాత్రం తల్లిదండ్రులు తెలియనివ్వలేదు. మళ్ళీ ఇదోనెపంగా మారి కొడుకు పెళ్ళిచేసుకోడేమోనని భయపడి అలా దాచారు. పెళ్ళయితే అన్నీ సర్దుకుంటాయిలెమ్మనుకున్నారు.

పెళ్ళి తిరుపతి కొండమీద చేయించటం రాఘవ తల్లిదండ్రుల ఆనవాయితీ కావటంతో ఆ పెళ్ళికి పెద్దసంఖ్యలో బంధువులు రాకపోవటం, పెళ్ళి నిరాడంబరంగా జరగటం, పెళ్ళి అయిన సాయంత్రమే వధూవరులు హనీమూన్ అంటూ ఊటీ వెళ్ళిపోవటం జరిగిపోయాయి.

ఊటీలో దాదాపు వారంరోజులు గడిపేశారు నవదంపతులు. సెలవు అయిపోయిందంటూ తిరుగుప్రయాణమయ్యాడు రాఘవ.

తనకూ సెలవు ఇంకో మూడురోజులకయిపోతుందని మనసులో అనుకున్నా ధైర్యంచేసి దుర్గ భర్తతో అనలేకపోయింది.

ఇద్దరూ కలిసి ఊటీనించి ఊరుచేరుకున్నారు.

రాఘవ కర్నూలులో లెక్చరర్‌గా చేస్తుండటంతో అక్కడే ఓ మంచి ఇల్లు అద్దెకు తీసుకుని సామాను గట్రా చేర్చింతర్వాతే పెళ్లిచేసుకున్నాడు. అందుకే ఏ శ్రమాలేకుండా కొత్తకాపురానికి కొత్తపెళ్ళాంతో ఇంట్లో చేరిపోయాడు. అలా మూడురోజులు గడిచిపోయాయి. అప్పటికి వారి పెళ్ళయి పదిహేనురోజులయింది.

దుర్గకు తల్లి చెప్పిన మాటలు గుర్తుకు రాసాగాయి. ఎలాగో అబ్బాయిని మంచి చేసుకుని విషయం చెప్పి ట్రాన్స్‌ఫర్ చేయించుకొమ్మను'' అందామె.

''ఏమండీ!'' అంది దుర్గ గోముగా.

''ఏమిటి దుర్గా!'' అంటూ దగ్గరచేరాడు

రాఘవ.

"మీరూ అనంతపురం ట్రాన్స్‌ఫర్ చేయించుకోకూడదూ! ఇద్దరం అక్కడే హాయిగా ఉద్యోగం చేస్తూ గడపొచ్చు! మీరిక్కడ నేనక్కడ ఏం బావుంటుంది చెప్పండి?" అంది అతని క్రాపు దువ్వుతూ!

తుళ్లిపడ్డాడు రాఘవ! "ఏమిటీ! నువ్వూ ఉద్యోగం చేస్తున్నావా? దొంగా! చెప్పలేదేం టీచరా? క్లర్కా? ఏ డిపార్టుమెంటు? నాకు అందమైన పెళ్ళామే దొరికిందనుకున్నాను. ఆర్జించే పెళ్ళాం కూడానన్నమాట" అన్నాడు దుర్గను కౌగిట్లోకి తీసుకుంటూ! "ఇంతకూ ఏ ఉద్యోగమోయ్!"

**దుర్గ ధైర్యం తెచ్చుకుని కూడబలుక్కున్నట్టు యస్.ఐ. ఇన్ పో....లీ...స్... డిపార్ట్...మెంటో" అంది.**

"ఆ! ఏమిటీ! కౌగిట్లో పెద్దపులిని ఉంచుకున్నవాడిలా భయపడి దుర్గను విదిలించేశాడు రాఘవ.

భయపడిపోయింది దుర్గ. "ఏమిటండీ అంత భయపడ్డారు!" అంది దగ్గరకు చేరి!

"ఎంతమోసం! దగా!" నిలువెల్లా కోపంతో ఊగిపోయాడు రాఘవ! "ఒక్కమాటయినా పెళ్ళికిముందు నాకు చెప్పలేదు"

"అదేమిటండీ! మావాళ్ళు మీ నాన్నగారితో చెప్పారుట. పెళ్ళయ్యేదాకా ఈ సంగతి సీక్రెట్‌గా ఉంచమని మీ అమ్మనాన్నలు అన్నారుట. ఎందుకో అనుకున్నాను. అయితే మీకు పోలీసులంటే భయమన్నమాట. మీ భయం నేను పోగొట్టేస్తాలెండి!" అంది నవ్వుతూ!

"నోర్మూయ్! జోకులెయ్యకు! నాకా డిపార్టుమెంట్ అంటేనే పడదు. ముందా ఉద్యోగానికి రాజీనామా చెయ్యి!" అన్నాడు ఖచ్చితంగా.

"ఏమిటండీ మీరు మరీ చిన్నపిల్లాడిలా! మీకింత కోపం రావటం ఇదే మొదటిసారికదూ! కాస్త శాంతించండి! ఇదిగో ఈ టవలు తీసుకుని ముందు బాత్రూంకెళ్ళి స్నానం చేసిరండి. చన్నీళ్ళతోనుమా!" అంటూ బాత్రూంలోకి రాఘవను తోసి తలుపేసింది.

స్నానం చేస్తూ అమ్మనాన్నలను తిట్టుకున్నాడు రాఘవ. 'ఛ! ఈ ముసలాళ్ళకు బుద్ధిలేదు. కోడలు పోలీస్ డిపార్టుమెంట్‌లో ఉద్యోగం చేస్తోందన్న సంగతి తెలిసికూడా ఒప్పుకుని, నాకు తెలియకుండా సీక్రెట్‌గా ఉంచమని వియ్యంకులతో చేతులు కలుపుతారా! ఛీ! ఛీ! వాళ్ళకెంత చులకన అయ్యింటాను' అనుకున్నాడు.

స్నానం చేశాకా, ఆ తర్వాతా, ఆ రోజూ, ఆ మరునటిరోజూ కూడా రాఘవ కంట్రోల్‌లోకి రాకపోగా "రాజీనామా చెయ్యి" అంటూ పోరసాగాడు దుర్గని.

దుర్గ ఈ రెండురోజులూ శాయశక్తులా అతన్ని మార్చటానికి, కనీసం శాంతింపచేయటానికి ప్రయత్నించింది. ఫలించకపోగా ఆమె ముట్టుకుంటేచాలు గొంగళిపురుగును విదిలించినట్టు విదిలించేయటంతో ఆమె 'అహం' బాగా దెబ్బతింది. మూడోరోజు "దుర్గా! ఈరోజు మనం అనంతపురం వెళుతున్నాము!" అన్నాడు రాఘవ నిద్ర లేస్తూనే!

"అమ్మయ్య! ఇప్పటికి శాంతించారా?" అంది మెడచుట్టూ చేతులు వేస్తూ దుర్గ గోముగా.

"ముందీ చేతులు తియ్యి! నీ రాజీనామా ఇచ్చి వచ్చింతర్వాతనే ఈ సరసాలు! పద బయల్దేరు అనంతపురం. నేనూ వస్తున్నాను!" అన్నాడు రాఘవ ఆమె చేతులను తీసేస్తూ.

"ఏమిటీ? రాజీనామానా! నా ఉద్యోగానికి రాజీనామా ఇవ్వటానికి మీకేం అధికారం ఉంది! ఆ ఉద్యోగంకోసం నేనెంత కష్టపడ్డానో మీకేం తెలుసు. ఆ ఉద్యోగమూ, ఆ డిపార్టుమెంటూ అంటేనే నాకు ప్రాణసమానం" అంది దుర్గ ఆవేశంగా.

వళ్ళుమండింది రాఘవకు. "అంటే! మొగుడికంటే మొగుడి మాటకంటే ఉద్యోగం ఎక్కువా నీకు!" అంతే ఆవేశంగా అన్నాడు రాఘవ.

"మరే! మీరు ఈరోజు నీ ఉద్యోగం నచ్చలేదు రాజీనామా చెయ్యి! అంటున్నారు. ఇంకొన్నాళ్ళకు నా వంట నచ్చకనో, నామీద మోజు తీరితేనో 'భార్య ఉద్యోగానికి కూడా రిజైన్ చెయ్యి. నేను మరోదాన్ని చేసుకుంటానం'టారు. అహా!... అనరని గ్యారంటీ ఏమిటీ. మొగు

ణ్ణి నమ్ముకోవటంకంటె ఉద్యోగాన్ని నమ్ముకోటం బెటరు!'' అంది నవ్వుతూ ''ప్రాణంపోయినా ఉద్యోగానికిమాత్రం రాజీనామా ఇవ్వను!'' అంది దృఢంగా!

వళ్ళు మండిపోయింది రాఘవకు. అంతే! దుర్గ చెంపమీద రాఘవ బలమైన చేతులు 'ఛళ్'మని శబ్దం చేశాయి.

★ ★ ★

కాలింగ్‌బెల్ మోగడంతో రాఘవ వాస్తవంలోకొచ్చాడు.

లేచి తలుపు తీశాడు.

ఎదురుగా నున్నటి గుండుమీదికి చీర లాక్కుంటూ చంకలో జిప్‌బాగ్, చేతిలో వాటర్ బాటిల్‌తో రాఘవ నాయనమ్మ ప్రత్యక్షమయింది.

ఆమెను చూడగానే, ''నానమ్మా!'' అంటూ వాటేసుకున్నాడు ప్రేమగా!

''ఏంట్రా కన్నయ్యా! ఇలా చిక్కిపోయావ్ ఇంటికెళితే మీ అమ్మానాన్నలు పుష్కరాలకెళ్ళారుట. నీ పెళ్ళయిందని పక్కింటి సుబ్బులు చెప్పింది. నే వచ్చాక చేసుకోకపోయావుట్రా! కాశీకెళ్ళిపోగానే ఇంక తిరిగిరాదు చచ్చిపోయుంటుంది అని మీ అమ్మ చెప్పినట్లుంది అవునా! నా మనవడి పెళ్ళి నేను చూడకుండానే చేసేసింది. నా ఉసురు ఊరికే పోదు'' అంది, మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా.

''అబ్బ! అదేంలేదుకానీ ముందు నువ్వు స్నానం కానిచ్చి వంటచెయ్యవే! భోంచేద్దాం'' అన్నాడు రాఘవ.

''అదేంట్రా! నీ పెళ్ళామేదీ! ఓహ్! అవును కదూ! నీ పెళ్ళాం సబ్ ఇన్‌స్పెక్టర్రుట! డ్యూటీకి పోయింది కామోసు! అవున్నాయనా కన్నయ్యా! చిన్నప్పుడు పోలీసంటే జడుసుకుని కళ్ళు గట్టిగా మూసుకుని నా ఒళ్ళో దాక్కునేవాడివి! ఏకంగా పోలీసు పెళ్ళాన్ని చేసుకున్నావంటే నీకు భయం తీరినట్టేనా?'' అంది బామ్మగారు స్నానాలగదిలోకి దూరుతూ.

వళ్ళుమండింది రాఘవకు.

చిన్నప్పటి సంఘటనలు గుర్తొచ్చాయి. అందరూ పిల్లల్ని భయపెట్టి నిద్రపుచ్చే ముందుకానీ స్కూలుకు పంపేముందుకానీ 'బూచాడొచ్చాడు' అని భయపెట్టేవారు. కానీ రాఘవ నానమ్మమాత్రం 'పోలీసొస్తాడు' అని చెప్పి భయపెట్టి పనులు చేయించేది. పోలీసులను యమభటులకంటే ఘోరంగా వర్ణించేది.

ఫలితంగా రాఘవ మనసులో పోలీసులంటే క్రూరులు, దుష్టులు, దుర్మార్గులు అన్న బిరుదులు తప్ప, ఎన్ని పుస్తకాలూ, ఎంత చదువూ చదివి లెక్చరర్ అయినా అతని మనసులో పోలీసులపట్లగల భావాలు చెరిగిపోలేదు. సరి కదా! ప్రస్తుతం అప్పుడప్పుడు జరిగే లాకప్‌డెత్‌లు, రేప్‌లు ఇలాంటివి పోలీసు స్టేషన్ల వార్తలు పేపర్లో చదివి మరింత అసహ్యం, కోపం పెంచుకున్నాడు.

అలాంటి ఇప్పుడు గోరుచుట్టుపై రోకటిపోటన్నట్టుగా తన భార్యే పోలీసుకావడంతో తల దిమ్మెక్కిపోతోంది రాఘవకు!

''అమ్మాయి ఎన్ని గంటలకు వస్తుందిరా కన్నా!'' అన్న బామ్మగారి మాటలకు వాస్తవంలోకొచ్చి, ''ఇంక రాదు! పుట్టింటికి పంపించేశాను!'' అన్నాడు రాఘవ.



కనకదుర్గ తండ్రి రామయ్యొ సాధారణ గుమస్తా! ఆయనకున్న ఆస్తి తాతలనాటి ఓ పాత ఇల్లు, భార్య, ముగ్గురు కూతుళ్లూ. సాధుస్వభావంగలవాడు. ఒకరి గొడవల్లో తలదూర్చటంకానీ, గొడవలు తెచ్చుకోవటంగానీ ఆయనకు ఊహకందని విషయాలు. జీతంరాళ్లు

తెచ్చి భార్య చేతిలోపోసి నిశ్చింతగా ఉండ టమే ఆయనపని.

ఆయన భార్య శాంతమ్మ. పేరు శాంతమ్మ కానీ, ఆమె ఎప్పుడూ శాంతంగా ఉండేది కాదు. తన పేరంటేనే తనకు గిట్టని మనిషి. అందరూ కూతుళ్ళు పుట్టడం, భర్త మెతకగా ఉండటం, ప్రతిదానికీ భయపడటం ఆమెకు నచ్చని విషయాలు. అయితే నగటు భారత గృహిణిలాగానే ఆమెకూడా కొంత రాజీపడి బతికేస్తూ పరిస్థితులను తనకనుగుణంగా మార్చుకునే నేర్పరి. అంతో ఇంతో చదువుకున్న స్త్రీ!

పెద్దమ్మాయిని ఆమె అన్న కొడుకుకు కట్నం లేకుండా కాళ్ళావేళ్ళాపడి, కన్నీరు కార్చి కట్టబెట్టేసింది.

రెండో అమ్మాయి కనకదుర్గ!

డిగ్రీ పూర్తికాగానే శాంతమ్మ ఆలోచించింది. ఏదైనా ఉద్యోగం చేయించి ఆమె కట్నండబ్బు ఆమెతోనే కూడబెట్టించాలని. కానీ ఉద్యోగం దొరకటం అంత నులభం కాలేదు. సరిగ్గా ఆ టైంలో యస్.ఐ. ట్రయినింగ్ అడ్వర్టయిజ్ మెంట్స్ చూడటం, అప్లికేషను వేయటం, సీటు రావటం చకచక జరిగిపోయాయి.

పోలీసు డిపార్టుమెంటులో ఆడపిల్లను చేర్చటం ఏమిటని రామయ్య గొడవచేశాడుగానీ శాంతమ్మ అవేవీ పట్టించుకోలేదు. నరికదా ఇంతవరకూ ఇంటినిండా ఆడమేళం! ఇంట్లో పిరికిమొగుడు! ఎప్పుడూ ఏది చూసినా ఎవర్ని చూసినా భయపడటం దినచర్య అయిన ఇంట్లో ఓ యస్.ఐ. ఉందంటే తనకెంత ధైర్యం. ఇక తామెవ్వరిని చూసీ భయపడక్కర్లేదు. తమను చూసే అందరూ ఝడునుకుంటారు... అనుకుంది!

ఆ ఊహ ఆమెను గాలిలో తేలిపోయేలా చేసింది. అందుకు తోడు దుర్గ కూడా చిన్నప్పటినించి ధైర్యస్తురాలు. పైగా అందరు ఆడ పిల్లల్లా పెళ్ళిచేసుకోవడం, అత్తారింటికిపోవటం, పిల్లల్ని కనడం కాక, ప్రత్యేక గుర్తింపు పొందేలా తనేదైనా సాధించాలనుకునేది. స్త్రీలు విమానాలు నడపటం, చంద్రమండలం వెళ్ళటం లాంటివి చదివేది ఆనక్తిగా. అంతగొప్పగా కాకపోయినా, కనీనం ఏదో రకంగా దేశ సేవచేయాలి, గుర్తింపు పొందాలి అనే దారిలో సాగేవి ఆమె ఆలోచనలు. కానీ మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన నేరానికి ముందు డబ్బు ఓ నమన్య! తల్లిదండ్రుల ఆశలు కూడా పీఠం వేసుక్కూర్చున్నాయి.

యస్.ఐ.గా ఉద్యోగం వచ్చి దాదాపు నంవత్సరం అయినాక అంతవరకూ రొటీన్‌గా సాగిపోతున్న జీవితంలో 'పెళ్ళి తప్పనినరిగా చేసుకుతీరాలి' అన్న ఆలోచనను ఆమె మనసులోకి ఇంజక్షన్ చేశారు అందరూ కలసి. పెళ్ళికాని ఆడపిల్ల ఏ డిపార్టుమెంటులోనున్నా అందరి కళ్ళూ ఆ పిల్లమీదనే ఉంటాయి. అందరి ఆశలూ, ఆకలిచూపులూ చివరికి ఇంకో నంవత్సరానికి రిటైర్ కాబోయే ముసలాడితోసహా ఆ పిల్లమీదే ఉంటాయి అన్నవిషయం చాలా త్వరగా గ్రహించింది, దుర్గ!

దీనికి తోడు తండ్రి "ఇంకో చెల్లెలుందని మరిచావా? నీ పెళ్ళయితేనే కదా దానికీ నంబంధాలు చూడటం!" అంటూ డిగ్రీ చదువుతున్న చండికను గుర్తుచేసేవాడు.

ఇరుగు పొరుగు "ఏం! శాంతమ్మా పిల్లకి పెళ్ళి చెయ్యవా? అవుస్లే పెళ్ళిచేస్తే నంపాదన రాదుగా! అయినా 'పోలీసోడి'కి పిల్లనివ్వాలంటేనే భయపడే ఈరోజుల్లో ఆడ పోలీసును చేనుకునే ఆదర్శ పురుషుడు దొరకద్దూ" అని దెప్పి పొడిచేవారు!

"ఏం మీది వీరేశలింగంగారి వంశం కదూ! నీ కొడుక్కి చేసుకో! అంత బాధపడిపోవటం దేనికీ" అంటూ చురక అంటించేది శాంతమ్మ!

కానీ మనసులో మధనపడేది, పిల్ల పెళ్ళి చెయ్యటం ఎలానా? అని. ఎన్నో నంబంధాలు వెతికించింది. వాళ్ళంతా రావటం, పోవటం తప్ప పెళ్ళి మాత్రం జరగలేదు. పైగా "అమ్మో! ఆడపిల్ల పోలీసు ఉద్యోగమేంటి? అణకువగా చీరతో ఇంటిపట్టునుండి భర్త సేవచెయ్యాలి కానీ, మగరాయుడిలా 'టక్కుటక్కు'మనుకుంటూ ఊరిమీద పడే ఉద్యోగం ఏమిటీ?... మాకు నచ్చదు బాబూ!" అని మొహంమీదే చెప్పేసి వెళ్ళిపోయారు!

ఈ బాధకుతోడు భర్త 'నన' ఎక్కువైంది

శాంతమ్మకు! "ఆ డిపార్టుమెంటు ఆడపిల్లకు తగదంటే వినక పంపావు! దానికీజన్మలో పెళ్ళి కాదు! వరువు మర్యాదలు మంటగలుపు తున్నారు" ఛీత్కరించుకునేవాడు.

చివరికోరోజు శాంతమ్మ "దుర్గా! ఆ ఉద్యోగం మానెయ్యవే. నీ పెళ్ళి చేస్తాను" అంది!

దుర్గ చాలా బాధపడింది "చూడమ్మా! పెళ్ళి చేసుకోవాలన్న కోరిక నాకూ ఉంది! కానీ ఉద్యోగం మానేసి కాదు. నా ఉద్యోగాన్ని గౌర వించేవాడు దొరక్కపోతాడా?" అంటూ తల్లిని సముదాయించింది!

కానీ దుర్గ అనుకున్నంత సులభం కాలేదు దొరకటం అనేది. ఆమె ఉద్యోగాన్ని గౌరవించే వాడు రాకపోగా మరో రెండు సంవత్సరాలు అలాగే గడిచిపోయాయి. ఆ బాధను వృత్తిధ ర్మంలో మరిచిపోయేది తాత్కాలికంగా!

రామయ్యగారు ఓ రోజు ఆఫీసునించి ఇంటికి నడచిరాలేదు. జీపులో వచ్చారు శవంగా మారి! ఆఫీసులో గుండెపోటుతో మర ణించారు.

తండ్రిలేనిలోటు కూతుళ్ళకు అశనిపా తంలా తగిలింది. తండ్రి తన పెళ్ళి చూడ కుండానే వెళ్ళిపోయారనే బాధ దుర్గలో ఎక్కు వై భోరున విలపించింది.

శాంతమ్మ భర్త పోవటంతో దాదాపు పిచ్చి దైంది.

★ ★ ★

మరో సంవత్సరం గడిచింది!

శాంతమ్మ పిల్లలు తండ్రిపోయిన దుఃఖంనించి కాస్త తేరుకున్నారు.

ఓసారి స్నేహితురాలి పెళ్లికి వెళ్లింది దుర్గ. ఆ పెళ్ళిలో పెళ్ళి కొడుకు తరఫున రాఘవ వచ్చాడు. రాఘవ పదేపదే తనతో చూపుకల పటం గమనించింది దుర్గ! ఒకటికి రెండుసా ర్లు చూపు మరల్చుకున్నా తనకు తెలీకుండానే అతనికోసం వెతికి చూపులు కలిపింది చిత్రంగా!

సాయంకాలంలోగా రాఘవ ధైర్యం చేసి మాటలు కలిపాడు.

అతని ఊరు పేరు, ఉద్యోగం అన్నీ సేక రించింది కానీ తన పేరు, ఊరు తప్ప ఉద్యోగం గురించి చెప్పలేదు.

రాఘవ ఏమాత్రం మొహమాటంలేకుండా "చూడండి దుర్గగారూ! మీరు నాకు నచ్చారు. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను" అంటూ డైరెక్టుగా చెప్పేశాడు.

దుర్గ సిగ్గుపడలేదు సిగ్గుపడే వయసు దాటింది కాబట్టి! మీ పెద్ద వాళ్ళను తీసికొని మా యింటికి వచ్చి మా అమ్మతో మాట్లాడండి! అంటూ అడ్రసిచ్చి బస్సెక్కేసింది!

మరో వారానికి పెళ్ళి చూపులు నిరాడంబ రంగా జరిగాయి.

దుర్గ శాంతమ్మతో - రాఘవతో తన పరి చయం, అతనికి అడ్రసు ఇచ్చిన సంగతి చెప్పటంతో ఆమె తెలివిగా ప్రవర్తించి దుర్గ పోలీసుద్యోగం గురించి దాచాలనుకుంది.

కానీ రాఘవ తల్లిదండ్రులకు దుర్గ ఉద్యోగం సంగతి తెలిసిపోయింది. ఫలితంగా మునలిదంపతులకు ఆదుర్దా, గాభరా ఎక్కువ య్యాయి.

ఎందుకంటే అమ్మాయి లక్షణంగా కుందన పుబొమ్మలా ఉంది. మధ్యతరగతి కుటుంబం. మనలాగే కష్టసుఖాలు చిన్న పెద్ద, వినయవి ధేయతలు తెలిసే ఉంటాయి. ఆ ఒక్క పోలీ సు ఉద్యోగం నెపం పెట్టుకుని ఈ సంబంధం కూడా తిప్పికొడతాడేమోనని రాఘవ తల్లి భయపడిపోయింది. భర్త చెవిలో ఊది పక్కకు లాక్కెళ్ళి శాంతమ్మతో మాట్లాడింది.

"ఆ పోలీసు ఉద్యోగమంటే వాడికీ పడదు. నిజానికి మాకూ పడదు. కానీ అమ్మాయి, అబ్బాయి ఇష్టపడ్డారు. పెళ్ళయ్యాక ఉద్యోగం మానటమో లేక వాడికిష్టమైతే చేయటమో జరుగుతుంది. ఆ మూడు ముళ్లు పడేదాకా ఆ ఉద్యోగం గురించి మీరు కానీ, అమ్మాయికానీ, మీతరఫువాళ్ళుకానీ నోరుజారకండి" అందా విడ!

'కాగల కార్యం గంధర్వులే తీర్చారు'! అన్న ట్లయింది శాంతమ్మ పరిస్థితి

"అదెంత భాగ్యం వదినగారూ! వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు పెద్ద

లు. మనమాడుతున్నది ఒకే ఒక అబద్ధం! మీరంతగా చెప్పాలా! మీరు నిశ్చింతగా ఉండండి! అన్నీ నేను చూసుకుంటాను!" అంది శాంతమ్మ.

అంతే! పెళ్ళి జరిగిపోయింది నిరాడంబరంగా తిరుపతిలో.

పోలీస్ డిపార్టుమెంటువారికి రేపు పెళ్ళనగా ఈరోజు పత్రికలు పంచింది దుర్గ! "అదేమిటి దుర్గా! పెళ్ళి తిరుపతిలోనా! అదేమిటి పాతకాలం పద్ధతి! ఏ కళ్యాణ మండపంలోనో గ్రాండ్‌గా చేసుకోలేకపోయావా?" అన్నారు కొలీగ్స్!

"మావారి బామ్మగారికి ఒక మొక్కుందట! పెళ్ళికూతురు పెళ్ళికొడుకుతోపాటు బంధుజనం స్నేహితులు అందరం తిరుపతి కొండకు నడిచి వచ్చి మరీ పెళ్ళి చేయిస్తాను అంటూ! అందుకోసం తిరుపతిలో ఏర్పాటు చేయవలసి వచ్చింది. నిజానికి నాకూ ఈ ఊళ్ళోనే మీ అందరి సమక్షంలో చేసుకోవాలనే ఉంది. ఏం చేస్తాం! ఆ ముసలావిడ చాదస్తంవల్ల మీరందరూ కూడా తిరుపతి కొండకు నడిచిరావాల్సి వస్తోంది" అంది దుర్గ.

"అమ్మ బాబోయ్ కొండను ఎక్కటమే! నడిచే! సరేలే నావల్లకాదంటే, నావల్లకాదంటూ!" అందరూ జారుకున్నారు. దుర్గకు కావలసింది కూడా అదే! వాళ్ళంతా పెళ్ళికి రావటం ఆమెకు ఇష్టంలేదు. తండ్రి లేడు. దానికి తోడు పెళ్ళికి ఈ ఉద్యోగం సమస్యగా మారింది. తనకేమో వయసు మీరిపోతోంది. కాలు బయటపెడితే వ్యాఖ్యానాలు. ఇవన్నీ భరించటంకంటే ఒక అబద్ధం చెప్పి పెళ్ళి చేసుకుంటే ఆ తర్వాత చూసుకోవచ్చు! అనుకుంది.

'దుర్గకు మాత్రం ఉద్యోగం మానటం ఇష్టంలేదు. పెళ్ళయితే చూద్దాం ఆ తరువాత సంగతి. ఎంతటివారైనా కాంతదాసులేనని అంటారు గదా! ఆ బడిపంతుల్ని నా ఉద్యోగం మానమనకుండా ఉండేలా మార్చలేనా?' అనుకుంది దుర్గ!

కానీ ఆమె అనుకున్నంత సులభంగా తేలలేదు సమస్య! ఎక్కడన్నా మామే కానీ వంగతోట దగ్గర కాదు! అన్నట్లయింది దుర్గ పరిస్థితి.

సూట్‌కేసు పట్టుకుని ఆటో దిగుతున్న కూతుర్ని చూసి ప్రాస్పడిపోయింది శాంతమ్మ.

"ఏమిటే! ఏమైంది అల్లుడుగారేరీ! ఆ మొహమేమిటి అలా ఉంది!" అంది కంగారుగా.

తల్లి మాటలకు జబాబు చెప్పకుండా "చండీ! ఆటోకు డబ్బులిచ్చి పంపు" అంటూ సూట్ కేసు ప్రక్కన పడేసి బాత్రూంలో దూరింది.

"ఏమిటి దుర్గా ఏం జరిగింది" బాత్రూంముందు నుంచునే అడిగింది శాంతమ్మ.

"ఆయనకు నా ఉద్యోగం అంటే అలర్జీట. రిజైన్ చెయ్యాలిట. చెయ్యనన్నాను. చెంపదెబ్బ కొట్టాడు. సూట్‌కేసు సర్దుకుని వచ్చాను" అంది లోపల్నించే!

"అయ్యో! కాస్త సర్దిచెప్పి శాంతపరచలేకపోయావుటే" అంది శాంతమ్మ.

"ఇంకెలా సర్దిచెప్పటం? ఏ డిస్కోశాంతి డ్యాన్స్ చేసి శాంతపరచాలా? ఆయనే వస్తార్లే! నాకు డ్యూటీకి టైం అయింది తప్పుకోవే" అంటూ బయటపడింది.

"ఏమిటే! ఆ దురుసు! భర్తంటే భయం భక్తి లేకుండా! పోనీ రాజీనామా చేస్తానని చెప్పలేకపోయావా?"

"ఏమిటమ్మా! రాజీనామా చెయ్యమని నువ్వే చెప్పేది. ఆ ఉద్యోగం కోసం ఎన్ని తిప్పలు పడ్డాము? నువ్వేం దిగులుపడకు. వారం తిరక్కుండానే నాకోసం ఆయనే వస్తారు చూస్తుండు" అంటూ తల్లి బుగ్గలు నిమిరి బూట్లు టకటకలాడించుకుంటూ డ్యూటీకి వెళ్ళిపోయింది దుర్గ!

పెనంమీదినించి పొయ్యిలో పడ్డట్టయింది శాంతమ్మ పరిస్థితి. భర్త ఫోటోవైపు దీనంగా చూసింది!

"ఆడపిల్లకు పోలీసుద్యోగం కుదరదు. ఒకవేళ కుదిరితే 'పెళ్ళి' కుదరదు. పెళ్ళి కుదిరితే 'సంసారం' కుదరదు. ఇది 'అమెరికా' కాదు. 'భారతదేశం'. అందులోనూ 'ఆంధ్ర

దేశం' అంటే విన్నావూ! అంతా ఆడపె త్తనం!'' అంటూ ఫొటోలోంచే పళ్ళు నూరాడు రామయ్య!

''మీరు చచ్చినా నామీద సాధింపు మానలే దు'' అంటూ ఇవతలికొచ్చేసింది.

''ఎవరితోనే మాట్లాడుతున్నావు!'' అంది వండిక తల్లితో.

★ ★ ★

దుర్గ జీవితంలో రాఘవకోసం నిరీక్షణలో ఆరునెలలు గడచిపోయాయి.

ఈ ఆరునెలల కాలంలో తల్లితో రెండు మూడు ఉత్తరాలు రాయించింది. జవాబు లేదు. అత్త మామల దగ్గరకు తల్లిని రాయబా రమంపించింది. కానీ రాఘవ తల్లిదండ్రులు కూడా ''ఉద్యోగానికి రిజైన్ చేస్తే పోలా! ఆడ పిల్లకంత పట్టింపు తగదు. ఈ విషయం దాచి వాడికి ద్రోహం చేశాము'' అంటూ కన్నీరు కార్చారుట.

శాంతమ్మ సహనం నశించింది. ''పోతే పోయింది, వెధవ ఉద్యోగం. ఇంటా బయటా మనశ్శాంతి లేకుండా చస్తున్నాను. చిన్నపిల్లకు పెళ్ళికావటం కష్టం'' అంటూ నచ్చచెప్పబో యింది కూతురికి!

దుర్గమాత్రం ససేమీరా ఒప్పుకోలేదు. ఇంత మంచి ఉద్యోగం వదిలేయాలా?... ఊహూ... దానికంటే ముందు అతను చెప్పినట్లు నడు చుకోవాలా? అనుకుంది. దీనికి ముఖ్యంగా 'అహం' అడ్డువస్తోంది. ఏమైతే అదే అవు తుంది, చూద్దాం, ఏం జరుగుతుందో! అను కుని అలాగే నిరీక్షించసాగింది.

ఓరోజు చండి హడావిడిగా ''అక్కా... అక్కా బావగారికి ఈ వూరు ట్రాన్స్‌ఫర్ చేశారే'' అంది పరధ్యానంగా కూర్చున్న దుర్గ దగ్గరకు వచ్చి!

దుర్గ ముఖం వికసించింది.

''నీకెలా తెలును'' అంది దుర్గ.

''ఎలా తెలుసేమిటి! మాకు తెలుగు లెక్చ రర్ నెలనించి లేరు. ఈరోజు తెలుగు లెక్చరర్ వచ్చేశారు మా క్లాసుకు బావగారి రూపంలో!

''ఆయన నిన్ను గుర్తుపట్టారా?''

''ఆ! క్లాసయ్యాక నేనే ఆయన్ని పలకరించా ను. మీ అమ్మా, అక్కయ్యా బావున్నారా? అని ఆయనా పలకరించారు.

ఆ<...! అక్కయ్యను పంపించనా! అన్నా ను.

నేనడిగింది మీ పెద్దక్కయ్యను గురించి అన్నారు వెంటనే సీరియస్‌గా''

''ఆ... అలాగా?''

''నీవు కూడా ఏ మిలిట్రీలోనో చేరలేకపో యావా అని కూడా అన్నారే వెటకారంగా''

''నువ్వేమన్నావు?''

''నేనేం మాట్లాడలేదు. నవ్వి ఊరుకున్నా ను. ఎక్కడుంటున్నారు? రండి ఇంటికెళదాం! అన్నాను.''

''బ్రహ్మచారులంతా ఎక్కడుంటారు? ఓ నలుగురం కలిసి రూం తీసుకున్నాము అని అడ్రసిచ్చారే''

''అంతేనా?''

''ఇంటికెళదాం రండి బావగారూ'' అని బ్రతిమాలాను.

''ఏ ఇంటికి? ఈ ఊళ్ళో నాకు బంధువులెవ రూ లేరు. కొత్త పరిచయాలేర్పరచుకోవటం నాకిష్టంలేదు. నా ఖర్మకాలి ఆ కాలేజీలో రాజకీ యాలు జరిగి ఈ ఊరు ట్రాన్స్‌ఫరయింది. డబ్బు ఖర్చుపెట్టి అయినా సరే ఈ వూరినించి ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోతాను. ఈ లోగా నీవు క్లాసులోగానీ బయటకానీ నన్ను 'బావా గీవా' అంటూ సంబోధించి మాట్లాడకు. నాకసలు పెళ్ళికాలేదని అందరికీ చెప్పేశాను'' అంటూ వెళ్ళిపోబోయారు! నాకు ఉక్రోషం ముంచుకొచ్చింది.

''బావగారూ!'' అని గట్టిగా పిలిచాను. వెన క్కితిరిగి అలా ''పిల్లవద్దన్నానా'' అన్నారు.

''అక్కమొగుడ్ని బావా అని పిలవక తాతా అని పిలుస్తారా నేనిలాగే పిలుస్తాను ఏం చేసుకుంటారో చేసుకోండి! అన్నట్టు ఈ ఊరి నించి ట్రాన్స్‌ఫర్ మీరు చేయించుకోలేరు అన్నాను ఛాలెంజ్‌గా!''

''ఏం ఎందుకని!''

''ఈ ఊళ్ళో 'అయస్కాంతగని' ఉంది! ఇక్కడికి వచ్చినవాళ్ళు ఇక్కడే రిటైర్ అయ్యేవ

రకు అలా సెటిల్ అవక తప్పదు. అంచేత జీవితాంతం నాతో బావా అని పిలిపించుకోక తప్పదు. వస్తాను బావగారూ!అని గట్టిగా అనేసి వచ్చేశాను. బావగారు బిక్కమొహం పెట్టుకుని దిక్కులు చూస్తూ వెళ్ళిపోయారు'' అంది చండిక పగలబడి నవ్వుతూ!

దుర్గకు కూడా నవ్వొచ్చింది. "మంచిపని చేశావు'' అంది చండిక బుగ్గలు గిల్లుతూ!

"చండీ! ఆయన నీకు మొగుడయ్యుంటే బావుండేది. బాగా ఏడిపించి ఏడు చెరువుల నీళ్ళు త్రాగించేదానివి!'' అంది దుర్గ.

"అమ్మో! ఆ చాదస్తపు మనిషి బావ అయినందుకే బాధపడుతున్నాను. ఇంక భర్తగానా! వద్దులే తల్లీ. నా రూటే వేరు!'' అంది!

"ఏంటే రూటు గీటు అంటూ రౌడీ మాటలు మాట్లాడుతున్నావు. అమ్మతో చెప్పనా? అన్నట్టు మరిచాను. మొన్నామధ్య పార్కులో ఒకబ్బాయితో కనిపించావట. మాకొలీగ్ చెప్పింది నిజమేనా?''

"చెప్పిందా! అనుకున్నా... మీ పోలీసోళ్ళకు ఇంకేం పనిలేదా? అయినా పార్కుల్లో ఏ ప్రేమికుల జంటలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటుంటే అక్కడా లాఠీ పట్టుకు తిరుగుతారేంటి మీ ఖాకీలు'' అంది చండి.

"నోర్మూయ్! అసలువిషయం చెప్పు. ఎవరా అబ్బాయి. పెద్దవారున్నారు అనే భయం కూడా లేకుండా ఇంటావంటా లేని ప్రేమలూ దోమలూ ఏమిటే!'' అంది గద్దిస్తూ దుర్గ.

"ఆ! ఆ! పెద్దవారున్నారు. నీ పెళ్ళి చేశారు. ఇదిగో... ఇలా అయింది! అందుకే నా పెళ్ళి నేనే చేసుకుంటాను

"ఆగు... ఆగు... ఏమిటా కోపం. అలాగని ఏ దారినపోయే దానయ్యనో చేసుకోనులే. మనిషిని బాగా స్టడీ చేసి, నాకతను నచ్చి నేనతనికి నచ్చి, డ్యూయెట్లు వగైరా...''

టపీమని మొట్టింది దుర్గ.

"అసలు విషయం చెప్పమంటే ఏమిటా వాగుడు ఎవరా అబ్బాయి?''

"అతను అబ్బాయికాదు. ముదిరిన బ్రహ్మచారి! పేరు శ్రీశైలం''

"అదేంటే పేరు శ్రీశైలం. తిరుపతి, అన్నవరం లాగా! ప్చ్! పేరు బాగాలేదు'' అంది దుర్గ!

"మరే! పేరు బాగుంటే మన జాతకానికి పనికిరాదు. వయసు దాదాపు ముప్పై! మాకాలేజీ లైబ్రేరియన్! అందంగానే ఉంటాడు. అమాయకుడుకాదు. దుర్మార్గుడూ కాదు. అలా చూడకు! నేనతని బుట్టలో పడనులే! మీ అందరి సమక్షంలోనే పెళ్లి చేసుకుంటాను. కాకపోతే ఇంకో సంవత్సరం అతన్ని పరీక్ష చేయాలి''

"అంటే!''

"సహనాన్ని పరీక్షించటం అన్నమాట''

"అలాగా! అతని గుణగుణాలేమిటి చెల్లెమ్మా! వర్ణించి చెప్పు!'' అంది దుర్గ నాటకఫక్కీలో.

"వినుము సోదరీ! ఆ... రడుగులు... ఆగు నోరు తెరవకు. ఆరడుగులు లేడు అయిదు అయిదు. లావు సినిమాలో చంద్రమోహన్ అంత. అదిగో మళ్లీ నోరు తెరిచావు. అంత లావులేడులే. బుగ్గలు గొల్లపూడివి! కళ్లు చిరంజీవివి! ముక్కు వెంకటేష్! పెదాలు నాగార్జున! జుట్టు రాజశేఖర్...''

"ఆపు... ఆపు... వెరసి వినాయకుడిలా ఉన్నట్టున్నాడు. నరేగానీ గుణం ఎలాంటిదో చెప్పి చావు'' అంది దుర్గ.

"ఆc... అదే చెప్తొస్తున్నాను. గుణం మంచిదే! పరస్త్రీల వంక కన్నెత్తి చూడడు, నా వైపు తప్ప! అదిగో ఏమిటి మూతి తిప్పుతున్నావు? అపర శ్రీరామచంద్రుడు తెలుసా! కాకపోతే అతని దగ్గర ఓ వింత అలవాటుంది. ప్రతి దానికీ ఫ్రీ పాసు సంపాదించటం, ఆ సంపాదించటంలో ఓ థ్రిల్ అనుభవించటం, కాస్త పిసినారి కూడా!''

"ఏ ఊరికి వెళ్లాలన్నా ఆర్టీసీ బస్‌లో ఫ్రీ పాసు, రైల్వేలో ఫ్రీ పాసు. సిటీలో వచ్చిన ఎగ్జిబిషన్, సర్కస్, సినిమాలన్నింటికి ఫ్రీ పాసు. పొదుపు గురించి తెగ లెక్చరిస్తాడు''

"లెక్క ప్రకారం నిన్ను కూడా పొదుపుగానే ప్రేమిస్తున్నాడన్నమాట. డేంజర్ కేసే!'' అంది దుర్గ.

"నువ్వు నోర్మూయ్! నీ పోలీసుబుద్ధి ప్రదర్శించకు, డేంజర్ కేసు, గాడిద గుడ్డు కేసు

అంటూ! ప్రేమించటానికి టాక్సు లేదు. అది తెలిసి చస్తే కదా నీకు'' అంది చండి! ''నిన్న సాయంకాలం ఏం జరిగిందో తెలుసా?''

''ఏమిటి ఫ్లాష్‌బాక్ స్టోరీనా నాకు డ్యూటీకి టైం అవుతోంది వెళ్లాలి!'' అంటూ లేచింది దుర్గ.

''అన్నట్టు చండీ! మీ బావగారి అడ్రను ఇవ్వు!''

''ఏం వెళతావా?'' అంది చండి!

''అంత సులభంగా వెళతానా! ఆయనే వస్తారు చూస్తుండు. ఏ ఏరియాలో ఉన్నారో కనుక్కుందామని'' అంది దుర్గ అక్కడినించి వెళ్లిపోతూ!

''అమ్మో! నేనూ వెళ్లాలి, శ్రీశైలంగారు ఎగ్జిబిషన్‌కు తీసుకు వెళతానన్నారు.

''ఏమిటి ఫ్రీ పాసు మీదే'' అంది నవ్వుతూ దుర్గ.

★ ★ ★

ఎగ్జిబిషన్ దగ్గర వెయిట్ చేస్తూ నిల్చున్నాడు శ్రీశైలం.

''ఏమిటి చండీ ఇంతలేటు... పద పద!'' అంటూ లోపలికి తీసుకెళ్లాడు. ఎగ్జిబిషన్ అంతా తిరిగి ఓ చోట కూర్చున్నారు. ''అవునూ! దీనికి పాసు ఎలా సంపాదించారండీ'' అంది చండి!

''మా చిన్న చెల్లి అత్తగారి చెల్లెలు మొగుడి బావమరిదికి బావ మరిది చెల్లి మొగుడు కలెక్టాఫీసులో పని చేస్తున్నాడు. కలెక్టరు ఆర్డరు లేనిది ఎగ్జిబిషన్ పెట్టరుకదా! అలా సంపాదించానన్న మాట'' అన్నాడు బుజాలెగరేస్తూ.

చండికకు ఆ వరసలు చూస్తే వళ్లు మండింది. ''ఇంతకీ ఫ్రీ పాసు ఇచ్చినతను మీకే వరస అవుతాడు?'' అంది.

''అయితే బావమరిది లేకుంటే తమ్ముడు ఏదో ఒకటి! మనకెందుకు ఓసారి బామ్మరిదీ అంటాను. ఇంకోసారి తమ్ముడూ అంటాను!'' అన్నాడు వళ్లికిలిస్తూ.

''ఏమైనా తిందామా ఆకలేస్తోంది!'' అంది చండి.

''అయ్యో! ఎగ్జిబిషన్ తిండి పదార్థాలు చాలా రేటు చండీ! ఉండు'' అంటూ రెండు అప్పడాలు తెచ్చాడు.

ఏ షానీ పూరీనో తిందామనుకున్న చండికి చాలా కోపమొచ్చింది.

''నీతో ఇలా ఎగ్జిబిషన్‌కు ఖర్చు లేకుండా రావటం ఇలా అప్పడం తినటం నాకు చాలా సంతోషంగా ఉంది చండీ! నీకెలా ఉంది?'' అన్నాడు.

పిచ్చి కోపం వచ్చింది చండికి. తమాయించుకుని ''నాకేం పెద్ద సంతోషంగా లేదు బాబూ! అమధ్య బెంగుళూరులోననుకుంటా ఎగ్జిబిషన్‌లోనికి ఓ పిచ్చాడు స్టెన్‌గన్‌తో దూరి నలుగురిని చంపేశాట్ట! ఆ వార్త గుర్తొస్తోంది!'' అంది చండి ఓరగా శ్రీశైలం వైపు చూస్తూ.

అతని మొహం మాడిపోయింది. ''వెళదాం పద!'' అంటూ లేచాడు ఎవడైనా స్టెన్‌గన్‌తో వస్తున్నాడేమోనని చుట్టూ చూస్తూ.

★ ★ ★

ఆ రోజు రాఘవ, అతని రూం మేటు శేఖర్ సినిమా కెళ్లాలని బయల్దేరారు. ఇద్దరూ కలిసి స్కూటర్ మీద వెళ్లారు. ట్రాఫిక్ జంక్షన్‌లోకొచ్చేసరికి స్కూటర్ సడన్‌బ్రేక్‌తో ఆగింది.

''ఏమిటి ఆనంద్!'' అన్నాడు రాఘవ ముందుకు చూస్తూ. ఆ వెంటనే ఉలిక్కిపడ్డాడు.

అక్కడ ట్రాఫిక్ పోలీను పక్కన నిలబడి తనూ ట్రాఫిక్ కంట్రోల్ ప్రయత్నాలు చేస్తోంది దుర్గ. ఆమె కాకుండా అక్కడ నలుగురైదుగురు యస్.ఐ.లు ఓ పదిమంది దాకా ఆడ, మగ పోలీసులు నిల్చున్నారు. ఎవరో మంత్రి వస్తున్నాడని జనం అనుకుంటుండగా రాఘవకు వినిపించింది. సిగ్నల్ లైటు వెల్గగానే ముందుకు వెళ్లింది స్కూటర్. తల తిప్పి చూసిన రాఘవ దుర్గ తన వేపు చూడటం గమనించాడు. మరుక్షణంలో స్కూటర్ వేగానికా దృశ్యం కనుమరుగైంది.

''ఆ యస్.ఐ. పిల్ల అరముగ్గిన జాంపండులా ఉంది కదూ గురూ!'' అన్నాడు ఆనంద్!

వళ్లుమండింది రాఘవకు. ''ఏం పండో ఎవరు చూశారు?'' అన్నాడు చిరాగ్గా.

''చూళ్లేదా? బ్యాడ్‌లక్ అక్కడున్న లేడీ పోలీసులందరిలో ఆ పిల్ల వెలిగిపోతోంది కద

# ఏరిన ముత్యాలు

★ ఆడపిల్లల వద్ద రహస్యాలు మగపిల్లల వద్ద నున్న టపాకాయలతో సమానం. వాటిని బయటపెట్టేదాకా వారికి నిద్రపట్టదు.

— క్రాబే

★ రహస్యాలను ఎన్నడూ కాగితంపై రాసి పెట్టుకో కూడదు. అది పైకి విసిరిన రాయితో సమానం. ఎప్పుడు నెత్తిన పడుతుందో చెప్పలేం.

— కాల్డెరాన్

★ మనం మన రహస్యాలనే దాచలేనప్పుడు ఇతరులు మన రహస్యాలను దాచగలరని ఎలా విశ్వసించగలం.

— లారోష్‌ఫోకో

★ నీ రహస్యం శతృవుకు తెలియకుండా ఉండాలంటే ఏ మిత్రుడితోనూ దాన్ని గురించి చర్చించకు.

— ఫ్రాంక్లిన్

★ రాయబారి అయినవాడు నోరు తెరవడానికి ముందు ప్రతిసారి ఈ మాట అనవచ్చునా, అనకూడదా అని తనను తాను ప్రశ్నించుకోవాలి.

— కె.పి.యస్. మీనన్

★ రాయబారి అనేవాడు కళ్ళు, చెవులు ఎప్పుడూ తెరుచుకొని ఉండాలి. నోరు మాత్రం మూసుకొని ఉండాలి.

— నెహ్రూ

★ స్త్రీ తాను ప్రేమించిన పురుషునికి తన శరీరమేకాదు, సర్వస్వం అర్పిస్తుంది. అటువంటి అర్పణే స్త్రీకి పరమార్థం. అయితే అట్టి అర్పణకు పురుషునికి అర్హత ఉండాలి. స్వార్థపరిత్యాగం, స్త్రీపట్ల గౌరవం, అభిమానం, కామాతీతమైన వాంఛ- అన్నీ ఉన్న పురుషుడే అర్హుడు.

— చలం

★ వేదాంతిలాగ మాట్లాడటం, రాయటం పురుషులకు తేలిక. కాని తెలివిగా వ్యవహరించవలసివచ్చినప్పుడే వారికి ఇబ్బంది.

— రివరోన్

★ పతనమైన మగవాడే ఆడదాని పతనం గురించి మాట్లాడతాడు. తాను ఔన్నత్యాన్ని సాధించకుండా ఆడవారి ఔన్నత్యాన్ని గురించి మాట్లాడలేడు. స్త్రీలపట్ల మనకున్న గౌరవాభిమానాలనుబట్టి మన సంస్కారం బయటపడుతుంది.

— ఎ. మార్టెన్

★ జీవితం బాధలతో నిండినప్పుడు, అన్ని ఆశలు అడుగంటినప్పుడు, ప్రపంచమంతా 'పో' అంటుంది. అయితే శ్మశానం 'రా' అంటుంది.

— ఆర్థర్

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/–, రూ. 75/–, రూ. 50/– చొప్పున, మరో మూడింటికి రూ. 25/– చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

--- కూపన్ ---

సెప్టెంబర్ 'చతుర' నవల **'విడాకులు'**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

య్యా! అపర ఋష్యశృంగుడిలా కళ్లు మూసుకున్నావా?''

రాఘవ నోరు మెదపలేదు. "ఆ పిల్లకు పెళ్లయిందో లేదో తెలుసుకుని ట్రై చేద్దామా?"

"ఏమిటి ట్రై చేసేది?" వళ్లు నూరాడు రాఘవ.

"ఛీప్‌గా అనుకోకు గురూ! పెళ్లి కాకుంటే పెళ్లి చేసుకుందామని. ఆ పోలీస్ డిపార్టుమెంటు పిల్లను చేసుకుంటే లాభాలేకానీ నష్టం లేదు"

"ఏమిటో ఆ లాభాలు"

"ఈ కాలంలో పోలీస్ డిపార్ట్‌మెంటు అంటే జనాలకు భయం, అయిందానికీ కానిదానికి లాకప్‌లో పెట్టేస్తారని. మనింట్లోనే ఓ పోలీనుంటే మన జోలికెవరూ రారు. ఉదాహరణకి మొన్న మన పక్కింటతను వంపునీళ్లకోసం ఎంత గొడవపెట్టుకున్నాడు. పైగా న్యూసెన్సు కేసు క్రింద పోలీను కంప్లయింటు ఇస్తానని బెదిరించాడు. మనమేమో బడిపంతుళ్లమా? ఆ హైరానా మనకి పడదని నేనే తగ్గానుకదా!''

రాఘవ మనసు మనసులోలేదు. తెలియని బాధ మనసులో వేధిస్తూనే ఉంది. ఆ బాధకు కారణం తను తాళికట్టిన భార్యను తనముందే వర్ణిస్తున్నందుకో, తన భార్య చేస్తున్న ఉద్యోగాన్ని పొగుడుతున్నందుకో అర్థం కాలేదు రాఘవకు.

"అవును రాఘవా! నిన్ను చూస్తుంటే నాకో అనుమానం వస్తోందయ్యా!"

"ఏమిటది?" అనహనంగా అడిగాడు రాఘవ.

"మేమందరం అమ్మాయిల్ని చూడగానే ఏదో ఒక కామెంట్ చేస్తుంటాం. నువ్వు మాత్రం స్పందించవు. కొంపదీసి... పోతులూరి టైపు కాదుకదా"

ఉలిక్కిపడ్డాడు రాఘవ. 'పోతులూరి' అంటే కాలేజీలో అటెండరు. వాడికి ముగ్గురు పెళ్లాలు. పిల్లలులేరు. భార్యలలో ఏ లోపంలేదన్నారు. అందరూ అతన్ని 'చుక్క అయిదు' అంటూ గేలి చేస్తుంటారు పరోక్షంగా! వాడితో తనను పోలుస్తున్నాడు ఆనంద్. రాఘవ మనసు పరిపరి విధాలపోతోంది. ఈ ప్రపంచం తననిలా బతకనిచ్చేలాలేదు. దుర్గ ఆడది అయి వుండి కూడా మగరాయుడిలా డ్రస్సు వేసుకుని మగడు వదిలి పెట్టాడనే బాధ ఆవగింజంత కూడా లేకుండా దర్జాగా బతుకుతుంటే మగవాడయి ఉండి తనకేమిటి ఇలాంటి నీలాపనిందలు, ఖర్మ కాకపోతే!

ఆరోజునించి దాదాపు నెల రోజులు మనసు మనసులోలేదు సరికదా ఎవరైనా తనవేపు మామూలుగా చూసినా, తన ఆకారం ఎగతాళిగా ఇంకోరకంగా కనిపించి అమ్మో! అంటూ పక్కకు పారిపోతున్నట్లు ఊహించుకుని బాధపడసాగాడు. అలాగని అమ్మాయిల్ని దొంగచూపులు చూడటం, కామెంట్ చేయటం తనకు చిన్నప్పటినుంచి సాధ్యంకాని విషయాలు. భయం కూడా! పోనీ పెళ్లయిందని తన పెళ్లాం పోలీను ఇన్‌స్పెక్టర్ అని వదిలేశానని చెబితే! ఎందుకో అలా చెప్పటానికి కూడా మనసొప్పటం లేదు! ఏదీ చెయ్యకపోతే తనను జీవితాంతం ప్రశ్నార్థకం చూపులు ఈ సమాజం ఇలా చూస్తుంటే భరించలేను అనుకున్నాడు రాఘవ.

ఓసారి మనసు బాగోలేక పార్కుకెళ్లి కూర్చున్నాడు. ఇద్దరు ముసలాళ్లు తనక్కాస్త దూరంలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

"చెట్టంత మగవాడు పెళ్లి చేసుకోలేదంటేనూ, ఒకవేళ పెళ్లి చేసుకున్నాక పెళ్లాం వదిలేసిందంటేనూ తప్పకుండా ఆ... లోపమే అయ్యుంటుంది" అంటున్నాడు ఓ ముసలాయన.

"ఛ! ఊరుకో! అలా మాట్లాడకు! అతన్ని చూస్తే అలా అనిపించటంలేదు. మంచి స్ఫురద్రూపి!"

"పైకి చూడ్డానికి ఎత్తుగా అందంగా ఉంటే మాత్రం ఆ లోపం ఉండకూడదా? పెళ్లాం వదిలేసింది సరే. ఇంకో పెళ్లి చేసుకు చావచ్చుగా. ఆ మనిషికసలు ఆ ధ్యాసే లేదు"

"లోగుట్టు పెరుమాళ్లుకెరుక. అన్నట్టు ఆ విషయం కనుక్కుని సరిపెట్టే వారెలేరు. మధ్యన మనకొచ్చింది చావు"

వాళ్లు తన గురించి కాదు మాట్లాడేది కానీ తనను ఆ ఇద్దరు చెరో ప్రక్కా నిలబడి మాటలనే చెర్నాకోల్‌తో ఝుళిపిస్తున్నట్లు ఫీలయ్యాడు రాఘవ.

"ఛీ! ఛీ! " అనుకుంటూ లేచి నిలబడ్డాడు

రాఘవ.

"ఇదేమిటి ఇతను ఇలా ఛీత్కరించు కుంటున్నాడు. ఇతనిదీ అలాంటి కేసేలా ఉంది. పాపం మనిషి ఒడ్డూ పొడుగూ ఉన్నాడు. దేవుడు ఏవో ఒక లోపం పెట్టంది మనిషిని భూమ్మీదకు విసిరెయ్యడుకదా!"

గట్టిగానే మాట్లాడుకుంటున్నారు వాళ్లు. ముసలాళ్లనిద్దరినీ పీక పిసకాలనిపించింది! కానీ ఏం చేయలేక మిర్రి చూసి పళ్లు నూరాడు.

"ఉన్నమాటంటే ఉండూరు అచ్చిరాదని పెద్దలు ఊరికే అన్నారా? ఇలాంటి వారికి పౌరుషానికి కొదవుండదు"

ముసలాయన వాగుతూనే ఉన్నాడు. జుట్టు పీక్కోవాలనిపించింది రాఘవకు! ఓ నిర్ణయానికొచ్చాడు. ఈ రోజునించి కనిపించిన అమ్మాయినల్లా ఫ్రెండ్సు ముందర కామెంట్ చెయ్యాలి. బీట్లు కొట్టాలి! ఇలా చేస్తేనే తన సమస్యకు పరిష్కారం, మనశ్శాంతి దొరుకుతుంది.

మనసు తేలికపడింది ఆ నిర్ణయం మనసు లోనికి రాగానే! రూం చేరుకునేసరికి రూం ముందర జనం గుమికూడి ఉన్నారు. అంతా గోలగోల.

"ఏరా! నీకు చెల్లెళ్లు, అక్కలు లేరా! చీర కనిపిస్తే చాలు విజిలేస్తావా?"

"దారంట రానివ్వడు! పోనివ్వడు! వీడి చింపాంజీ మొహానికి కామెంట్లు"

"స్కూల్లో లెక్చరర్ పనిచేసే వాడా ఇలాంటి చేష్టలు!"

"ఇంకోసారి మా చెల్లినేమయినా అన్నావంటే ఏ కీలుకా కీలు విరగొట్టి వికలాంగుల లిస్టులో చేరుస్తాను జాగ్రత్త"

జనాన్ని తప్పించుకుని లోపలికెళ్లి చూశాడు రాఘవ. ఆనంద్ నోటినించి రక్తం కారుతోంది. కన్ను దగ్గర నల్లగా కమిలేలా కొట్టారు. విషయం పూర్తిగా అర్థమయి వాళ్లను నర్ది పంపేసరికి రాఘవకు తల ప్రాణం తోకకొచ్చింది.

రాఘవ దుర్గ ఇంట్లోంచి వెళ్లిపోయినవుడు "మగాణ్ణి. నాకేం బాధ మొగుణ్ణి వదిలేసి ఎలా బతుకుతుందో చూద్దాం" అనుకుని మీసం తిప్పుకున్నాడు.

కానీ మొట్టమొదటిసారిగా మగవాడికి కూడా బోలెడు కష్టాలుంటాయన్న సత్యం తెలుసుకున్నాడు. అమ్మాయిల్ని కామెంట్ చేయాలనుకున్న ఆలోచనను పూర్తిగా తుడిచిపెట్టేశాడు మనసులోంచి.



"చిరంజీవి రాఘవకు,

మీ తండ్రి దీవించి రాయునది.

బాబూ! నీవు కోడలితో సర్దుకుని కాపురం చెయ్యమని ఎన్ని ఉత్తరాలు రాసినా బదులు లేదు. మీ అమ్మ నీ దిగులుతో ఆరోగ్యం పాడుచేసుకుంటున్నది! కిందటి నెలలో మీ మామయ్యను నీ భార్య ఇంటికి పంపించాము, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి కాపురం చేసుకొమ్మని! ససేమిరా అందిట ఆ అమ్మాయి. ఇంక ఆ పిల్ల కాపురానికి రాదు... అని నిర్ధారణ అయింది. చివరికి నేనొక నిర్ణయానికొచ్చాను. ఆ అమ్మాయికి విడాకులిచ్చేసి నీకు మళ్లీపెళ్లి చేస్తాము. మీ అమ్మ ప్రాణం మీదికి తెచ్చుకోక ముందే నీ నిర్ణయం చెప్పు! లేదా నీవూ మొండికేసి తల్లిదండ్రుల ప్రాణం తీయాలనుకుంటే ఇంక ఉత్తరాలు రాయకు! మా మొహాలు చూడకు. నీ దారి నీది! మా దారి మాది. మేము చచ్చినా నీకు కబురు రాదు.

నీ తండ్రి.

రాఘవ ఆ ఉత్తరం చూసి చాలా బాధపడ్డాడు.

తన పెళ్లి అందరినీ బాధపెడుతోంది. ప్రపంచంలో ఎక్కడయినా ఆడపిల్లల గురించి తల్లిదండ్రులు బాధపడతారు. తనందుకు వ్యతిరేకం.

వెంటనే రిప్లై రాశాడు. మీరు చెప్పిన అమ్మాయిని పెళ్లి చేసుకుంటాను. కానీ విడాకులు తీసుకోకుండా పెళ్లి కుదరదు. ఇక్కడ నాకు తెలిసిన లాయరున్నారు. నెలలోపు విడాకులు తీసుకుని వస్తాను. మిమ్మల్ని బాధపెట్టాలని నాకేనాడూ లేదు. కానీ నా ఖర్మ ఇలా కాలింది. ఇంతవరకు జరిగినవి మర్చిపొండి. ఇక ముందు మీ మనసు నొప్పించను. అమ్మ ఆరోగ్యం జాగ్రత్త. నమస్కారములు...

మీ కుమారుడు రాఘవ

★ ★ ★

ఆ రోజంతా తీవ్రంగా నిద్రపోకుండా ఆలోచించాడు రాఘవ. ఒక నిర్ణయానికొచ్చి ఆ మరునటి రోజు సాయంత్రం ఆరు గంటలకు దుర్గ ఇంటికి వెళ్లాడు.

గేటు తీస్తుండగానే "అక్కా! బావగారొచ్చారే!" అంటూ కేకేసింది చండి!

లోపలనించి ఆదుర్దాగా బయటకొచ్చింది దుర్గ!

అప్పుడే డ్యూటీనించి వచ్చి స్నానం చేసి ఫ్రెష్‌గా ఉన్న దుర్గ కడిగిన ముత్యంలా ఉంది! దుర్గను చూసి ఒక్కక్షణం మనసు వశం తప్పి మైమరచి చూశాడు రాఘవ! దుర్గ కూడా భర్తను చూసి సంతోషంతో నోట మాటరాక నిలబడిపోయింది!

"కూర్చోండి బావగారూ! అంటూ కుర్చీ చూపించింది చండి. రాఘవ తెప్పరిల్లి కూర్చున్నాడు. అతని మనసు యధాస్థానానికి చేరుకుంది!

దుర్గ చిరునవ్వుతో "బావున్నారా!" అంది.

ఆ చిరునవ్వులో 'నువ్వెక్కడికి పోతావు! నా ఉద్యోగం వదలను! నీవే నా కొంగు పట్టుకు తిరగటానికి కుక్కలా వస్తావు! వచ్చి తీరుతావు కూడా!' అన్నట్టు రాఘవకు గోచరించి వళ్ళు మండిపోయింది!

ఇంతలో దుర్గ అమ్మగారు శాంతమ్మ వచ్చి "బావున్నావా బాబూ" అంటూ సంబరంగా పలకరించి "ఉండు కాఫీ తెస్తాను" అంటూ వెళ్ళబోయింది!

"ఫర్వాలేదు కాఫీ అక్కర్లేదు. నాకు టైం లేదు. వెళ్లాలి! మీతో ఓ విషయం మాట్లాడిపోదామని వచ్చాను"

తల్లి, కూతుళ్ళు మొహాలు చూసుకున్నారు. దుర్గకు రాఘవ వచ్చిన ఆనందం క్షణంలో ఎగిరిపోయి అలాగే నిల్చుండిపోయింది!

రాఘవ మాట్లాడ్డం మొదలుపెట్టాడు. "నాన్నగారు ఉత్తరం రాశారు! నా గురించి, నా కాపురం గురించి దిగులుపడి మా అమ్మ ఆరోగ్యం దెబ్బతిన్నదట. మీ అమ్మాయికి విడాకులిచ్చి నన్ను వేరే పెళ్ళి చేసుకోమంటున్నారు! లేదా మీ అమ్మాయిని ఆ ఉద్యోగం మాన్పించి కాపురానికి తెచ్చుకోమని రాశారు. నేను పెద్దవాళ్ళ మనసు నొప్పించి తల్లిని దూరం చేసుకోదలచుకోలేదు"

"అవేం మాటలు బాబూ! పెళ్ళయి ఆరునెలలు కాలేదు. అప్పుడే విడాకుల మాటలేంటి! ఏదో సర్దుకుపోవాలి కానీ..." అంటూ ఏదో చెప్పబోయింది!

రాఘవ ఖస్సుమంటూ లేచాడు. "ఎవరండీ సర్దుకుపోవాలి! నేనే సర్దుకుపోవాలా? మీ అమ్మాయి సర్దుకుపోకూడదా? నాకా ఉద్యోగం అంటే అసహ్యం అని చెప్పానా? ఆ ఉద్యోగం వదిలి కాపురానికి రమ్మనండి పువ్వుల్లో పెట్టుకు చూసుకుంటాను" అన్నాడు.

దుర్గకు చాలాకోపం వచ్చింది! "చూడండీ! సర్దుకుపోవడమన్నది ఇద్దరికీ సంబంధించిన విషయం! నేనే ఎందుకు సర్దుకుపోవాలి! అందులోనూ ఉద్యోగ విషయంలో! సంసారంలో తప్పు ఒప్పులకు, వంటా వార్పులకు, కష్టసుఖాలకు సర్దుకుని పోతాను కానీ ఉద్యోగ విషయంలో మాత్రం కాదు! అలాగనుకుంటే నాకూ మీ బడివంతులు ఉద్యోగం ఇష్టంలేదు. రిజైన్ చేస్తారా! నన్నుమాత్రం రిజైన్ చెయ్యమనటానికి మీకే అధికారం లేదు. మెడలో తాళికట్టి పదిహేనురోజులు కాపురం వెలగబెట్టగానే ఉద్యోగం మానెయ్యి అనే అధికారం మీకు లేదు! నామీద సర్వాధికారాలు పొందినట్లు ఫీలయితే నేను సహించలేను. నా ఉద్యోగం మాత్రం నా ప్రాణంపోయేదాకా వదలను. భార్య ఉద్యోగాన్ని గౌరవించలేని మీలాంటివారితో కాపురం చేయటం నాలాంటి వారికి చాలా కష్టం! మీకు కావాల్సింది విడాకులు కదా! తప్పకుండా ఇస్తాను. ఇక మీరు వెళ్లచ్చు" అంటూ లోపలికెళ్ళిపోయింది దుర్గ!

అవమానంతో గబగబ అడుగులేసుకుంటూ వెళ్ళిపోయాడు రాఘవ!

లబోదిబోమంది శాంతమ్మగారు!

ప్రాన్పడిచూస్తుండిపోయింది చండి!

ఆ సాయంత్రం శ్రీశైలంకు జరిగినదంతా చెప్పి బాధపడింది చండిక! "బావగారు మంచివారిలాగే కనిపిస్తున్నారు. బోడి ఉద్యోగం పోతే పోయింది. పువ్వుల్లో కూర్చోబెట్టి పోషిస్తానన్న మొగుడికి వ్యతిరేకంగా ప్రవర్తించటం నాకు నచ్చలేదు. అక్కస్థానంలో నేనుంటే ముందు ఉద్యోగం వదిలి వెళ్ళేదాన్ని" అంది!

"అలాగా! ఏ పూలల్లోనట కూర్చోబెట్టేది?" పళ్ళు బిగువున అడిగాడు శ్రీశైలం.

"అది కూడా తెలీదా! సీజన్‌లో ఏ పూలు దొరికితే ఆ పూలల్లో. ఉదాహరణకు ఎండాకాలం మల్లెపూలు, వానాకాలం చేమంతులు చలికాలం..."

"నాగజెముడుపూలు... ఇంక అవు తల్లీ! ఇవుడు మాత్రం మించిపోయిందేముంది. ఎక్కడా గతిలేకుంటే అక్కమొగుడే గతి అంటారు కదా. మీ అక్క విడాకులివ్వగానే నువ్వు రంగంలోకి దిగితే పోలా?" అన్నాడు శ్రీశైలం వెటకారంగా!

అతనికి కోపంవచ్చిందని గ్రహించిన చండి "అదీ నిజమేననుకోండి. ఓ ఆరునెల్లక్రిందటయి ఉంటే ఆ పని చేసి ఉందును. కానీ ఇవుడు మీరూ నేను ప్రేమించుకుంటున్నాం కదా! ఎలా వీలవుతుంది" అంది అమాయకంగా మోహంపెట్టి.

క్షణంలో శ్రీశైలం కోపం పోయింది! "నిన్ను అర్థంచేసుకోవటం చాలా కష్టం చండీ!" అన్నాడు.

"అదేమిటండీ! లైబ్రరీలో అన్ని పుస్తకాలు చదివానంటారు. వాటికంటే కష్టమా నేను!" అంటూ "అవునూ! మా అక్క విడాకులివ్వకుండా సంసారం చేయటానికి వీల్లేదా? అలా సినిమాలోలా ఆమె జీవితం గడచిపోవల్సిందేనా" అంది చండి!

"నాకు తెలిసిన లాయరున్నారు. ఆయన్ని సంప్రదించనా?" అన్నాడు శ్రీశైలం.

"మీ బంధువా?" అంది చండి!

"ఆ! దగ్గర బంధువే! మా అక్కమొగుడి మేనత్త పినతల్లి వేలువిడిచిన మేనమామ కూతురి మొగుడి బావమరిది" అన్నాడు గుక్క తిప్పుకోకుండా!

"అతను దగ్గరి బంధువా?" నోరు తెరిచింది చండి!

"అవును చండీ! మాటల్లో చెబితే ఇంత పొడుగ్గా ఉన్న బంధుత్వం మనిషి ఎదురుగా వుంటే దగ్గరివాడే కదా!" అన్నాడు శ్రీశైలం

'ఈ లాజిక్ బానే ఉందే! గుర్తుంచుకోవాలి' అనుకుంది చండి మనసులో.

"కానీ ఇది విడాకుల వ్యవహారం! ఎగ్జిబిషన్‌కో, సర్కస్‌కో ఫ్రీ పాసు సంపాదించినంత సులభం కాదు" అంది చండి!

"నన్నంత తేలిగ్గా తీసిపారెయ్యకు చండీ! మీ అక్కబావలు నీకెంతో నాకూ అంతే అవ్వలు. వాళ్ళు వేరుగా బ్రతుకుతుంటే నాకే ఎంతో బాధగా వుంది" అన్నాడు శ్రీశైలం.

"నిజమే... బాధలేనిదెవరికి? వాళ్ళిద్దరి అభిప్రాయాలయినా మారాలి. ఉద్యోగాలయినా మారాలి. ఈ రెండూ సాధ్యవడేలాలేవు" అంది చండి.

"శ్రీరాముడు సముద్రానికి వారధి వేసేటప్పుడు ఉడుత కూడాదానివంతు సాయం అది చేసిందిట. ఆ మాత్రపు ఉడుతసాయం కూడా పనికి వచ్చిందేకానీ వృధాగాపోలేదుకదా! నా ప్రయత్నం కూడా అలాంటిదే! చూడు చండీ! నేనేదైనా ఛాలెంజ్‌గా తీసుకున్నానంటే అది సక్సెస్ అయితీరాల్సిందే. ఇందులో థ్రిల్ నీకు తెలీదులే" అంటూ శ్రీశైలం గాల్లో తేలిపోతున్నట్టూ, అవుడే విజయం సాధించేసినట్టూ అయిపోతున్నాడు. చండిక అతన్ని ఆ గాల్లోంచి క్రిందికి ఎలా దించాలా అని ఆలోచిస్తోంది.

"పద వెళదాం చండీ! సూర్యుడు అస్తమించే టైంగదా! చూడు... ఆకాశం ఎంత అందంగా, వాతావరణం ఆహ్లాదకరంగా ఉందో!" అన్నాడు శ్రీశైలం మునిగే సూర్యుణ్ని చూస్తూ తన్మయంగా.

"ఏమి అందమో! ఏంపాడో బాబూ! ఇలాంటి సాయంత్రమే ఇద్దరు ప్రేమికులు వంటరిగా ఉంటే పోలీసులు ఆ ప్రేమికుల్ని చెట్టుకు కట్టేసి నిజంగా ప్రేమిస్తున్నావా ఈ పిల్లని, మోసం చెయ్యటానికి, అత్యాచారం

చెయ్యటానికి కాకపోతే చీకటి పడేవేళ ఇక్క డేంపని'' అంటూ మోకాలి చిప్పలు పగిలేలా కొట్టారుట. పేపర్లో వార్త వేశారు'' అంది ఓరగా అతన్ని చూస్తూ.

శ్రీశైలం మెదడు నీళ్లుగామారి చెవుల్లోంచి కారిపోయినట్లు ఫీలయి ''పద పద... త్వరగా వెళదాం'' అన్నాడు చకచక అడుగులేస్తూ.

★ ★ ★

ఆ తర్వాత పదిరోజులకు దుర్గ, రాఘవ జడ్జి ఎదుట కూర్చున్నారు. విడాకులకోసం పెట్టిన అర్జీని పరిశీలిస్తూ జడ్జిగారు, ''మీ పెళ్ళయి ఎన్నేళ్ళయింది!'' అనడిగారు.

''ఆరునెలలు!'' చెప్పాడు రాఘవ.

''ఏమిటీ! ఆరు నెలలు కాపురం చేసి విడాకులా!''

''మీరు పొరబడుతున్నారు. పెళ్ళయి ఆరు నెలలే అయినా కాపురం చేసింది పదిహేను రోజులేనండి!'' అంది దుర్గ.

''పదిహేనురోజులు కాపురం చేసి విడాకు లంటున్నారంటే మీరిద్దరిలో ఏదైనా శారీరక లోపం ఉందనుకుంటాను'' అంటూ రాఘవను అనుమానంగా చూశారు జడ్జిగారు.

ఇబ్బందిగా కుర్చీలో కదిలి తెగ బాధపడిపో యాడు రాఘవ.

వెంటనే దుర్గ ''అబ్బే! అటువంటి లోపాలేం లేవండీ జడ్జిగారూ! ఆ పదిహేను రోజులూ మేము చాలా సంతోషంగా గడిపాము. కానీ నేను పోలీస్ ఇన్స్పెక్టరుగా ఉద్యోగం చెయ్యటం ఆయనకిష్టంలేదు. ఆ ఉద్యోగాన్ని వదులుకోవటం నాకిష్టంలేదు. అందుకే ఈ విడాకులు'' అంది దుర్గ.

''పోలీసులంటే మీకు భయమా!'' అన్నారు జడ్జిగారు.

''కాదు అలర్జీ!''

''ఎందుకని?''

''ఎందుకంటే ఎన్నో కారణాలుంటాయి. నామట్టుకు నాకు నా భార్య చీరకట్టుకుని ఏ టీచర్ ఉద్యోగమో చేసేదిగా ఉండాలి. లేదా ఇంట్లో ఉండి సంసారం చేసుకునేదిగా ఉండాలి. అంతేగానీ మగరాయుడిలా ఖాకీ డ్రస్సువేసుకుని నడిరోడ్లో లాఠీలు, విజిల్ ఊదుకుంటూ తిరిగి చేసే ఉద్యోగాలు నాకు నచ్చవు. నా అభిప్రాయాలు నాకుండటంలో తప్పులేదుగా!''

''స్త్రీలు చంద్రమండలానికి వెళ్ళి వస్తున్న ఈ రోజుల్లో కేవలం ఉద్యోగ నిర్వహణకు ఖాకీ గుడ్డలు వేసుకుంటే తప్పుగా భావించటం, స్త్రీలు వంటింటికే పరిమితం' అన్న పాత అభిప్రాయాన్ని బలపరుస్తున్నట్టుగా ఉంది. దీన్నిబట్టి మీరు భార్యకు, ముఖ్యంగా స్త్రీల కెంత గౌరవమిస్తున్నారో తెలుస్తోంది'' అన్నారు జడ్జిగారు కాస్త సీరియస్గా.

''కొంతమంది మగాళ్ళు అంతేనండి జడ్జి గారూ! ఒక్క స్వంత భార్య తప్ప మిగతా స్త్రీలు ఏం చేసినా, సాధించినా, ఎలాంటి దుస్తులేసు కున్నా ఆహా, ఓహో అంటూ మెచ్చుకుంటారు. కానీ భార్యమాత్రం ఇంట్లోనే ఉండాలి. మగరా యుడి దుస్తులు అంటున్న ఇలాంటి వారే రోడ్డుమీద ఏ లేడీ కానిస్టేబుల్ కానీ, సిస్టర్ కానీ ఎదురుపడితే గుటకలు మింగుతూ అటే చూస్తూ యాక్సిడెంట్లకు గురవుతుంటారు. సంస్కారం అలాంటిది. మా పెద్దవాళ్ళు నాకిక పెళ్ళి కాదేమోనన్నట్టు ఈయనగారికి నా ఉద్యోగం విషయం దాచి పెళ్ళిచేశారు. ఏ సబిన్స్పెక్టర్నో సర్కిలిన్స్పెక్టర్నో కట్టుకుని ఉంటే నాకే బాధ ఉండేది కాదు'' అంది దుర్గ ఏమాత్రం తడుముకోకుండా!

రాఘవకు పిచ్చికోపమొచ్చింది! ''ఎలాగూ పోలీసు ఆడదాన్నెవరూ చేసుకోరు. నోరు చచ్చిన వాళ్ళం మేం దొరికాము. మూడుముళ్ళు పడితే వాళ్ళే సర్దుకుంటారని ప్లాన్ వేసి నాటకమాడారు. ఇపుడిలా విడాకులదాకా బెడి సికొట్టేసరికి బిక్కచచ్చిపోయి స్పృహలేని మాటలు మాట్లాడుతున్నారు. జడ్జిగారూ! ఇక వాదనలనవసరం. మేం కలిసి కాపురం చేయడం కల్ల. మాకు విడాకులిప్పించండి'' అన్నాడు.

జడ్జిగారికి ఇద్దరి మనస్తత్వం పూర్తిగా అర్థం అయింది. ''మీకు విడాకులిప్పించటానికి నాకే అభ్యంతరంలేదు. కానీ భార్యాభర్తలు విడిపో కుండా కలిసి కాపురం చేయటానికి మేం చాలా ప్రయత్నం చేస్తాం. అయితే మీరు తూర్పు పడమరలాంటివారు. కలిసి కాపురం చేయలేరు. మీకు విడాకులిప్పిస్తాము. కానీ పదిహేను రోజులు కాపురం చేసినవారికి విడా

కులిప్పించటం చట్టవిరుద్ధం! రూల్సు ఒప్పుకోవు. కాబట్టి మీరిద్దరూ ఒకే యింట్లో 365 రోజులు కలిసి జీవించాలి. 366వ రోజు విడాకులిప్పిస్తాము'' అన్నారు జడ్జిగారు నింపాదిగా ఫైలు మూసేస్తూ!

''ఇంపాజిబుల్! సంవత్సరంపాటు ఈవిడతో కలిసి జీవించాలా! ఆమె ఉద్యోగం అంటేనే అలర్జీ అని చెప్పిన నేను ఆమెను నిత్యం ఆ డ్రస్సులో చూస్తూ భరించటమా! సాధ్యపడదు జడ్జిగారూ!''

''స్త్రీలను గౌరవించలేని, స్త్రీల అభ్యున్నతి చూడలేని ఇలాంటి కుసంస్కారితో సంవత్సరం కలిసి జీవించటం నాకసహ్యం, అసాధ్యం'' అంది దుర్గ!

''సరే! మీ యిష్టం! నేను చెప్పినట్టు చేయకపోతే మీకు సుప్రీంకోర్టుకు వెళ్ళినా విడాకులు మంజూరు కావు. మీరిలాగే జీవితాంతం పెళ్ళి, పెటాకులు లేకుండా బ్రతకాలనుకుంటే నేనేం చెయ్యలేను'' అన్నారు జడ్జిగారు.

రాఘవ మనసు ఆక్రోశించింది! ఇప్పటికే తనకు పెళ్ళి కాలేదనే అనుమానం చూపులు, వగైరా వగైరా... గుర్తుకు వచ్చాయి. పోనీ 365 రోజులేగా! ఎలాగో భరించి వేరే పెళ్ళి చేసుకుంటే పోలా!

''అలాగే జడ్జిగారూ! మా పెద్దవాళ్ళు నాకోసం ఓ సంబంధం చూశారు. వాళ్ళనోసంవత్సరం ఆగమంటాను. సరిగ్గా సంవత్సరం తర్వాత విడాకులు గ్యారంటీ కదా!'' అన్నాడు రాఘవ.

''ష్యూర్! ష్యూర్!'' అంటూ జడ్జిగారు దుర్గ కేసి చూశారు నీసంగతేమిటన్నట్టు.

దుర్గ మనసులో సంవత్సరం రోజులు భర్తతో కలిసి ఉండమన్నందుకు మనసులో సంతోషించింది. కానీ రాఘవ మరో పెళ్ళి సంబంధం అనే సరికి ఉక్రోషం ముంచుకొచ్చింది.

''మా డిపార్టుమెంటులో 'ఓ సర్కిల్ ఇన్స్పెక్టర్ నన్ను పెళ్ళిచేసుకోటానికి రెడీగా ఉన్నాడు. ఈ పీడ తెంపుకు వచ్చేయమన్నాడు.

ఎలాగో ఈ సంవత్సరం భరిస్తాను. చూడండి జడ్జిగారు! ఒకే యింట్లో అంటున్నారు. అతనితో నేను మాట్లాడను. నామీద అత్యాచారం జరపడని గ్యారంటీ ఏమిటి? మీరు అన్నీ నాకనుకూలంగా అమరిస్తే తప్ప కలిసి ఉండలేను!'' అంది దుర్గ నోటి దురద తీరిందన్నట్టు.

''చూడండి! మాటలు జాగ్రత్తగా మాట్లాడమనండి! నాకు ఒకసారి ఒక మనిషిమీద అసహ్యం కలిగిందంటే ఇక జీవితాంతం ముఖం కూడా చూడను. నా భవిష్యత్తు పాడుచేసుకోవటం ఇష్టంలేక ఈ సంవత్సరం తలనెప్పి భరిస్తున్నాను'' అన్నాడు రాఘవ!

''ఆగండి! పోట్లాటవద్దు! మీకోసం ఇల్లు నేనే చూస్తాను. ఆ యింట్లోనే మీరుండాలి. పదిరోజుల్లో ఇల్లు ఏర్పాటుచేయిస్తాను. ఈ సంవత్సరం రోజులు నేను చెప్పిన నిబంధనల ప్రకారం నడుచుకోవాలి. పది రోజుల తర్వాత ఇదే టైంకు రండి! మీకన్ని వివరాలు చెబుతాను. ఇక మీరు వెళ్ళచ్చు'' అన్నారు జడ్జిగారు.

★ ★ ★

రాఘవ తల్లిదండ్రులకు వివరంగా ఉత్తరం రాసి తర్వాత ఆలోచనలో పడ్డాడు.

'నాకేం మగాడిని! విడాకులు వద్దు గాడిద గుడ్డూ వద్దు పెళ్ళిచేసుకుంటే ఎవరు చూడొచ్చారు. ఈ సంవత్సరం తల నెప్పి ఎవడు భరిస్తారు!' అనుకున్నాడు.

కాని ఆ వెంటనే పోలీసులకు భయపడే అతని మనసు 'అమ్మో! ఇంకేమన్నా ఉందా! గవర్నమెంటు ఉద్యోగం చేస్తూ భార్య ఉండగానే రెండో పెళ్ళి చేసుకున్నాడంటూ కేసు పెడితే?... ఆ దెయ్యం అంత పనీ చెయ్యగలదు. అపుడు ఉద్యోగం ఉండదు. పెళ్లామూ ఉండదు. ఆ బ్రతుకు ఇంకా ఘోరంగా ఉంటుంది! దానికంటే ఈ సంవత్సరం భరించి వేరే పెళ్ళి చేసుకోవటం ఉత్తమం. విడాకులిచ్చాక నాకెవరయినా పిల్లనిస్తారు కాళ్ళు కడిగి! కానీ మొగుణ్ని వదిలేసిన ఆడదాన్ని ఎవరు చేసుకుంటారు. ఫోజులు కొడుతోంది సర్కిల్‌గాడంట, సింగినాదంట. అంత ఆదర్శపురుషుడెవరు ఈ కాలంలో?' అనుకున్నాడు.

దుర్గ ఆలోచనలు కూడా ఇంచుమించు ఇలాగే ఉన్నాయి. 'తల్లిదండ్రులు సంబంధం చూశారుట. విడాకులిచ్చేసి పెళ్ళిచేసుకుంటాడుట. ముదిరిన బెండకాయమొహం పెట్టు

కుని ఫోజులు కొడుతున్నాడు. నన్ను కాదని పెళ్ళంటూ చేసుకుని ఎలా కాపురం చేస్తాడో చూస్తాగా! కిరసనాయిలు డబ్బాకు, గ్యాస్ స్టౌకు దూరంగా ఉండమని ఆకాశరామన్న ఉత్తరం రాస్తాను. పెళ్ళి చేసుకుని కులుకుదామనుకుంటున్నాడు' అనుకుని బుసలుకొట్టింది.

దుర్గ తల్లి శాంతమ్మమాత్రం చిందులేసింది. "ఏమిటీ! ఒకే ఇంట్లో సంవత్సరం ఉండి ఆ తర్వాత విడాకులా? ఇదేదో నీ జీవితాన్ని పాడుచేయటానికి వాడు చేసిన గూడుపుఠాణీ కాదు గదా! ఇపుడంటే వదిహేను రోజులు తెలియనిచోట కాపురం వెలగబెట్టారు. విడాకులిచ్చేశాక మళ్ళీ పెళ్ళి చెయ్యచ్చని నేను ఆలోచిస్తుంటే, ఇదేమిటి ఒకే యింట్లో అందులోనూ స్వంత ఊరిలో ఉండి ఆ తర్వాత విడాకులు ఇచ్చినా పెళ్ళి చేసుకోటానికి ఎవరు ముందుకు వస్తారు? పద! ఆ జడ్జిగారితో మాట్లాడుదాం!" అంది కోపంతో!

"నువ్వూరుకోమ్మా! వాళ్ళ రూల్సు వాళ్ళవి!

"నువ్వు వేరే పెళ్లి చేయాలనుకుంటున్నావు! కానీ నేను చేసుకోవాలికదా! తెలివితక్కువ పనులు చేసుకుని జీవితాన్ని యాగీ చేసుకున్నది చాలుకానీ నన్నిలా బతకనివ్వు"

"ఏమిటే ఆ దెప్పి పొడుపు! నీపెళ్లి చేయాలనుకోటం తప్పా! అందుకోసం ఒక అబద్ధం అందులోనూ వాళ్ల సపోర్టుతో అబద్ధమాడటంతప్పా! నువ్వు సుఖంగా ఉండాలనేకదా నా తాపత్రయం. యాగీ చేశానా నిన్ను" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది.

తల్లి దగ్గరకు చేరింది దుర్గ! "ఊరుకోమ్మా! బాధపడకు! ఏం జరుగుతుందో చూద్దాం! నాకు ధైర్యం చెప్పాల్సిన నువ్వే కన్నీళ్లు పెట్టుకోవటం! ఆవేశపడటం, ఏంటమ్మా ఇది" అంది బాధగా!

"వాడు మాత్రం పెళ్లిచేసుకుని కులుకుతాడా విడాకులివ్వకు మొండికెయ్యి" అంది శాంతమ్మ.

"అలా చేస్తే నాకే నష్టం. కోర్టు బోనులో నిలబెట్టి "నా క్యారక్టరు మంచిదికాదు, అందుకనే విడాకులు అంటూ చిలవలు పలవలుకలిపి చెబితే? ఇపుడు భర్తకు దూరమైనా పరువుగా ఉద్యోగమైనా చేసుకుంటూ బతుకుతున్నాను. అపుడు డిపార్టుమెంటులో కూడా చులకన అవుతాను. ఉద్యోగం చెయ్యలేక భర్త దగ్గరికి వెళ్లలేక నా జీవితమేమవుతుందో ఆలోచించు"

"దుర్గా!" అంటూ బేలగా కూతురిని కన్నీళ్లతో పొదువుకుంది శాంతమ్మ.

★ ★ ★

"ఏమిటండీ! ఎవరో తెలిసిన లాయరు! బంధువు! అదీ ఇదీ అంటూ కోతలుకోశారు. అటు విడాకులు ఇవ్వక ఇటు భార్యాభర్తలను కలపక ఈ సంవత్సరం కాపురం, నిబంధనలు, లిటిగేషను సింగినాదమేంటి" అంది చండి శ్రీశైలంతో!

"అదే చండీ! నాకూ అర్థంకావటంలేదు! అసలే వాళ్లిద్దరి మధ్య వచ్చుగడ్డి వేస్తే భగ్గుమంటుంది. సంవత్సరం రోజులు ఒకే ఇంట్లో కాపురం అంటే మర్డర్లు జరుగుతాయేమో! నేను మాత్రం లాయరుతో చెప్పాను. భార్యాభర్తలను విడదీయాలని రూల్సులో లేవు. శాయశక్తులా సాధ్యమయినంతవరకు కలపాలనే ప్రయత్నం చేస్తాము. దీనికి నా రికమండేషను వగైరా అక్కర్లేదు" అన్నాడు.

"అంటే రికమండేషను జడ్జిగారిదాకా వెళ్లలేదనేగా అర్థం!నేనపుడే చెప్పానా ఇది ఫ్రీపానులాంటి కేసు కాదని ఏదో ఉద్ధరించేవాడిలాగా ఫోజులు మీరూ" అంది రుసరుసలాడుతూ చండి!

"అబ్బా! చండీ! ససపెట్టకు ఏం జరుగుతుందో చూద్దాం! ఈలోగా ఇంకోసారి లాయర్ని కలుస్తాలే! ఐస్క్రీం తిందాంరా" అంటూ రెండు కప్పులు ఐస్క్రీం తీసుకొచ్చాడు. ఐస్క్రీం నెమ్మదిగా సిప్‌చేస్తూ " చాలా రుచిగా ఉంది కదూ" అన్నాడు శ్రీశైలం!

అక్కను గురించి తను బాధ పడుతుంటే శ్రీశైలం వెంటనే మూడ్ మార్చేసి ఆనందంగా ఐస్క్రీం తినటం సహించలేకపోయింది చండి!

"నేనీ ఐస్క్రీం తినను బాబూ! ఎందుకు కొన్నారు" అంది.

"ఏం ఎందుకని?"

"నాకు ఐస్క్రీం చూసినపుడంతా శవాలు

గుర్తొస్తాయి. ఠక్కున శ్రీశైలం చేతిలో నున్న ఐస్క్రీం క్రింద పడిపోయింది.

''శవాలా? ఐస్క్రీంకు శవాలకు ఏమిటి సంబంధం''

'' మా బాబాయి చనిపోయినపుడు మా అత్తయ్య రావటానికి రెండురోజులు పడు తుందని ఐస్మీద పడుకోబెట్టారు. శవం చెడి పోదటగా అలా చేస్తే! శవం చెడిపోలేదుకానీ నా మనసు చెడిపోయింది. ఐస్ తినటం అప్పట్నించి మానేశాను''

''అలాగా!'' ఏడ్వలేక విచారపడుతూ లేచా డు శ్రీశైలం. విచిత్రం... శ్రీశైలంకు కూడా శవాలు కనిపించిన ఫీలింగ్! ''అమ్మో'' అను కున్నాడు.

''మల్లెపూలండీ! మల్లెపూలు'' అంటూ కుర్రాడు దగ్గరకొచ్చాడు. ఓ రెండు రూపాయల పూలు కొని వాసనచూసి, ''అబ్బ! ఎంత సువా సన ఇంద'' అంటూ చేతికిచ్చాడు చండికకు. 'అమ్మో' అంది దూరంగా జరుగుతూ చండి.

''ఏం'' అన్నాడు కంగారుగా!

''బెంగుళూరులో ఇలాగే ఓ అమ్మాయికి ఆమె లవ్వర్ మల్లెపూల్లో మత్తుమందు చల్లి ఆమెకివ్వగానే ఆ వాసనకు ఆమె స్పృహ తప్పితే రేప్ చేసి తర్వాత చంపాడుట. నెల క్రితం పేపర్లో వేశారు. అప్పట్నించీ నాకు మల్లెపూలంటే భయం. ఏమో! ఎవర్ని నమ్మొ చ్చాం గనుక'' అంది.

వళ్లు మండింది శ్రీశైలంకు. కానీ తమా యించుకున్నాడు విరక్తిగా, ''చూడు చండీ! ఈ వెధవ అంటే నేను మల్లెపూలతో మత్తు చల్లటం, రేప్ చేయటం, చంపటం, పాతిపెట్ట టంలాంటి గొప్ప గొప్ప పనులు చేయగల డంటావా?'' అన్నాడు శూన్యంలోకి చూస్తూ దీనంగా!

★ ★ ★

పదిరోజుల తర్వాత జడ్జిగారి దగ్గరికి రాఘవ, దుర్గ వెళ్లారు.

ఆయన దేవుడిపటాలు చెరోటి ఇచ్చారు. రాఘవకు వెంకటేశ్వరస్వామిపటం, దుర్గకు అలివేలు మంగమ్మపటం!

విస్తుపోయి చూస్తున్నవారితో ''నిబంధనలు పటం వెనుక రాసి ఉన్నాయి, చదువుకోండి'' అన్నారు నవ్వుతూ.

తిప్పి చూశారు. ముత్యాల్లాంటి అక్షరాలతో వరుసక్రమం వేసి రాసి అద్దం వేయించి ఉంది!

1. మీ ఇద్దరేకాక మీకో పనిమనిషి కం సి.ఐ.డి.లాంటి ముసలావిడను కుదిర్చాం. ఆమెను మీరు గౌరవంగా చూసుకోవాలి. ఎందుకంటే ఏరోజు రిపోర్టు ఆరోజు తయారు చేసి నాకందచేస్తుంది కాబట్టి! ఆమెపేరు 'ఆ యా'.

2. ఇంటద్దె, ఇంట్లో తిండిపదార్థాలు, పాత్ర లు వగైరా ఖర్చులన్నీ చెరిసగం భరించి ఆయాకిచ్చి తెప్పించుకోవాలి.

3. వారంలో చెరో మూడురోజులు (కాఫీ టిఫిన్‌తోసహా) వంటచేయాలి. ఆదివారం ఎవ రిష్టంకొద్దీ వారు వంటైనా చేసుకోవచ్చు! లేదా హొటల్‌లోనైనా తినచ్చు!

4. ప్రతి ఆదివారం తప్పనిసరిగా సాయంత్రం పూట సినిమాకుకానీ, పార్కుకు గానీ కలసి వెళ్లిరావలెను. ఎట్టిపరిస్థితుల్లోనూ సినిమాలోగానీ, ఎక్కడైనాసరే మాట్లాడుకోకూడ దు.

5. ఎవరైనా బంధువులుగానీ, స్నేహితులు గానీ వచ్చినపుడు 'నాభార్య, నాభర్త' అంటూ పరిచయం చేయాలి. వారిముందు తప్పనిస రిగా మాట్లాడుకోవడమే కాకుండా అన్యోన్యంగా ఉన్నట్టు ప్రవర్తించాలి.

6. మిగతా టైంలో అత్యవసర పరిస్థితి వచ్చినా మాట్లాడకూడదు. పేపరుమీద రాసి ఆయాతో పంపవచ్చు! లేదా ఆయా ద్వారా చెప్పించవచ్చును.

7. రోజూ కోర్టు గుమస్తావచ్చి క్రితంరోజు సవ్యంగా గడిచిందనటానికి నిదర్శనంగా మీ ఇద్దరితోనూ నేను పంపిన అటెండెన్సులో సంతకాలు పెట్టించుకుంటాడు. ఈ నిబంధన లు ఉల్లంఘించినచో విడాకులు మరో ఆరు నెలలు వాయిదాపడతాయి.

రాఘవ ఆ నిబంధనలు చదివి ''ఏమి టండీ జడ్జిగారు! ఏడు నిబంధనలు రాశారు. ఒకటి తగ్గించటమో, ఒకటి పెంచటమో చే యండి ఏడు అంకె నాకాట్టే అచ్చిరాదు'' అన్నాడు.

''ఏడడుగులు నడిస్తే వివాహబంధం అంటూ పురాణాలు ఘోషిస్తున్న దేశం కదా

మనది. అలాగే విడిపోవటానికి కూడా ఏడు నిబంధనలు పెట్టారు చట్టరీత్యా ! నేనేం చేయలేను'' అన్నారు జడ్జిగారు.

దుర్గకు ఆ నిబంధనలు చదివి చిర్రెత్తుకొచ్చింది! "ఏమిటండీ ఈ నిబంధనలు! ఒకే యింట్లో ఉండమన్నారు బావుంది! ఎవరి తిండి వాళ్ళు ఏ హెూటల్లోనో తిని కాలం గడపమంటేపోయేది! నాకసలే వంట రాదు. అంత టైం కూడా ఉండదు నాకు! నాకీ విడాకులొద్దు ఈ పీడా వద్దు! అయినా ఏ గుళ్ళోనో పెళ్ళి చేసుకుని కాపురం చేస్తే ఎవరు చూడవచ్చారు. సారీ! సర్! ఈ తలనెప్పి నేను భరించలేను!'' అంటూ లేవబోయింది దుర్గ!

రాఘవకు కూడా ఆ నిబంధనల ప్రకారం నడచుకోవటం తన మెంటాలిటీకి కఠోరంగా కనిపించసాగింది! నిజమే ఈవిడన్నట్టు గుళ్ళో పెళ్ళిచేసుకుంటే ఎవరు చూడవచ్చారు! ఏమో ఈవిడనెవరు నమ్మారు. భవిష్యత్తులో తను చనిపోతేనో, రిటైర్ అవుతేనో, తన భార్యకు చెందాల్సిన పెన్షను, డబ్బు వగైరా అంతా నేనే అసలు భార్యనంటూ కోర్టుకెళ్ళి అయినా రాబట్టుకోగలదు. ఒక్క సంవత్సరం కష్టానికి ఆలోచిస్తే భవిష్యత్తు పాడయిపోయి ముసలితనంలో కష్టాలపాలయి అమర్యాదపాలు కావటం తప్పనిసరి అవుతుందేమో!

"ఆగు'' అనరిచాడు గట్టిగా "దుర్గా!! చూడు నేను పరువుగా మర్యాదగా చట్టానికి లోబడి పనులు చేసి బ్రతికేవాడిని! నీతో విడాకులు పొందకుండా పెళ్ళి చేసుకుంటే 'నేరం' అంటూ ఆ విధంగా కూడా కేసులో ఇరికించి తమాషా చూడాలనుకున్నారా మీ తల్లీ కూతుళ్ళు! అవేం చెల్లవు! జడ్జిగారూ! మీరు చెప్పిన నిబంధనలకు నేను రెడీ. మళ్ళీ మీరు నన్ను ఎక్కడికి రమ్మని కబురుపంపినా వస్తాను!'' బై అంటూ వెళ్ళిపోయాడు రాఘవ!

"ఛీ! సంస్కారం లేని మనిషి!'' ఋసలుకొట్టింది దుర్గ.

"చూడమ్మా! నీవు మాములు స్త్రీలాగా ప్రవర్తిస్తున్నావు. ఒక ప్రభుత్వోద్యోగివి! అందులోనూ దేశాన్ని శాంతి భద్రతలను కాపాడే వృత్తి నీది! నీకు ఎక్కువగా చెప్పాల్సిన పనిలేదు. నీవు నీవృత్తికెలా గౌరవమిస్తున్నావో చట్టరీత్యా నేను చెప్పిన నిబంధనలను కూడా పాటించినపుడే నీవు నిజమైన పోలీసు ఉద్యోగివి!''

జడ్జిగారన్న మాటలకు దుర్గ మనసు కలుక్కుమంది "సారీ! సర్'' అంది తలవంచుకుని!

★ ★ ★

కొంచెం ఊరికి దూరంగా ఉన్న కాలనీలో ఇల్లు ఏర్పాటుచేశారు జడ్జిగారు. కోర్టు గుమాస్తా వచ్చి ఇల్లు చూపించి వెళ్ళాడు.

పెద్దకాంపౌండులో నాలుగిళ్ళలోగిలి. వరుసగా ఉన్న ఇళ్ళముందు వచ్చగా మంచి పూలచెట్లు, కొబ్బరిచెట్లు అక్కడక్కడ సిమెంటు బెంచీలు దాదాపు పార్కులాగా ఆహ్లాదకరంగా ఉంది! మొట్టమొదటి ఇంట్లో ఇంటిగలావిడ పార్వతమ్మ ఆమె భర్త శివయ్యగారు ఉన్నారు. వారి కొడుకు గణపతి కాబోయే ఇంజనీరు బ్రహ్మచారి! రెండోఇంట్లో ఇంటిగలావిడ అత్తగారు అంటే శివయ్య తల్లి ఉంది. ఆమె పేరు సూరమ్మ! దాదాపుగా ఆమెవయసు ఎనభైలో పడినా మంచి బాడీతో స్ట్రాంగ్‌గా ఉంది. తన పనులు తాను చేసుకోవటమేకాక అసనాలు, వచ్చికూరలు అంటూ ఆరోగ్య సూత్రాలు పాటిస్తుంది. ఈవయసులో కూడా కోడలిని సాధిస్తూ మనవడికి పెళ్ళయి మునిమనవడు పుట్టేదాకా యమధర్మరాజును ఈ పరిసరాలకు రానివ్వనంటూ ఖచ్చితంగా చెప్పేస్తుంటుంది! ఇంత వయసువచ్చినా కూడా శివయ్యగారు తల్లికి భయపడుతూ ఒదిగి ఉండటం ఆశ్చర్యకరమైన విషయం! దానికి కారణం ఆ యిళ్ళన్నీ ఆమె పేరనే ఉండటం. అవి ఇంకా కొడుకు పేర మార్పించకపోవటం! తనకేకాస్త లోపం జరిగినా అవన్నీ అనాథాశ్రమానికి రాసి ఉంచుకున్న పత్రాలు చూపి "ఇహ సంతకం చేసేసి రిజిష్టరు చేయిస్తా''నని బెదిరించటం ఆవిడ హాబీ! ఇల్లు అద్దెకివ్వటం. అద్దెవసూలు చేయటం లాంటివి కోడలు చేయటంతో పార్వతమ్మకు ఇంటిగలావిడ అన్నపేరేకానీ ఆవిడ మాట సూరమ్మగారి ముందుగానీ, భర్త శివయ్యగారి ముందుగానీ సాగదు.

సూరమ్మగారు అత్తగారి పెత్తనం చెలాయిస్తే తల్లి ముందు పిల్లిలా ఉండే శివయ్యకు మాత్రం సార్టుటెంపర్! మిలిట్రీలో తన వంశంలో ఎవరూ లేకపోయినా ఇంచుమించు

మిలిట్రీ రూల్సు ఇంట్లో పాటించాలనుకునే వ్యక్తి! ఇరిగేషను డిపార్టుమెంటులో క్లర్కుగా ఉద్యోగం చేస్తున్నారు. ఒక్క తల్లి తప్ప అటు ఆఫీసులోనూ, ఇంట్లోనూ అందరూ అతన్ని చూసి భయపడేవారే! భయపడటం అంటే అతనేదో పెద్దపులి మీసాలు పెట్టుకుని, పహిల్వాన్‌లాగా కండలు పెంచుకుని గాండ్రిస్తూ వచ్చి ఎముకలు విరగ్గొడతాడని కాదు! నిజానికి అతనికలాంటి రూపంలేదు కూడా! సన్నగా, నున్నటి గుండులాంటి బట్టతలతో ఒక్క దెబ్బతో క్రిందపడిపోయేవాడిలా ఉంటాడు. అందరూ భయపడేది అతని నోటికి జడిసి! అసలు శాంతంగా మాట్లాడ్డం చేతకాదు ఆయనకు! ఎంత పెద్ద ఆఫీసరుకయినా ఆయన భయపడడు. సిన్సియర్‌గా పనిచేస్తాడు. అనవసరంగా తప్పులెంచితే అదరగొట్టేస్తాడు.

ఆయనకు హరికథలు చెప్పే అలవాటుంది! అదో పార్టు టైం జాబ్‌లాగా పెట్టుకున్నాడు. అది కులవృత్తిట! కొడుకును కూడా అది నేర్చుకొమ్మని పోరుతుంటాడు! కానీ గణపతి మాత్రం సినిమా వ్యామోహంలో పడ్డాడు! ఇరవై నాలుగ్గంటలూ ఎవరో ఒక సినిమా యాక్టరును అనుకరించి మాట్లాడ్డం, యాక్షన్ చెయ్యటం చేస్తూ తండ్రి కోపానికి గురిఅవుతుంటాడు. గణపతి ఆ కాంపౌండుకు గిన్నీస్ కాంపౌండ్ అన్న పేరు వ్రాయించాడు. ఎటొచ్చీ పార్వతమ్మకు మాత్రం ఇంటి ఓనరు అన్న తాత్కాలిక నామమే తప్ప అది శాశ్వతమయ్యే దారి కనిపించటంలేదు.

ఇక మూడో ఇల్లు రాఘవ దుర్గలకిచ్చారు. నాలుగో ఇంట్లో ఇంచుమించు రాఘవ దుర్గ వయసుగల జంట ఉంటున్నారు. అతని అసలు పేరు ఏమిటోగానీ అందరూ పిలిచే పేరు మహిషాసుర్. ఆమె పేరు మర్ధిని. అతని చెల్లి పేరు మాత్రం శాంతి. కాలేజీలో డిగ్రీ చదువుతోంది! వాళ్లు కూడా ఆ యింట్లో చేరిందీవారంలోనే ఈ నాలుగిళ్ళకు వెనుకవైపు బాత్‌రూం, లెట్రిన్‌లు ఉన్నాయి. పెరడుఅంతా అందరికీ ఒకటే కాబట్టి ఉదయం, సాయంత్రం అందరూ కలిసి ఉంటున్నట్టనిపిస్తుంది పలకరింపులతో!

దుర్గకు ఇల్లు నచ్చింది కానీ ఇద్దరు ముసలాళ్ళు ప్రశ్నలతో వేపుకుతింటారని భయపడుతోంది! ·

రాఘవకుమాత్రం ఒంటరిగా ఉండటం అలవాటయిపోవటంవల్ల ఈ 'గలిబిలి' వాతావరణం అంతగా నచ్చలేదు.

ఆరోజంతా ఆయా సహాయంతో ఇల్లు సర్దుకున్నారు. మరుసటిరోజు రాఘవ వంట చేయాలి కాబట్టి కాయగూరలు తెచ్చాడు మార్కెట్‌కెళ్ళి! చిన్నప్పటినించి కాస్త తల్లికి వంటలో సాయంచేస్తుండటంవల్ల నలభీమపాకం కాకున్నా తినేలా చేయగలడు.

ఆయా వయసు దాదాపు యాభై ఉంటుంది. కానీ 'పరమ చెముడు' అని ఆమె వచ్చిన అరగంటలోనే తెలిసిపోయి ఇద్దరూ ఎవరికివారే భయపడ్డారు, సంసారం నిశ్శబ్దంగా సాగిపోయేలాలేదని! ఆమె ఇల్లు దగ్గరే కావటంతో రోజూ ఇంటికెళ్ళి వస్తూంటుంది!

మరుసటిరోజు కందిపచ్చడి చేసి చారు చెయ్యాలనుకున్నాడు రాఘవ!

"కంది పచ్చడిలో చింతపండు ఎంత వేయమంటారూ!" అనడిగాడు ఆయాని!

"కందతో పచ్చడిచేయరు బాబూ! పులుసు పెడతారు!" అంది చెముడు మీదేసుకున్న ఆయా!

"కంద కాదండీ! కందిపప్పు పచ్చడి!" అన్నాడు గట్టిగా!

"నేచెబుతున్నది అదే కదా! పచ్చడివద్దు పులుసు పెట్టు!"

"అయ్యో! కందిపచ్చడి!" అంటూ గట్టిగా అరిచాడు.

"ఏమిటోనయ్యా! మగాడివై ఉండి గొంతు గంభీరంలేదు! నీలో నీవే గొణుక్కుంటావు కాస్త గట్టిగా చెబితే అరిగిపోతావా?" అంది ఆయా.

"కందిపచ్చడి" అంటూ చెవిదగ్గర అరిచాడు.

అపుడు వినిపించిందావిడకు. ఓహో కందిపచ్చడా! అలాగే చెయ్యి ఏమేం వెయ్యాలో చూపిస్తానుండు అంది!

'ముసల్దానా! నీ చెముడుతో సంవత్సరం ఎలా వేగిచావాలో కదా' అనుకున్నాడు.

ఈ ప్రక్కనించి సూరమ్మగారు, ఆ ప్రక్కనించి శాంతమ్మగారు, ఈ పక్కనుంచి మహిషాసుర్

వచ్చారీ అరుపులు విని.

"చూడు బాబూ! నేను పద్మాసనం వేసుకుని ధ్యానంలో ఉన్నాను ఎందుకలా కందిపచ్చడి అంటూ అరుస్తున్నావు. గొప్పగా కందిపచ్చడి నీవేనా తినేది మేం కూడా తినగలం. అమ్మాయితో చేయించుకుని తిను, కానీ అరవకు" అంటూ వెళ్ళిపోయింది.

మహిషాసుర్‌కు క్షణంలో విషయం అర్థమైపోయి చాలా సంతోషపడ్డాడు. "బ్రదర్ నీది కూడా నాలాగా అమ్ముడుపోయిన సరుకేనన్న మాట" అన్నాడు.

రాఘవకు కంపరమెత్తింది! "అంటే?" అన్నాడు అర్థంకాక.

"అదేనయ్యా మా ఆవిడ లక్షరూపాయలు కట్నం ఇచ్చి నన్ను చేసుకుంది! అంటే కొనుక్కుందన్నమాటేగా!"

"అయితే!"

"అయితే ఏమిటండీ! కొనుక్కుంది కాబట్టి కొన్న వస్తువుమీద అధికారమున్నట్టే నా మీద తనకు అన్ని హక్కులు ఉన్నాయంటుంది. అందుకని నేనే వంట చేస్తాను, మాయింట్లో! నీ సంగతీ అదే కదాని!" అన్నాడు మహిషాసుర్.

"మాబాబు సంగతి అలాంటిది కాదు లెండి!" అంది ఆయా!

స్టన్నయ్యాడు రాఘవ! ఆమెకు ఇంతచిన్నగా మాట్లాడిన మాటలు కూడా వినిపించినందుకు ఆశ్చర్యపోయాడు.

"ఇంకెలాంటిది?" అనడిగాడు మహిషాసుర్ ఆసక్తిగా! వళ్ళుమండింది రాఘవకు!

ఆయా నోరు తెరిచి కోర్టు వివాదం గురించిన పురాణం విప్పబోతోంది. రాఘవ లేచి చేతిలోనున్న గరిటె గ్యాస్‌స్టవ్‌మీద పెట్టాడు.

అటువేపు తిరిగిన మహిషాసుర్ కాలికి వేడి గరిటె తగిలించాడు.

కెవ్వుమన్నాడు మహిషాసుర్!

"అరె! మీకు తగిలిందా బొద్దింకను చంపుదామనుకున్నాను" అన్నాడు రాఘవ.

గుర్రుగా చూశాడు మహిషాసుర్ రాఘవ వైపు.

"సారీ!" అన్నాడు దీనంగా మొహంపెట్టి రాఘవ.

కుంటుకుంటూ వెళ్ళిపోయాడు మహిషాసుర్!

"అదేంటబ్బాయ్! అతనికలా వాతపెట్టావు!" అంది ఆయా!

"మరే! మీకు వాతపెట్టలేక అతనికి పెట్టాను" అన్నాడు రాఘవ!

ఇదంతా మౌనంగా చూస్తున్న దుర్గకు నవ్వాలో ఏడవాలో అర్థంకాని మొహం పెట్టింది!

★ ★ ★

"సార్! కోర్టు గుమాస్తానొచ్చాను.

సార్! కోర్టు గుమాస్తానొచ్చాను

సార్! కోర్టు గుమాస్తానొచ్చాను"

అంటూ ఇంటిముందు అటెండెన్సు రిజిష్టరులాంటి పుస్తకం పట్టుకుని కోర్టు గుమాస్తా నిల్చుని, అరుస్తున్న వైపులో పిలిచాడు.

కంగారుగా దుర్గ రాఘవలు బైటకొచ్చారు.

ఎవరూ వినకుండా, చూడకుండా ఉంటే బావుండునన్నట్టు ఇద్దరూ ఇటు, అటు చూశారు. కానీ అప్పటికే పార్వతమ్మగారూ, సూరమ్మగారూ వినటం చూడటం జరిగిపోయింది. కాకపోతే ప్రశ్నలు వేయకుండా కోర్టు గుమాస్తా వైపూ, భార్యాభర్తలిద్దరివైపూ ఓ చూపు చూసి వెళ్ళిపోయారు.

రాఘవకు చాలాకోపం వచ్చింది. "ఏంటయ్యా! ఇదేం కోర్టనుకున్నావా? బోన్లోకి ముద్దాయిని పిలుస్తున్నట్టు మూడుసార్లు ఆ గావుకేకలేంటి?" అంటూ కసిరాడు.

"ఏమిటో సార్ ఇరవైఏళ్ళనించి కోర్టులో పనిచేస్తుండటంవల్ల ఈ పాడు అలవాటు వచ్చింది! ఇంట్లో కూడా నా భార్య చాలా చిరాకుపడుతూ ఉంటుంది" అంటూ "ఇక్కడ సంతకాలు చెయ్యండి" అని సంతకాలు చేయించుకుని వెళ్ళి పోయాడు.

పళ్ళు నూరుకున్నాడు రాఘవ!

"వెధవ తతంగం, వెధవ తత్తంగం ఛీ! ఛీ!" అనుకుంటూ లోపలికొచ్చేశాడు.

ఈ హడావిడిలో వంట పూర్తికాలేదు. టిఫిన్ కూడా సగంలో ఉండి ఉప్మా ఉడుకుతోంది!

రాఘవకు కాలేజీకి కాస్త లేటుగా వెళ్ళినా సరిపోతుంది. కానీ దుర్గ మాత్రం తొమ్మిది గంటలకే స్టేషన్‌కు వెళ్ళాలి.

టిఫిన్ తినే యోగంలేదనుకుంటూ నిశ్శబ్దంగా డ్రస్ వేసుకుని "ఆయా! నేను వెళ్ళివస్తాను!" అంటూ బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయింది!

రాఘవ ఆమె వెళ్ళినవేపే చూస్తుండిపోయాడు కోపంగా!

"లక్షణంగా చీరకట్టుకుని ఏ టీచరు ఉద్యోగమో చేసుకోక ఆ డ్రస్సు... ఛీ! ఛీ! చూస్తుంటేనే కంపరమెత్తుతోంది!" అనుకున్నాడు.

"పాపం! అమ్మాయి టిఫిన్ తినకుండా వెళ్ళిపోతోంది! కాస్త త్వరగా తెమిలి వండకపో



యావా?'' అంటూ ఒక పుస్తకంలో ఏదో రాయసాగింది!

“ఏమిటి రాస్తున్నారు?'' అనడిగాడు రాఘవ!

“ఈరోజు అమ్మాయి టిఫిన్ తినలేదు. అబ్బాయి టైంకి సరిగ్గా పండలేదు!'' అని రిపోర్టు రాస్తున్నాను అంది ఆయా!

“ఏమిటండీ! ఇంత చిన్నవిషయానికి రిపోర్టా! దేనికీ!''

“ఆ! ఏమిటీ? తినకపోతే చావదులే. అంటున్నావా? సరే!'' అంటూ అది కూడా రాయసాగింది!



అమ్మో! ఈ ముసల్ది నేను అనని విషయా లు కూడా రిపోర్టులో ఎక్కించి జడ్జిగారికి చేరవేసేలాఉంది! అని గొణుక్కుని అక్కడి నించి వెళ్ళిపోయాడు రాఘవ.

చిద్విలాసంగా నవ్వుకుంది ఆయా!



ఆమరుసటిరోజు సాయంకాలం శ్రీశైలం, చండిక ఇద్దరూ వచ్చారు. శ్రీశైలం అంతకు ముందు దుర్గను చూసినా ఎపుడూ పరిచయం చేయలేదు చండిక. రాగానే "మా అక్క, మా బావగారు" అంటూ పరిచయం చేసింది చండి!

రాఘవ కూడా నిబంధనల ప్రకారం, కొత్త పరిచయం కాబట్టి మా ఫ్రెండ్ అండ్ కొలీగ్ అంటూ శ్రీశైలంను దుర్గకు నా మిసెస్ అంటూ శ్రీశైలంకు దుర్గను పరిచయం చేశా డు. పరిచయం నమస్కారాలయ్యాక చండి దుర్గ దగ్గర, శ్రీశైలం రాఘవ దగ్గర చేరి కబుర్లలో పడ్డారు.

హాలుకు దగ్గర్లోనే వంటిల్లుండటంవల్ల శ్రీశైలం అపుడపుడూవంటింట్లోకి తొంగిచూస్తూ "వదినగారూ" అంటూ మాటలు కలుపుతూ జోక్స్ వేయసాగాడు. శ్రీశైలం చాలా సమయ స్ఫూర్తిగల మనిషి! మాటల్లో ఎక్కడా దుర్గ ఉద్యోగప్రసక్తి కానీ, కోర్టు, విడాకుల ప్రసక్తికానీ రాకుండా జాగ్రత్తపడ్డాడు. ఆయాను మాట్లా డించబోయి తల వాచేలా చేసుకున్నాడు.

ఆవిడ ఒక పుస్తకం, పెన్ను తెచ్చుకుని "నీ పేరేంటి బాబూ" అంది!

"శ్రీశైలం" అన్నాడు.

ఓహ్! "నారికేళమా?" అంది చెముడు మీదేసుకుని.

"అయినా ప్రపంచంలో ఇంతమంది దేవు ళ్ళుండగా వాళ్ళపేర్లు పెట్టుకోక నారికేళం కదళీపలం అంటూ కాయల పేర్లేమిటి బాబూ! విడ్డూరం కాకపోతేనూ!" అంది.

శ్రీశైలం బిక్కమొహంవేసి రాఘవవైపు చూ శాడు. ఆవిడకు చెముడు అంటూ సైగచేశాడు.

"నాపేరు నారికేళము కాదు ఈశ్వరుని పేరంటూ" చచ్చీచెడీ సైగలు చేసి అక్కడున్న క్యాలెండరుకున్న శివుని బొమ్మ చూపించాడు.

"ఓహ్! శివయ్యా" అంటూ పుస్తకంలో రాసుకోసాగింది. వెంటనే ఓ కాగితంమీద "నా పేరు శ్రీశైలం మీరెందుకు రాస్తున్నారు నా పేరు" అంటూ రాసి చూపించాడు.

దానికి జవాబుగా నేను కోర్టువారు నియ మించిన బంట్రోతును. ఈ ఇంటికి ఎవరు వచ్చి వెళ్లినా, ఏ రోజుకారోజు రిపోర్టు తయారు చేసి జడ్జిగారికి అందచేయాలి" అంది.

శ్రీశైలం చాలా ఆశ్చర్యపడ్డాడు. రాఘవతో "భార్యా భర్తల గురించి ఈ రిపోర్టులు రాసి జడ్జికి చూపించటం వింతగా ఉంది. ఇలాంటివి నేనెక్కడా వినలేదు!" అన్నాడు.

"ఇపుడు వింటున్నావు చూస్తున్నావుగా!" అన్నాడు రాఘవ.

అపుడు దుర్గ కల్పించుకుని "మాది వింత కాపురం లెండి! మేము క్రీస్తుపూర్వం పుట్టవల సినవాళ్ళం!" అంది!

ఆ వాక్యం రాఘవనుద్దేశించి అందని అందరికీ అర్థమైంది. రాఘవకు చాలాకోపం వచ్చింది. ఏం మాట్లాడక చేతిలో ఉన్న పుస్తకం దబ్బున నేలమీద పడేసి లేచిపోయాడు.

★ ★ ★

మరో వారం రోజులు గడిచిపోయాయి యాంత్రికంగా:

దుర్గ తల్లి శాంతమ్మ కూతురి కాపురం చూడ్డానికొచ్చింది. ఓ గంటసేపుండి వెళతాన నగానే ఆ రోజంతా వుండమని బలవంతపె ట్టింది దుర్గ.

ఆవిడను అసలు పలకరించలేదు రాఘవ! శాంతమ్మ చిన్నబుచ్చుకుంది. కానీ ఆడపిల్ల తల్లి కావటంతో తనను తాను సంభాళించుకుని

"ఏం బాబూ! బాగున్నారా?" అంది!

"మీదయవల్ల!" వెటకారంగా అనేసి వెళ్ళిపోయాడు. మరునటిరోజు ఆమె వెళ్ళిపోయాక ఆయా గోడకు తగిలించిన నిబంధనల ఫ్రేం తెచ్చి రాఘవ ముందు పెట్టింది.

"ఏమిటండీ! ఇది" అనడిగాడు.

"ఇందులో అయిదో నెంబరు నిబంధన చదివి దాన్ని మీరెంతమాత్రం పాటించారో చూడండి! ఈరోజు రిపోర్టులో మీమీద ఫిర్యాదు రాయవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను" అంది సీరియస్‌గా ఆమె పుస్తకంలో రాసుకుంటూ.

"అయాం సారీ! ఇంకోసారి ఇలా జరగదు గానీ ఇపుడు రాయకండీ"

"నా డ్యూటీ నేను చెయ్యాలికదండీ" అంది

రాఘవకు వళ్ళు మండింది! "అంత నిజాయితీగా రాయకపోతే కొంపేం మునగదు లెండి!" అన్నాడు.

"కొంప మునగదుకానీ ఉద్యోగం పోతుంది నాకు. మీకేం ఈపెళ్లాం కాకుంటే మరో పెళ్ళాన్ని చేసుకుంటారు. నాకీ ఉద్యోగం పోతే మరోటి దొరుకుతుందా? జడ్జిగారు నియమించిన మనిషి దగ్గర నిజాయితీకి, న్యాయానికి కొదవుండదని గుర్తుంచుకోండి" అంది సీరియస్‌గా!

ఆయా చెముడు మూలంగా వీళ్ళిద్దరూ గట్టిగా మాట్లాడ్డంవల్ల పక్కింటినించి సూరమ్మగారు, పార్వతమ్మ, మహిషాసుర్, గణపతి, శాంతి అంతా వచ్చేశారు!

రాఘవ తలకొట్టేసినట్టయింది! కానీ ఒకందుకు సంతోషించాడు ఆ టైంలో దుర్గ ఇంట్లో లేదు!

★ ★ ★

"మా గది ఖాళీచెయ్యమంటున్నాడు ఓనరుగాడు" అంటూ శ్రీశైలం చండి దగ్గర వాపోయాడు!

"అలాగా! ఎలా మరి!"

"వేట ప్రారంభించాలి ఇంటికోసం!"

"మా అక్క వాళ్ళ ఇంటి ఓనరు సూరమ్మగారి ఇంట్లో ఓ గది అడిగి చూడండి! ఎలాగూ అక్కను చూడ్డానికి వచ్చి మిమ్మల్ని పలకరించినట్లు ఉంటుంది నాకు" అంది చండి.

"ఆహా! బ్రహ్మాండమైన అయిడియా! ఈరోజే ట్రై చేస్తాను! మరి రోజూ వస్తావుగా మీ అక్కకోసం!" అన్నాడు!

"అబ్బే! ఆశ! ముందు గదీసంగతి చూడండి! ఆ ముసలి పీనుగ కొడుకు కోడల్ని నమ్మక పక్కింట్లో ఉంచింది!"

"ఆ! చూస్తుండు! ముసలిదాన్ని వలలో వేసుకుంటాను! ఇంతమంచి అయిడియా ఇచ్చావు. మంచి సినిమాకెళ్దాము ఈరోజు!" అన్నాడు శ్రీశైలం.

"మంచి సినిమా అంటే!"

"అదీ తెలీదా! హీరో హీరోయిన్లు ప్రేమలో పడ్డం, పెద్దవాళ్ళు అభ్యంతరం, కాసేపు డ్యూయెట్లు, విరహగీతాలు, చివర్లో పెళ్ళి, మరియు శుభం!" అన్నాడు ఉత్సాహంగా శ్రీశైలం.

"ఛ! నాకలాంటివి నచ్చవు!"

"ఏం ప్రేమ సినిమాలంటే సిగ్గా!"

"సిగ్గూ కాదూ పాడుకాదు!"

"పోనీ నీకెలాటి సినిమా అంటే నచ్చుతుందో చెప్పు" అన్నాడు.

"ప్రేమలో పడటం! డ్యూయెట్లు! పెద్దవాళ్ళ అభ్యంతరాలు! విలన్ హీరోను చంపటం! హీరోయిన్ విలన్ పరాక్రమం చూసి ప్రేమించి పెళ్ళిచేసుకోవటం ఇలాంటివి నచ్చుతాయి కానీ మనవాళ్ళు ఒక్క సినిమా కూడా ఇలాంటి స్టోరీ ఉన్నది తీయలేదు చూద్దామంటే!"

శ్రీశైలం ఉత్సాహం నీరుగారిపోయింది!

"ఏమిటండీ! అలా అయిపోయారు?" అంది చండి

"ఈపూటకు ఇంటికి వెళతాను చండీ! తల దిమ్ముగా ఉంది!"

★ ★ ★

ఆ మరునటిరోజు ఓ సీసానిండా ఏదో లేహ్యం తీసుకుని వచ్చాడు శ్రీశైలం సూరమ్మగారి దగ్గరికి!

"బామ్మగారూ! ఈ లేహ్యాన్ని హిమాలయాలనించి తెప్పించాను. మీరిది తిని ఇంకోశతాబ్దం ఆరోగ్యంగా ఉండి, గిన్నీస్ బుక్‌లోకెక్కాలని నా ఆశ! కాదనకండి!"

"కావచ్చు! కానీ దానివల్ల నీకేం లాభం!"

అందామె అనుమానంగా!

"ఇందులో లాభమేముందండీ! గాంధీ గారిపేరు ప్రక్కనే గాడ్సే ఉన్నట్టు మీ ఆరోగ్యాని కి కారణమైన ఈ లేహ్యాన్నిచ్చిన నా పేరూ చిరస్థాయిగా, మీ పేరు ప్రక్కన నిలుస్తుంది కదండీ! అల్పసంతోషిని! కాదనకండి"

"ఒరే గణపతీ!" అంటూ పిలిచి ఆ లేహ్యం కాస్త అతనికిచ్చి తినమంది బామ్మగా రు. వాడు తినేశాడు!

"ఓ గంట తర్వాత కడుపులో ఎలా ఉందీ చెప్పు! రిజల్ట్ చూసి రేపటినించి నేను తింటా ను" అంది! ఆ గంటసేపూ అక్కడే కూర్చుని గణపతి శ్రీశైలంతో బాతాఖానీ వేసుకున్నాడు.

"ఎక్కడైనా ఒగది మీ ఎరుకలో ఉంటే చెప్పండి!" అన్నాడు శ్రీశైలం.

"నాకు తెలిసి ఎక్కడా లేవండి" అన్నాడు.

"ఏం బాబూ! ఇపుడున్నచోట బాగోలేదా?" అంది సూరమ్మ కల్పించుకుని.

"బానే ఉందండీ! ఖాళీ చెయ్యమని గోల ఓ చిన్న గది ఉన్నా అడ్జెస్ట్ అయిపోతాను దొరకట్లేదు" అన్నాడు!

గంట తర్వాత "నానమ్మా! నా కడుపులో చాలా ప్రశాంతంగా ఉందేవ్! ఉదయంనించి వికారంగా ఉండేది. ఇపుడు బాగుంది పైగా ఆకలేస్తోంది కూడా!" అన్నాడు గణపతి.

సూరమ్మ మొహం వికసించింది. కృతజ్ఞ తగా శ్రీశైలంవైపు చూసి సీసా అందుకుంది ప్రసాదాన్ని అందుకున్నంత భక్తిగా!

వెళ్ళబోతున్న శ్రీశైలంను ఆపి "అబ్బాయ్! ఆ ముందు గది నీవు వాడుకో! అద్దె అక్కర్లే దులే!" అంది!

"హు్రే" అరవబోయి తమాయించుకున్నా డు. శ్రీశైలం.

బయటకొచ్చాక గణపతి సందేహంగా "ఈ లేహ్యం రుచి ఇంతకుముందెప్పుడో చూశా నండి!" అన్నాడు.

"చూసే ఉంటారు డాబర్‌వారి చవనప్రాశలే హ్యం! గట్టిగా అనకండి ఈ 'కాక' అంతా గదికోసం! ఈరోజునించి మనిద్దరం ఫ్రెండ్స్!" అంటూ చేతులు కలిపాడు శ్రీశైలం.

★ ★ ★

శ్రీశైలం సూరమ్మగారి ఇంట్లో ఓ గదిలో సెటిల్‌అయిపోయాడు!

రాఘవకు శ్రీశైలంతో కాస్త టైంపాస్ అవసా గింది. శ్రీశైలంకూడా ఇద్దరితోనూ బాగా కలి సిపోయాడు. శ్రీశైలం స్వయంగా వంట చేసు కుతింటాడు. కొత్తకొత్త పచ్చళ్లు, చార్లు అవీ రాఘవకు నేర్పించేశాడు కూడా!

"ఏంటండీ! బావగారూ! ఈరోజు వంట డ్యూటీ మీదా?" అంటూ చండిక ప్రవే శించింది.

"మరే!" అన్నాడు రాఘవ. చండికతో మాత్రం ఫ్రీగా మాట్లాడతాడు రాఘవ!

"సాయం చేయమన్నారా?"

"నాకు చేతకాకపోతే కదా తమరు సాయంచేయటానికి! మీ అక్కగారికి సాయప డు! ఆవిడగారి వంట తినలేక చస్తున్నా" అన్నాడు! పక్కగదిలో డ్రస్ చేసుకుంటున్న దుర్గకు వినిపించేలా!

"అలాగా! మీరు కూడా కూరల్లో కారం ఎక్కువేస్తారట కదా! అక్కకు 'కారం' అలవా టులేదు. పాపం మొన్న మూడు రోజులు విరోచనాలట్టుకున్నాయి. కాస్త తగ్గించకూడ దూ!"

"నేను తగ్గించను! నిబంధనల్లో వంటచే యాలనుంది కానీ ఎదుటివారి ఇష్టప్రకారం వంట చేయమనిలేదు. ఇష్టమైతే తినొచ్చు! కష్టమైతే మానవచ్చు!" అన్నాడు విసురుగా!

"నిజమేలెండి! కోప్పడకండి!" అంది అత నికి కోపం వస్తున్నదని తెలిసి!

ఇంతలో శ్రీశైలం వచ్చాడు! "ఎప్పుడొచ్చావ్ చండీ!" అంటూ "కూరేం వండారు! వదినగా రికి టైం అయినట్టుంది మీవంట ఇంకా పూర్త యినట్టు లేదు! వదినగారూ! సేమ్యా ఉప్మా చేశాను. తింటారా? తెమ్మన్నారా?" అన్నాడు శ్రీశైలం.

"వద్దులెండి! ఈరోజు మా సర్కిల్ ఒకాయన రిటైర్ అవుతున్నారు అక్కడే టిఫిన్, భోజనం!" అంది దుర్గ.

"అలాగా! రేపు ఆదివారం కదండీ! సిని మాకెళుతున్నారా?"

"వెళ్ళాలి కదండీ! అయినా రేపుకూడా నాకు డ్యూటీ ఉంది! ఎలా వెళ్ళాలో ఏమిటో" అనుకుంటూ వెళ్ళిపోయింది.

"చండీ! సేమ్యా ఉప్మా చేశాను, తిందువు

గాని రా! నీగొంతు విని నేను తినకుండా వచ్చేశాను" అన్నాడు రాఘవకు వినిపించకుండా మెల్లగా!

"నేను సేమ్యా ఉప్మా తినను బాబూ!" అంది చండి!

"ఏం? ఎందుకని?"

"సేమ్యాను చూస్తే నాకు వానపాములు గుర్తొస్తాయి! అందుకే తినను" శ్రీశైలంకు సేమ్యా ఉప్మా తినాలన్న ఆశ, కోరికా పూర్తిగా చచ్చిపోయింది.

★ ★ ★

ఆ మరునటిరోజు ఆదివారం. రాఘవ ఇంట్లోనే వున్నాడు. దుర్గమాత్రం డ్యూటీ ఉండటంవల్ల తయారవసాగింది.

"ఆయాగారూ! ఈరోజు ఆదివారంగదా! నేను సినిమాకు వెళ్ళాలనుకుంటున్నాను. క్రితం ఆదివారం ఆవిడమాటప్రకారం బీచ్‌కెళ్ళొచ్చాము" అంటూ దుర్గకు వినిపించేలా అన్నాడు.

"సరి! సరి! మీరు రెడీగా ఉన్నారుకదా! అమ్మాయి సాయంత్రం సినిమాకు రాకపోతే ఆవిడమీద రిపోర్టు రాస్తాను. అంతేగా!" అంది ఆయా!

"ఏంటమ్మాయ్! డ్యూటీకెళుతున్నావు. ప్రోగ్రాం సంగతేమిటి?" అంది దుర్గనుద్దేశించి.

"ఏంచెయ్యమంటావు... గవర్నరుగారు వస్తున్నారు. ట్రాఫిక్ కంట్రోల్ డ్యూటీవేశారు. అయినా త్వరగా రావటానికి ప్రయత్నిస్తాన్లే" అంది దుర్గ.

"ట్రాఫిక్ కంట్రోల్ అంటే అస్తమానం నిల్చునే ఉండాలా"

"మరే!" అంది నవ్వుతూ.

"భోంచేసి వెళ్ళవా? ఈరోజు వంట ప్రసక్తి కూడా ఇంట్లో లేదేమో! హొటల్లో తింటావా?"

"హొటల్ తిండి నాకు పడదు! ఏ టీనో బన్నో తింటాన్లే! వెళ్ళొస్తామరి!" అంటూ వెళ్ళిపోయింది.

"బిడ్డ తిం.సికూడా తినకుండా డ్యూటీకెళ్ళింది పాపం!" ంది ఆయా!

"పోలీసులకు ండి కరువేంటండీ! ఎవర్నో ఒకర్ని బెదిరించకు తింటూనేవుంటారు. మీరేం అంత సానుభూతి చూపి బాధపడక్కర్లేదు!" అన్నాడు రాఘవ.

"ఏమిటీ! నేను దుక్కలా తింటూ వున్నానా? ఆదివారం పూట వంట నేను చెయ్యాలా? ఏంటండీ! మీ ఉద్దేశ్యం! చిన్నంతరం, పెద్దంతరం చూసి మాట్లాడ్డం నేర్చుకోండి!" అంది నాలుగిళ్ళకు వినిపించేలా.

రాఘవకు వళ్ళు మండింది! "ఆవిడతో ఇంతసేపూ మాట్లాడారు. అపుడు చెముడులేదు. నేను మాట్లాడించగానే దొంగచెముడు అర్జంటుగా వచ్చేసింది ముసల్దానికి!" గొణిగాడు. పైకిమాత్రం "నేనలా అనలేదు" అంటూ ఓ నమస్కారం పెట్టి గదిలోకెళ్ళిపోయాడు.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. ఆయాకు దుర్గంటే అభిమానం, ప్రేమ, జాలీ, అన్నీనూ. "తక్కువ మాట్లాడుతుంది. ఎక్కువ పనిచేస్తుంది. మంచి గుణవంతురాలు. అలాంటమ్మాయిని కళ్ళకద్దుకుని కాపురం చెయ్యక విడాకులంటూ కోర్టుచుట్టూ తిరిగి చస్తున్నాడు వెధవ!" అంటూ సూరమ్మగారితో, పార్వతమ్మగారితో విడాకుల పురాణమంతా పొల్లుపోకుండా చెప్పేసింది.

ఆవిడదేమైనా లోపం ఉన్నా చూసీ చూడనట్లూరుకుని, తనలోపం ఆవగింజంత వున్నా రిపోర్టు అంటూ పుస్తకం పెన్ను పట్టుకుంటుందని వళ్ళుమంట రాఘవకు! అయినా అపుడే ఒక నెల గడిచిపోయింది. ఎలాగో ఈ సంవత్సరమంతా వీళ్ళను భరిస్తే తనదారి తాను చూసుకోవచ్చునని రోజులు లెక్కపెట్టుకుంటూ కాలం గడుపుతున్నాడు రాఘవ!

సాయంత్రం దాదాపు ఆరుగంటలకు హడావిడిగా దుర్గ డ్యూటీనించి వచ్చి స్నానం చేసి రెడీఅయింది.

రాఘవ అప్పటికే రెడీగా కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు.

"ఆయా! సినిమాకెళ్ళొస్తాం!" అంది దుర్గ.

రాఘవ లేచి స్కూటరు బయటకు తీశాడు.

మర్దిని బయటకొచ్చి దుర్గ జడలో మల్లెపూ

లమాల తురిమి "అక్కా! ఈ చీరలో నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా?" అంది.

"మొదలెట్టావా? పొగడ్తలలో కూడా రికార్డు బద్దలుకొట్టాలని చూస్తున్నావా?" అంది దుర్గ.

రాఘవ ఓసారి వెనుదిరిగి దుర్గను తేరిపార చూశాడు. దుర్గ నిజంగానే అందమైనది. తెల్ల చీరలో ఇంకా అందంగా వుంది. రాఘవ మనసు ఒక్కక్షణం వశంతప్పి మళ్ళీ సర్దుకుంది! స్కూటరు స్టార్టుచేయగానే వెనక కూర్చుంది దుర్గ!

"బావగారి భుజం పట్టుకు కూర్చో!" అంది మర్దిని!

చిరునవ్వు నవ్వి అసలతన్ని తాకకుండా కూర్చుంది సాధ్యమైనంతవరకు.

సినిమా మొదలైంది. చీకట్లో సీట్లు వెతుక్కుని కూర్చున్నారు.

అది కామెడీ సినిమా అవటంవల్ల జనం చప్పట్లు, నవ్వులతో హాలు మారుమోగుతోంది. రాఘవ కూడా సినిమాలో బాగా లీనమైపోయి నవ్వసాగాడు. కానీ దుర్గమాత్రం పగలంతా రెస్టులేకుండా డ్యూటీ చేయటంవల్ల, తిండి కూడా సరిగా తిననందువల్ల నీరసం నిస్త్రాణ అనిపించి కుర్చీలో చేరగిలబడి నిద్రపోయింది! తనపక్కనఏ/మాటామంతీ లేకుండా కూర్చున్న దుర్గను తేరిపారచూశాడు.

ఫుల్‌గా నిద్రలో ఉన్న ఆమెను చూసి చిరాకనిపించింది రాఘవకు.

సినిమా వదలగానే తనే చేయితట్టి లేపక తప్పలేదు రాఘవకు!

దార్లో బ్రెడ్డు కొందామనుకుంది దుర్గ! కానీ అతన్ని బేకరీముందు స్కూటరు ఆపమని అడగాలనిపించక ఊర్కుండిపోయింది. ఇంటికి రాగానే ఆయా వెళ్ళిపోయింది. ఇంట్లో తినటానికేమీలేదు. చాలా ఆకలిగా వుంది దుర్గకు! రాఘవమాత్రం తన గదిలో అట్టిపెట్టుకున్న ఉదయం చేసుకున్న చపాతీలు దుర్గ కళ్ళముందరే తినేసి వెళ్లి పడుకున్నాడు.

దుర్గ అభిమానం చంపుకుని మర్దిని దగ్గర కెళ్ళి భోంచేసి వచ్చింది.

ఆ రాత్రి దుర్గకు చాలాసేపు నిద్రపట్టలేదు. తను తిండి తినలేదని తెలిసి కూడా తన ముందరే తినేసి వెళ్ళిపోయారు నిర్దాక్షిణ్యంగా. ఇలాంటి మనిషిలో సంవత్సరంకాదుకదా పదేళ్ళయినా మార్పురాదు!

పెళ్ళి! ఆ తర్వాత సంఘటనలు గుర్తుకువచ్చి చాలా బాధపడింది దుర్గ! కళ్ళవెంట నీరుకారిపోయింది చాలాసేపు!

దాదాపు రాత్రి మూడుదాకా నిద్రపట్టలేదు. ఆ తర్వాత జ్వరం 102, 103 డిగ్రీలతో వచ్చింది.

"సార్! కోర్టు గుమస్తానొచ్చాను సార్! కోర్టు గుమస్తానొచ్చాను సార్! కోర్టుగుమస్తానొచ్చాను సార్!"

ఈ అరుపులతో మెళుకువ వచ్చింది దుర్గకు!

జ్వరంతో వళ్ళు కాలిపోతోంది! టైం తొమ్మిదయింది.

"అమ్మో!" అంది.

ఆరోజు రాఘవ వంటడ్యూటీ!

కోర్టు గుమస్తాను ఆయాతోచెప్పి లోపలికి పిలిపించి సంతకంపెట్టింది. లేచి ఓపిక తెచ్చుకుని సెలవుచీటి రాసి ఆయాకిచ్చింది పక్కవీధిలోనున్న తన కొలీగ్ సుజాతకిచ్చిరమ్మని

ఆయా వెళ్లిపోయింది.

ఆరోజు బంద్ కావటంమూలాన రాఘవ ఇంట్లోనే వున్నాడు. కానీ పోలీస్ డిపార్టుమెంటుకు బంద్‌రోజు ఇంకా పని ఎక్కువ! సెలవు పెట్టినా సర్కిల్, ఆ తర్వాత పై ఆఫీసర్లు రమ్మని కబురు పంపుతారని తెలిసి ఆయాతో టాబ్లెట్స్ తెప్పించుకుని మింగి డ్రస్ చేసుకుని బయల్దేరింది.

"జ్వరం పేలిపోతున్నా ఆడకూతుర్ని పలకరించే దిక్కులేదు. నిన్నంతా పని ఎక్కువ! అసలు భోజనం చేయలేదు!" అంటూ రాఘవకు వినిపించేలా మర్దినితోనూ, సూరమ్మగారితోనూ అంది ఆయా!

"ఏమిటో! అక్కయ్యకు నాలాగా మొగుణ్ణి కొంగున కట్టుకోవడం చేతకాలేదు పాపం!" అంది మర్దిని!

"మరే! నీవు మహిషాసుర మర్దినివాయె!

నీకూ ఆ పిల్లకు పోలికెక్కడ?'' వళ్ళుమండి అంది సూరమ్మగారు.

''లక్షణమైన పిల్ల! నాకలాంటి కూతురు గానీ, కోడలుగానీ వుంటే కాళ్ళు కడిగి నెత్తిన చల్లుకుందును!'' అంది ఆయా.

''అవునూ! పెళ్ళాం, మొగుడు అస్సలు మాటాడుకోరా?'' ఆసక్తిగా అడిగింది అక్కడికి చేరిన పార్వతమ్మ.

''ఊహూఁ లేదు!'' అంది ఆయా.

''వేరే గదుల్లో పడుకుంటారా?''

''మరే!''

''కుందనపు బొమ్మలాంటి పిల్ల ఇంట్లో కళ్ళెదురుగా వుంటే మాట్లడకుండా, వేరే గదిలో పడుండటం...? నాకేదో ఇతనిమీద భలే అనుమానంగా వుందినుమా!'' అంది సూరమ్మగారు.

''ఏమిటంటారు మీ అనుమానం?'' మర్ధిని ప్రశ్న.

''అతను చేతకానివాడైనా అయివుంటాడు. లేదా ఇంకో స్త్రీతో అక్రమ సంబంధమైనా ఉండాలి'' అంది కొలంబస్ పోజుపెట్టి.

''పదిహేనురోజులు దుర్గ అక్కయ్యతో హనీమూన్‌కూడా వెళ్ళొచ్చారట'' అంది మర్ధిని.

''ఆ! వాడి మొహానికి హనీమూన్ ఒకటి చేటు! 'ఈ మొహానికెందుకు అర్ధసేరు పసుపు' అన్నట్టు బంగారపుబొమ్మ గుణవంతురాలైన పిల్లతో కాపురం చేయలేని వెధవ'' కసితీరా తిట్టింది సూరమ్మగారు.

వంట చేస్తున్న రాఘవకు వినిపించాయి మాటలన్నీ! పొయ్యిమీద అన్నం రాఘవ వంట్లో రక్తం ఒకే స్టేజిలో ఉడకసాగాయి.

''మెల్లిగా మాట్లాడండి అతనికి వినపడుతుంది'' అంది ఆయా.

''ఆ! వినపడితే ఏంచేస్తాడు? చచ్చినట్టు ఈ సంవత్సరమంతా ఇల్లు ఖాళీచెయ్యటానికి కూడా వీల్లేని పరిస్థితి'' అంది.

''మర్ధినీ! చారు పెట్టమంటావా? పులుసు పెట్టమంటావా? నాకవతల ఆఫీసు టైం అవుతుంది. రా... త్వరగా!'' అంటూ భార్యను తీసికెళ్ళాడు మహిషాసుర్!

''బామ్మగారూ! మీకోసం గడ్డిపచ్చడి చేశాను రండి'' అంటూ శ్రీశైలం పిలిచాడు.

''ఏంటయ్యా! నాకు గడ్డి తినిపిస్తావా?'' అంది సూరమ్మ కోపంగా.

''అయ్యో! ఎంతమాటండీ! 'గరికగడ్డి తిన్న గేదెకు చావుందికానీ గరికకు చావులేదు' అన్నది సామెత. అటువంటి గడ్డితో నవరసాలు కలిపి పచ్చడి చేశాను!'' అంటూ లాక్కెళ్ళాడు.

రాఘవ సూరమ్మగారిమీద కసి తీర్చుకోవాలనుకున్నాడు మొదటిసారిగా!

సమయం కలిసిరావాలనుకుని తనలో కోపం తనలోనే బలవంతంగా దిగమింగాడు.

★ ★ ★

రాత్రి ఎనిమిదయింది. దుర్గ ఇంకా ఇంటికి రాలేదు!

ఆయా కంగారుపడుతోంది.

శ్రీశైలంతోసహా మిగతా మూడిళ్ళ కుటుంబీకులు దుర్గకోసం ఎదురుచూస్తున్నారు.

రాఘవమాత్రం నింపాదిగా భోంచేసి పుస్తకం పట్టుకు కూర్చున్నాడు.

''మామూలుగా ఆరింటికంతా ఇంటికి వచ్చే వదినగారు రాలేదు. పక్కవీధిలో వాళ్ళ కొలీగ్ ఉందంట వెళ్ళి అడిగివద్దాం రండి!'' అన్నాడు శ్రీశైలం రాఘవతో!

''ఏం అక్కర్లేదు! ఆవిడే వస్తుంది! అందరు ఆడవాళ్ళలాగా అబల కాదులెండి! ఏ ప్రమాదమూ జరగదు! ఏ సర్కిల్‌తోనో, సబ్‌తోనో బాతాఖానీలో, పార్టీలో ఉంటాయి! ఆ డిపార్టుమెంటుకింక అంతకన్నా పనేం ఉంటుంది?'' అన్నాడు విసుగ్గా మొహంపెట్టి.

అందరూ ఆమెకోసం టెన్షన్ ఫీలవడం రాఘవ భరించలేకపోతున్నాడు. ఇంతలో ఇంటిముందు ఆటో ఆగిన శబ్దం విని అంతా పరిగెత్తారు. దుర్గను మెల్లిగా దింపి తీసుకొచ్చారు ఆమె కొలీగ్స్ సుజాత, రాణి!

''ఏంటమ్మా! ఏమైంది తలకా కట్టేమిటి?'' కంగారుగా అడిగింది ఆయా!

వరండాలోంచే ఆ మాటలు విని తల తిప్పి చూశాడు రాఘవ.

''ఈరోజు బంద్‌కదా! స్టూడెంట్స్ మా జీపు

మీదకు రాళ్ళు రువ్వారు. దుర్గకు, ఇంకో నర్సిల్‌కి దెబ్బలు తగిలాయి. దుర్గకు నిన్నటి నించి జ్వరం అటకదా! భోజనం చేయలేదుట. ఈ దెబ్బకు నీరసించి స్పృహతప్పింది. మధ్యాహ్నంనించి హాస్పిటల్‌లోనే ఉంది మత్తుగా ఉండిపోయింది! సెలైన్ ఎక్కించారు. ఇపుడే మెలకువ వచ్చింది. డాక్టరుగారు ఈరోజంతా హాస్పిటల్‌లో ఉండమంటే, మావారు కంగారుపడతారంటూ వచ్చేసింది'' అంటూ చెప్పారు.

''రెండ్రోజులు పూర్తి రెస్టు తీసుకోవాలి! డాక్టరుగారు చెప్పారు!'' అని చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ మరునటిరోజు మధ్యాహ్నందాకా నీరసంగా పడుకునే ఉండిపోయింది దుర్గ! ఆరోజు వంట దుర్గవంతు కావటంతో వంట చెయ్యలేని పరిస్థితిలో ఉండటంవల్ల రాఘవే వంటచేశాడు రుసరుసలాడుతూ.

పుండుమీద కారం చల్లినట్లు మహిషాసుర్, ''ఏంటి మేష్టారూ! నిన్న ఈరోజు వంట మీరే చేసేస్తున్నారు. అక్కయ్యతో రాజీకొచ్చేశారా?'' అంటూ కదిపాడు.

''మరే! ఏంచేస్తాం! ఈవిడగారు ఝాన్సీరాణీ పోజుపెట్టి ఎవరినో కంట్రోల్ చేయబోయిందిట. స్టూడెంట్సు ఊరుకుంటారా మక్కెలిరగతన్ని పంపించారు. మంచానపడి మూలుగుతోంది. అయినా ఆడదానికెందకయ్యా పోలీసుద్యోగాలు, పైలట్ ఉద్యోగాలు. చేస్తే ఏ పంతులమ్మ ఉద్యోగమో చెయ్యాలి లేకుంటే అంట్లు తోముకుంటూ పడుండాలికానీ! తగుదునమ్మా అని దూసుకుపోతే ఇదిగో... ఇలాగే ఉంటుంది పరిస్థితి'' అంటూ ఈసడించుకున్నాడు నాలుగిళ్ళకి వినిపించేంత గట్టిగా.

సూరమ్మగారు, శ్రీశైలం ఆ మాటలు విని నొచ్చుకున్నారు.

''అతను నీకు స్నేహితుడే కదయ్యా శ్రీశైలం! మరీ ఆడాళ్ళమీద అంత చులకన భావం పనికిరాదని నచ్చచెప్పలేవూ! మేష్టారి పని వెలగబెడుతూ, ఇతని బుద్ధేమిటి మరీ అల్పంగా వుంది!'' అంది చిరాకుగా. ఆవిడకు రాఘవపైన చాలా కోపంగా వుంది.

''ఏమిటోనండీ! అతని ప్రవర్తన నాకూ నచ్చటంలేదు! చూద్దాం ముందుముందు ఏం జరుగుతుందో!'' అన్నాడు శ్రీశైలం.

★ ★ ★

''ఏంటమ్మాయ్! ఆడపడుచుకు పెళ్ళీ గిళ్ళీ అనుకోవటంలేదా!'' అంది పార్వతమ్మగారు మర్దిని పక్కనచేరి!

''అనుకుంటున్నామండీ! కానీ కుదరటంలేదు! మొన్నామధ్య గుంటూరు సంబంధం వచ్చింది. అబ్బాయి అందంగా వున్నాడు. ఉద్యోగం కూడా మంచిదే! కానీ కట్నం దగ్గరే పేచీ వచ్చి ఆగిపోయింది!''

''అలాగా! అవున్లే కట్నాలరేట్లు పెరిగిపోయాయి! అక్షరం ముక్క రాని వెధవలు కూడా 'ల'కారంలో అడుగుతారాయె! పాపం ఆ మహిషాసురుడు అంత కట్నమిచ్చి చెల్లికి పెళ్ళి చేయాలంటే మాటలా!'' అంది పార్వతమ్మ సానుభూతిగా!

''అయ్యో! మీరు పొరపడుతున్నారు పిన్నిగారూ! కట్నందగ్గర పేచీ అంటే మీరలా అర్థంచేసుకున్నారా! ఆ పిల్లపేరున వాళ్ళ నాన్నగారు లక్షరూపాయలు ఫిక్స్‌చేశారు! అది ఇంకో రెండేళ్ళలో రెట్టింపవుతుంది! కానీ ఎవరూ యాభైవేలకు మించి కట్నం అడగటంలేదు! అదేకదా నా బాధ!'' అంది మర్దిని!

''ఏమిటీ! కట్నం ఎక్కువ అడగలేదని బాధా!'' ఆశ్చర్యంతో నోరు తెరచింది పార్వతమ్మ.

అక్కడే ఎక్సర్‌సైజులు చేస్తున్న సూరమ్మగారు కూడా ఆపేసి అక్కడ చేరింది ''ఏమిటీ! మరోసారి చెప్పు!'' అంటూ!

''అవునండీ బామ్మగారూ! ఆడపిల్లకు కట్నం ఎంత ఎక్కువ ఇచ్చి అత్తారింటికి పంపితే అంత సుఖపడుతుంది!''

''అదెలా?'' పార్వతమ్మ ప్రశ్న.

''నన్ను చూడండి! మా నాన్నగారు లక్ష రూపాయలు కట్నం ఇచ్చి నాకు నా భర్తను కొనిపెట్టారు!''

''ఛ! ఏమిటమ్మాయ్ ఆ భాష... కొని పెట్టడమేమిటి! అసహ్యంగా!'' సూరమ్మ కసిరింది!

'మా... బాగా అడిగార'న్నట్టు మెచ్చుకోలుగా అత్తగారివైపు చూసింది పార్వతమ్మ.

''అదేంటోనండీ... మా నాన్న నాకలాగే చె

ప్పారు... పెళ్ళవగానే! చూడమ్మా చిట్టితల్లీ! లక్షరూపాయలిచ్చి ఇతన్ని కొనిపెట్టాను. నీ యిష్టం వచ్చినట్లు ఉపయోగించుకో అన్నారు.

'ఉపయోగించుకోవటమంటే!' అనడిగాను నాన్నగారిని.

'మనింట్లో కలర్ టి.వి. పదహారువేలుపోసి కొనిపెట్టానా నీకు! దాన్నెలా వాడుకుంటు న్నావు. ప్రోగ్రాం వచ్చినపుడంతా ఆన్‌చేసి విసిగెత్తినపుడు ఆఫ్ చేయటంలా. టేప్ రికా ర్డర్‌ని ఉపయోగించటంలా. అలాగన్నమాట! కానీ మనిషి కాబట్టి ఇంకా ఎక్కువే ఉపయో గించుకోవచ్చు! ఒకటా... రెండా... లక్ష రూపా యలు. ఇల్లు అమ్మి, ప్రావిడెంటు ఫండు లోను తీసీ, నాకే ఆధారమూ లేకుండా చేసుకుని మరీ వీడిని కొనిపెట్టాను. బాగా ఉపయోగించు కో. లేకుంటే వడ్డీ నష్టం! జాగ్రత్త!' అని అప్పగింతలు పెట్టారు. అందువల్ల ఆయన్ని ఉపయోగించకుండా ఓరోజు రెస్టు ఇచ్చినా వడ్డీ నష్టం అని అన్నిపనులు చేయించు కుంటూ ఇదిగో ఇలా దర్జాగా బతుకుతున్నాన న్నమాట. నాలాగే నా ఆడపడుచు కూడా బతకాలన్నదే నా కోరిక!

అందుకే కట్నం ఎక్కువ అడిగేవాడికిచ్చి పెళ్లి చేస్తే పిల్ల సుఖపడుతుంది''! అంది మర్దిని ఆరిందాలా.

ముక్కున వేలేసుకుంది పార్వతమ్మ.

సూరమ్మ మాత్రం మర్దిని మాటలు పూర్తిగా నమ్మలేదు. అలాగని పూర్తిగా నమ్మకపోవటాని కి కూడా కారణాలు కనిపించలేదు. ఎందు కంటే మహిషాసుర్ చేతిలో సదా గరిటె అయినా ఉంటుంది లేదా మర్దిని పాదాల యినా ఉంటాయి సేవచేయించుకుంటూ.

★ ★ ★

మరో వారం తర్వాత బీరకాయ పీచు చుట్టరికం ఒకటి వచ్చిపడింది రాఘవకు.

అది బాబాయి వరుస అయ్యే గోవిందరాజు లు అనే ఓ అరవై ఏళ్ల ముసలిశాల్తీ!

అతని రాక దుర్గకేం పెద్ద ఇబ్బంది అని పించలేదు. ఏదో ముసలాయన రెండు రోజు లుండిపోతాడు అనుకుంది. కానీ రాఘవకు మాత్రం గొంతులో వచ్చివెలక్కాయ పడ్డట్టయింది. ఆయన ముందు తను వంటచే యటం, నిబంధనలు పాటించటం, కోర్టు గు మాస్తా రావటం చాలా చాలా చిరాకు పుట్టిస్తు న్నాయి.

అందులోనూ నిబంధనల ప్రకారం చుట్టాల ముందు, స్నేహితుల ముందు విధిగా దుర్గతో మాట్లాడటమేకాక అన్యోన్యంగా ఉన్నట్లు నటించాలి. అది మరీ ప్రాణసంకటమైంది.

కానీ దుర్గ మాత్రం సునాయాసంగా యా క్టింగ్ మొదలుపెట్టింది.

అది చూసి ఆయా ''బేమగ్గా ఉంది'' అంటూ సైగలు చేస్తోంది కూడా. ఆరోజు వంట దుర్గ చేసింది కాబట్టి రాఘవకు పగలంతా తేలిగ్గా గడచిపోయింది.

రాత్రయ్యేసరికి చిరాకు మొదలైంది. ఒక హాలు ఒక బెడ్‌రూం ఉందాయె. హాల్లో దుర్గ బెడ్ రూంలో రాఘవ పడుకునేవారు. ఈ రోజు అథితికి ఏ గది ఇవ్వాలో తానెక్కడ పడుకోవాలో అర్థం కాలేదు రాఘవకు.

సాయంకాలం అయిదు గంటలయింది. ''ఏరా! అబ్బాయి అమ్మాయి ఇంకా డ్యూటీ నించి రాలేదు. నీవు త్వరగా వచ్చేశావేంటి?'' అన్నాడు.

''మరే! కాలేజి మాకు నాలుగింటికే అయి పోతుంది. రాకేం చేస్తాను'' అన్నాడు.

''సాయంకాలం పూట ఇంటికి వస్తూ ఉట్టి చేతుల్తో ఊగులాడుతూ రాకుంటే అమ్మాయికి ఓ మూర పూలు తీసుకు రాకూడదటోయ్! మరీ ఇంత పిసినారిగా తూకం వేసుకుని బతకటం ఎప్పుడు నేర్చుకున్నావ్! చూడండి సూరమ్మగారూ! మా రోజుల్లో మా ఆవిడకు పూలు తీసుకురాని సాయంత్రాలు వేళ్ల మీద లెక్కెట్టచ్చు. ఈ కాలం పిల్లలు ప్రేమలంటా రు! సినిమాలు చూస్తారు! బతుకు మాత్రం యంత్రాల్లా బతుకుతారు''

సూరమ్మగారు తలాడిస్తోంటే అలాఅలా చె ప్పసాగాడాయన... రాఘవకు వళ్లుమండింది. ''అంటే భార్యకు పూలు తెస్తేనే ప్రేమ ఉన్న ట్టా? నీది మరీ చాదస్తం!'' అన్నాడు రాఘవ వినుగ్గా.

''చూడరా అబ్బాయ్! ప్రేమనేది చాలారక లుగా వ్యక్తం చేయచ్చు! భార్య జడలో భర్త మల్లెపూలు తురుముతుంటే ఆ సన్నివేశం ఎంత చక్కగా ఉంటుందో గదా! వారి హృద

యాలు కూడా అలాగే మనోజ్ఞంగా, పులక రింపుగా ఉంటాయి. అది అనుభవించిన వారి కే తెలుస్తుంది. ఏమంటారు సూరమ్మగారూ!" అంటూ తనకొచ్చిన కవిత్వమంతా వాక్యాల్లో ముందు వెనుక చూడకుండా మాటల్లో నింపి మాట్లాడసాగాడు గోవిందరాజు.

సూరమ్మగారికి సన్యాసుల్లో కలిసిపోయిన భర్తను గుర్తుకు తెచ్చేలా చేసేశాయి, గోవింద రాజుగారి మాటలు. ఓ క్షణం మైమరచి నోట మాట లేక అలా ఉండిపోయిందావిడ.

ఇంతలో...

"మల్లెపూలు! మల్లెపూలు!" అంటూ రోజూ వతనగా ఇచ్చిపోయే పూలమ్మి వచ్చింది కేకవే స్తూ!

మర్ధిని, పార్వతమ్మ కొన్నారు తలా కాసిన్ని పూలు.

"అబ్బాయి రాఘవా! ఇపుడుమాత్రం ఏం పోయింది, మీ బాబాయిగారి మాటెందుకు తీసేయాలి. పూలుకొని అమ్మాయి వచ్చాక తలలో తురుము. ఆయన ముచ్చటా తీరిపో తుంది" అంది సూరమ్మగారు ఉండబట్టలేక.

"ఇంకా చూస్తావేంరా కొను!" అంటూ వబా యించాడు గోవిందరాజు.

వళ్లుమండుతున్నా కొనక తప్పలేదు రాఘ వకు.

గోవిందరాజు ఆ పూలు తీసికెళ్లి లోపల ఉంచాడు. దుర్గ వచ్చి స్నానం చేసి చీర కట్టుకుని, జడ అల్లుకుంటూ వరండాలోకొచ్చి నిలబడింది, మర్ధినిని మాట్లాడిస్తూ!

"ఒరే! రాఘవా! ఆ పూలు ఇలా తీను కురా!" అన్నాడు గోవిందరాజు.

ఉడుక్కుంటూనే తెచ్చాడు రాఘవ. అదే సమయానికి వరండాలోకి వచ్చేశారు ఆ నాలు గిళ్లవారూ!

"పూలు అమ్మాయి తల్లో పెట్టరా!" ఆజ్ఞా పించాడు గోవిందరాజు.

"అబ్బే! నేను ముడుచుకుంటాలెండి!" అంటూ అతని చేతిలోపూలు తీసికోబోయింది దుర్గ కంగారుగా.

"నువ్వుండమ్మా! రే! అమ్మాయి తల్లో పె ట్టరా పూలు!"

ఇక తప్పలేదు రాఘవకు!

దుర్గ వెనుకనించుని ఓ పాయతీసి తురి మాడు. అందరూ ఎంతో తన్మయంగా, సంతో షంగా చూశారా సన్నివేశాన్ని! వాళ్లిద్దర్ని అంత సన్నిహితంగా ఎవ్వరూ అంతకుముందు చూ డలేదు.

దాంతో గోవిందరాజు మీద అందరికీ విపరీ తమైన అభిమానం పుట్టుకొచ్చింది ఆ సంఘ టన తర్వాత.

ఆ రాత్రి భోజనాలపుడు "చాలు... ఇంకొంచెం వెయ్యి..." అన్న పొడి మాటలు తప్ప రాఘవ ఎక్కువ మాట్లాడలేదు.

అన్యోన్యంగా ఉన్నట్టు నటించాలి కాబట్టి "ఏమిటండీ! అలా ఉన్నారు వంట్లో బాగా లేదా!" అంటూ నుదురు మీద చెయ్యివేసి చూసింది.

"అదేం లేదు బాగానే ఉంది కాస్త తలనె ప్పి!" అన్నాడు చెయ్యి తీసేస్తూ.

"అమృతాంజనం రాయనా!"

"వద్దు!"

"ఏమిటమ్మా!-వీడు కాస్త డల్‌గా ఉన్నాడు. రోజూ ఇంతేనా! ఇలా ఉంటే పిల్లలకు పాఠాలు ఏం చెబుతాడు వెధవ!" అన్నాడు గోవింద రాజు.

"అదేం లేదు మామయ్యా! కాలేజీలో పాఠా లు బాగానే చెబుతారు. ఎటొచ్చీ ఇంట్లోనే నిబంధనలు సరిగా పాటించట్లేదు ఈ ఉద యంనించీ. పాపం ఆయా నోట్సు తెగ రాసే స్తోంది. ఏమవుతుందో ఏమిటో" అంది దుర్గ.

"ఏంటమ్మాయ్! నీవు మాట్లాడింది ఒక్క ముక్క అర్థం కాలేదు నాకు" అన్నాడాయన చిరాగ్గా.

"అది కాదండీ మామయ్యగారూ! డ్యూటీ విషయం కదా మీరడిగారు. పోలీసుద్యోగాలు చేసేవారెప్పుడూ కొన్ని నిబంధనలకు లోబడి ఉంటారు. నా మట్టుకు నేను చూడండి ఎవరి తోనూ మాట పడను. కష్టమైనా ఇష్టమైనట్టు ప్రవర్తించకపోతే మరో ఆరు నెలలు వాయిదా లు పొడిగింపులు.. ఇవన్నీ ఎందుకు చెప్పండి! ఈ మూన్నాళ్లు నాటకరంగం నించి, ఈ జంజాటం నించి ఎంత త్వరగా విడుదలయి వెళితే అంత హాయిగా, ఆకాశంలో రెక్కలున్న పక్షుల్లా బతకచ్చు! అవునంటారా? కా

దంటారా?'' అంది దుర్గ.

ఆ మాటలు రాఘవకు మాత్రం పూర్తిగా అర్థమయ్యాయి. గోవింద రాజులుకు నగం కూడా అర్థం కాక జుట్టు పీక్కున్నంత పని చేశాడు.

"నా మెదడంతా వేడెక్కినట్లయిందిరా రాఘవా! పక్కవేసిస్తే పడుకుంటాను'' అన్నాడు.

రాఘవ, దుర్గ మొహాలు చూసుకున్నారు. వాళ్లు మొహాలు చూసుకోవటం గోవిందరాజులు గమనించాడు.

"ఏంటర్రా! అలా మొహాలు చూసుకుంటున్నారూ. ఈ రాత్రి రైలుకు వెళదామనుకున్నాను. తాలూకాఫీసులో పనవ్వలేదు. రేపు వెళతాను'' అన్నాడు.

"అదేంటి మామయ్యగారూ! అలా మాట్లాడతారు! మీరుంటే మాకే ఇబ్బంది లేదు. పెద్ద దిక్కుగా వచ్చారు. నెల రోజులున్నా మా ఇద్దరికీ ఏ ఇబ్బంది లేదు. ఏంటండీ అలా మౌనంగా ఉన్నారు. ఆయన మనిద్దరి మధ్య ఉండటానికి బాధపడుతూంటేనూ!'' అంది దుర్గ చనువుగా.

"భలే దానివే! నాకైతే ఏ అభ్యంతరం లేదు. అలాగే ఉండు బాబాయ్!'' అన్నాడు రాఘవ తడబడుతూ.

హాల్లో మునలాయనకు పక్కవేసి గదిలో మంచం మీద పక్కవేసింది దుర్గ!

తెలుగు సినిమాలోలాగా దుప్పటి దిండు తీసికొని దుర్గ కింద పడుకుంటుందిలే అనుకున్నాడు రాఘవ...

కానీ దుర్గ ఇద్దరి మధ్య మంచం మీద దిండు అడ్డంగా వేసి ఆ మంచం మీదే పడుకుంది.

వళ్లుమండింది రాఘవకు.

తనే కిందపరచుకుని పడుకుందామనుకున్నాడు గానీ అహం అడ్డొచ్చింది.

ఎలాగూ దిండు ఇద్దరిమధ్యా ఉంది. తగిలే ప్రసక్తి లేదులే. అనుకుని తనూ మంచం మీదే పడుకున్నాడు.

దుర్గ వెంటనే నిద్రపోయిందిగానీ రాఘవకు దుర్గ తలలోని మల్లెపూల సువాసనలతో నిద్ర పట్టలేదు. ఏ తెల్లవారు ఝామునో కష్టం మీద కాస్త నిద్రపట్టింది. లేచేసరికి తొమ్మిదయింది. అప్పటికే దుర్గ స్నానం చేసి టిఫిన్ రెడీ చేసి మునలాయనకు పెట్టి తనూ తిని డ్రస్ చేసుకోసాగింది.

బాత్రూంలో కెళుతున్న రాఘవను చూసి "ఏంటమ్మా వీడి కళ్లు ఎర్రగా ఉన్నాయి. రాత్రంతా నిద్రపోలేదా'' భావగర్భితంగా నవ్వుతూ అన్నాడు గోవిందరాజు.

"ఛ! ఊరుకోండి మామయ్యగారూ! ఏమో అనుకున్నానుగానీ భలే చిలిపివారు మీరు! అత్తయ్యగారు ఎలా వేగుతున్నారో మీతో'' అంది దుర్గ రాఘవను ఓరకంట చూస్తూ.

వళ్లుమండిపోయింది రాఘవకు. నిన్నటి నించీ ఏడిపిస్తోంది తనను. ఎలా ప్రతీకారం తీర్చుకోవాలా అని ఎదురు చూస్తున్నాడు.

బాత్రూంలో దూరి "దుర్గా! దుర్గా! కాస్త వీపు తోమి వెళ్లు'' అంటూ కేకేశాడు.

ఇపుడు వళ్లుమండటం దుర్గ వంతయింది.

"డ్రస్ చేసుకున్నానండి పాడవుతుంది. ఈ రోజుకు అడ్జెస్టయి రండి'' అంది.

"అదేంటమ్మా! భార్యతో సుకుమారంగా వీపు తోమించుకోవాలని ఏ భర్తకుండదు! ఇలాంటి అపూర్వానుభూతులు మిస్ చేసుకుంటూ అడ్జస్టయిపోండంటావేంటి. డ్రస్ పాడయితే పోయింది! వెళ్లు వెళ్లు!'' అంటూ తరిమినంత పని చేశాడు మునలాయన. డ్రస్‌తో బాత్రూంలో దూరిన దుర్గ రెండు నిమిషాల్లో ముఖాన సబ్బు నురగతోనూ, నగం డ్రస్సు నీళ్లతో తడిసీ, దాదాపు పరిగెత్తుతున్నట్లుగా వచ్చేసింది, ముఖమంతా కందగడ్డలా చేసుకుని.

"ఏమో అనుకున్నాను మా వాడు మంచి రసికుడే!'' అన్నాడు గోవిందరాజు.

"మీరీ రోజు పెందరాళే తాలూకాఫీసు పని ముగించుకోండి'' అంది డ్రస్సు మార్చుకుని డ్యూటీకి వెళ్లబోతూ దుర్గ సీరియస్‌గా.

★ ★ ★

"మా ఓనరుగారబ్బాయి, మహిపాసుర్ చెల్లి శాంతీ ప్రేమలో పడ్డట్టున్నారు చండీ!''

''నీకెలా తెలును'' అడగింది చండి.

''వాళ్లిద్దరూ సైగలు చేసుకోవటం గమనించానీ ఉదయం. అయినా వాళ్లిద్దరికి పెళ్లవుతుందన్న నమ్మకం నాకు లేదు''

''ఏం, ఎందుకలా అంటున్నావు?''

''పార్వతమ్మగారేమో భారీగా కట్నం గుంజాలని చూస్తోంది కొడుకు మీద. వాడేమో కట్నం తీసికోనని ఆదర్శాల పోజుకొడుతున్నాడు. శాంతి వాళ్ల వదినేమో కట్నం ఎక్కువ అడిగే వాడికే ఆడపడుచునిచ్చి చేస్తానంటోంది!''

''మరి పార్వతమ్మగారి భర్తప్రమేయం ఏంలేదా ఇందులో?''

''బాబోయ్! ఆయన్ని ఇంచుమించు మెంటల్ వాడి కిందే జమకట్టేశారు. ఆఫీసులో ఆఫీసరు కూడా ఈయన దెబ్బకు భయపడతాడుట. నా ఫ్రెండు ఈయనగారి ఆఫీసులోనే పనిచేస్తుంట!''

''ఆఫీసరు గుమాస్తాకు భయపడ్డం ఏంటి స్టోరీలు కాకపోతే!'' అంది చండి.

''నిజం, చండీ! వాలంటరీ రిటైర్‌మెంటు అవుతాను. నా కొడుక్కి ఉద్యోగం ఇవ్వండి! అంటూ అర్జీ పెట్టుకున్నాట్ట! ఎందుచేతో అర్జీని తిప్పి కొట్టారు! అప్పటినించి ఆఫీసరు మీద పగబట్టాడుట! వాలంటరీ రిటైర్‌మెంటుకు ఏవో అర్హతలు కొన్ని లేవని తిరగగొట్టింది ఆఫీసరేనట! అందుకని ఆఫీసులో 'ఆ దొంగ ముండా కొడుకు తగలడ్డాడుగా. పోయి సంతకాలు పెట్టించుకురా!' అంటూ అటెండరుకు ఫైళ్లిస్తాడుట. అదంతా ఆఫీసరుకు అక్షరం పొల్లుపోకుండా వినిపిస్తుందట! ఆఫీసరు వస్తూంటే అందరూ లేచి గుడ్ మార్నింగ్ అంటూ విష్ చేస్తుంటే ఈయనగారు లేవకపోగా, విష్ చేయకపోగా 'ప్రతి అడ్డగాడిదకూ సలాములు కొడుతూ టైం వేస్టు చేసుకుంటా రెందుకయ్యా!' అంటూ ఆఫీసరు ముందే అంటాడుట.

''ఓసారి ఆఫీసరుగారు కోపం పట్టలేక రూంలోకి పిలిచి 'మీ పద్ధతి నాకు నచ్చలేదు. మర్యాద నేర్చుకోండి!' అంటూ చీవాట్లేస్తే 'పోరా! వుండాకోరు వెధవా నేనలాగే ప్రవర్తిస్తాను. నీ ఇష్టం వచ్చింది చేసుకో అంటూ ఆఫీసరు ముందున్న ఫైళ్లన్ని కిందకి తోసేసి 'ఇంకోసారి నన్ను నీ రూంకి పిలిచావంటే మర్యాద దక్కదు!' అంటూ గట్టిగా అరుస్తూ వచ్చాడట.

''ఈయనెప్పుడయినా సెలవు పెడితే ఆఫీసరుకు పండగట! ఈయన్ని ట్రాన్స్‌ఫర్ చేయించాలని చూశాడు. కానీ ఈయన 'నా తల్లి ఆరోగ్యం బాగాలేదు. ఆమెను తీసుకుని ప్రయాణం చేసే స్థితిలో లేను. ఆమెకు ఈ ఊరి వాతావరణం తప్ప పడదని డాక్టరన్నాడు' అంటూ సర్టిఫికెట్స్ తెచ్చిచ్చి ఇక్కడే బైఠాయించాడట''

''ఆఫీసరే ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చు కదా!'' చండి అనుమానంగా అంది.

''ఆయన పిల్లలందరూ కాలేజీ చదువులు చదువుతున్నార్ట! ఊళ్లు మారుతుంటే చదువులు దెబ్బతింటాయని ఈయన్నీ ఈయన తిట్లనూ భరిస్తున్నాడట'' అన్నాడు శ్రీశైలం కథ ముగిస్తూ.

''ఈ కాంపౌండ్‌లో ప్రతి ఒక్కరూ వింత మనుషులే! విచిత్ర జీవితాలు. గిన్నీస్ బుక్ కెక్కవలసినవారే వీరంతా! ఈ కాంపౌండ్‌కు గిన్నీస్ కాంపౌండ్ అని పేరు ఉంటే ఏమిటో అనుకున్నాను. ఇదన్నమాట సంగతి'' అంది చండి!

''నీ మొహం! గొప్పగా సూచించావు గానీ ప్రపంచమంతా ఉన్నారు ఇలాంటి వాళ్లు'' అన్నాడు శ్రీశైలం.

చండి చిన్నబుచ్చుకుంది! అతనిమీద కోపం వచ్చింది.

''రా! రా! భోంచేద్దాం, ముల్లంగి సాంబారు చేశాను. ఘుమఘుమ లాడుతోంది. ఆకలిగా కూడా ఉంది'' అంటూ వడ్డించసాగాడు.

''నేను ముల్లంగి సాంబారు తినను బాబూ!'' అంది.

''ఏం! ఎందుకని? అది ఆరోగ్యానికి చాలా మంచిదే?''

'''ముల్లంగి సాంబారులో మునక్కాడంత బల్లిపడి ముప్ఫైమంది దుర్మరణం!' అన్న పేపరు వార్త గుర్తొస్తుంది బాబూ నాకు!''

'ముల్లంగి సాంబారులో బల్లి అంటె చాలదా? మునక్కాడంత బల్లి ఉంటుందా? అంటే, మునక్కాడలు కూడా ప్రజలు తినకూడదనా ఆ పత్రిక ఉద్దేశ్యం?'

ఈ మాటలు శ్రీశైలం పైకి అనలేదు! నీరసంగా, "అలాగా!" అనిమాత్రం అనేసి అక్కడినుంచి లేచి వచ్చేశాడు.



"సార్! కోర్టు గుమస్తానొచ్చాను!"

"సార్! కోర్టు గుమస్తానొచ్చాను!"

"సార్! కోర్టు గుమస్తానొచ్చాను!"

అంటూ మూడుసార్లు అరిచాడు ఆ మరునటిరోజు ఉదయం.

గబగబా బయటకు వచ్చి సంతకంచేసి వెళ్ళారు రాఘవ, దుర్గ.

గోవిందరాజులకిది విడ్డూరంగా కనిపించింది. కానీ దుర్గ సీరియస్‌గా ఉండటంతో అడిగే ధైర్యం చాల్లేదు.

ఆయా దగ్గరకొచ్చి "ఏమిటి ఈ సంతకాల భాగోతం!" అంటూ గునగునగా అడిగాడు.

"ఏమిటీ! తాలూకాఫీసులో పనింకా పూర్తికాలేదా మీకు!" అంది ఆయా గట్టిగా!

"అబ్బ! అదికాదమ్మా. ఇపుడో బిళ్ళజవాను వచ్చి సంతకాలు పెట్టించుకెళ్ళాడు దేనికిట!" కాస్త స్థాయి పెంచి అడిగాడు.

"అయితే ఇంకో వారంరోజులు ఇక్కడే తిష్ఠ వేస్తారా? ఉండండి. నిరంభ్యంతరంగా ఉండండి. మా దుర్గమ్మ ఏమైనా అనుకుంటుందనా! ఆ భయమేం అక్కర్లేదు. మీ కోడలేగా! ఆవిడ అనకూడదా? మీరు పడకూడదా? ఆ తల్లి మంచిది. కాళీగుడ్డల్లో కరుగ్గా కనిపిస్తుందిగానీ మనసు వెన్నముద్ద కదూ!" అంది ఆయా గట్టిగా ఆ లోగిలిలోని నాలుగిళ్ళకూ వినిపించేలా!

స్నానం చేస్తున్న దుర్గకు బాగా వినిపించాయి ఈ మాటలు. స్నానం ముగించుకుని వచ్చి, "అదేమిటి మామయ్యా! మీ పనయ్యేవరకూ ఉండండి! నిన్న ఏదో కోపంలో అన్నాను, ఏమీ అనుకోకండి!" అంటూ వెళ్ళిపోయింది.

గోవిందరాజుకు ఆయా మాటలు, దుర్గ మాటలు కంగారు పుట్టించాయి. కిమ్మనకుండా ఊరుకుండిపోయాడు.

ఆ సాయంకాలం రాఘవ మల్లెపూలు తెచ్చి మునలాయనముందే దుర్గచేతిలో పెట్టాడు.

రాత్రి ఏడున్నరప్రాంతంలో ఆయా "నేనింటికి వెళతానమ్మా!" అంటూ "అదేంటమ్మా మల్లెపూలు తల్లో పెట్టుకోకుండా వెంకటేశ్వరుడి పటానికి వేశావేంటి?" అంది!

పుస్తకం చదువుతున్న రాఘవ అడ్డుతీసి ఓసారి దుర్గను చూసి మళ్ళీ పుస్తకం అడ్డుపెట్టుకున్నాడు.

"ఇలాంటివన్నీ అలవాటయితే కష్టం ఆయా! ఎలాగో మూడునెలలు గడిచాయి. ఇంకో తొమ్మిది నెలలు ఓపికపడితే ఎవరిదారి వాళ్ళది! ఏకాస్త పొరపాటు జరిగినా నష్టపోయేది నేనే! అలాగని నష్టపోతే కుక్కిన పేనులా పడుంటానని అవతలవారు అనుకోవచ్చు! నా ఊపిరి ఆగిపోయేవరకూ నా ఉద్యోగంమాత్రం మానను. వేటికీ లొంగను!" అంది దుర్గ ఉదయం బాత్రూంలో సంఘటన గుర్తుచేసుకుంటూ.

రాఘవ ముఖం కందగడ్డలా మారిపోయింది సిగ్గుతో!

"ఏంటమ్మా! ఏమైంది? మీ మాటల్లో ఏదో గూడార్థం దాగినట్లు అనిపిస్తోంది" అంటూ అనుమానంగా రాఘవవైపు చూసింది.

ఆయా ధోరణీ, ఆమె తననో దోషిగా అనుమానం చూపులు చూడటం రాఘవకు విపరీతమైన కోపం తెచ్చింది.

ఠక్కున లేచి టేబిల్‌మీద ఉన్న ఆయా నోట్సు, పెన్ను తెచ్చి ఆవిడ చేతిలో పెట్టి,

''ఇంద రాయండి ఇందులో! ఈ ఉదయం బాత్రూంలో నేను ఈవిడగారిని ముద్దుపెట్టుకున్నాను. ఈ నేరం అక్షరం పొల్లుపోకుండా రాసి జడ్జీగారికి చూపించండి!'' అన్నాడు.

దుర్గ తల తిప్పుకుని అక్కడ్నించి వెళ్ళిపోయింది సిగ్గనిపించి.

''ఆ! అంతపని చేశారా?'' అంది ఆయా ఆశ్చర్యంగా ఖూనీ చేసినవాడిని చూస్తున్నంత థ్రిల్లింగ్‌గా.

జవాబు చెప్పకుండా నిర్లక్ష్యంగా పుస్తకం అడ్డుపెట్టుకున్నాడు రాఘవ!

''అవునూ! నాకు తెలీక అడుగుతాను! మీకు ఆ అమ్మాయి చేసే ఉద్యోగం అంటే మంట! ఆ అమ్మాయి మాటలంటే మంట! ఆ అమ్మాయి వ్యక్తిత్వమంటే మంట! ఆ అమ్మాయి ముద్దుమాత్రం కావాల్సి వచ్చిందా మీకు! ఇంకెప్పుడూ ఇలాంటి నేరం చెయ్యకండి. ఇపుడుమాత్రం ఈ విషయం రాయట్లేదు!'' అంటూ నోట్సు టేబిల్‌మీద పడేసి బయటకెళ్ళిపోయింది ఆయా!

'నా పెళ్ళాంమీద నాకే అధికారం లేకుండాపోయింది ఛీ! ఛీ!' మొట్టమొదటిసారిగా మనసులో అనుకున్నాడు రాఘవ బాధగా, కోపంగా.

★ ★ ★

''ఏంటండీ మేష్టారూ! కూరేం చేశారేంటి?'' అంటూ పలకరించాడు శ్రీశైలం మహిషాసుర్‌ను.

''గుత్తివంకాయకూర చేసి మిరియాలచారు పెట్టమని మా మర్దిని చెబితే అలాగే చేశాను. ఉదయం దోసెలు, ఉల్లిపాయ పచ్చడిచేస్తే తిన్నారు'' అన్నాడు మహిషాసుర్ అంట్లు తోముకుంటూ.

''అవును మేష్టారూ! సాధారణంగా ఎవరైనా దేవతల పేర్లు కూడా పెడతారు పిల్లలకు మీకెందుకు మీ తల్లిదండ్రులు రాక్షసుడైన మహిషాసురుని పేరు పెట్టారూ? అహ... మీకభ్యంతరం లేకపోతేనే చెప్పండి!'' అన్నాడు శ్రీశైలం.

''అబ్బే! అభ్యంతరమెందుకు? చెబుతాను... మా నాన్నగారు దున్నపోతులఫారం నడిపేవాడుట, నేను పుట్టకముందు''

''ఏమిటీ... దున్నపోతుల ఫారమా?'' శ్రీశైలం ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

''అంత ఆశ్చర్యం దేనికండీ! గవర్నమెంటే పందులఫారం పెట్టగాలేంది దున్నపోతుల ఫారం అంటే వింతగా ఉందా? ఆ దున్నపోతులను దుబాయ్‌కు ఎగుమతి చేసేవాడట మా నాన్న!''

నోరు వెళ్ళబెట్టాడు శ్రీశైలం.

''ఆయనకా వ్యాపారం బాగా అచ్చిరావడంతో ఇంటికి 'మహిషాసురనిలయం' అని పేరు పెట్టుకున్నాడు మా నాన్న. మా అమ్మను ముద్దుగా 'మహిషి' అంటూ, కూతురికి, కొడుకులకు మొత్తం పెద్దమహిషాసుర్, చిన్నమహిషాసుర్ అంటూ పేర్లు పెట్టేశాడు. మొదట్లో స్కూల్లో కాలేజీల్లో చదివేపుడూ, కొత్తగా ఉద్యోగంలో చేరినప్పుడూ కాస్త ఇబ్బందిగా ఉండేది! కానీ ఇపుడు అలవాటయిపోయింది!'' అన్నాడు.

''అవునూ! అక్కయ్యగారికి అసలు వంట రాదా?''

''వస్తుంది! కానీ వాళ్ళ నాన్న లక్షరూపాయలు కట్నం ఇచ్చి కొన్నాడా? ఆ కసితో తనే వంటచెయ్యదుట! వాళ్ళ నాన్నకు ఆ లక్షరూపాయలూ భద్రంగా ముట్టచెప్పితే అప్పుడు తను అన్నివిధాల ఆదర్శభార్యగా మసలుకుంటుందిట!''

''అసలు కట్నం ఇచ్చినట్లు రుజువేంటి?''

''అయ్యో... అదేకదా నేను చేసిన పొరపాటు. ఒకేఒక్క పొరపాటుతో నా జీవితం ట్రాజెడీ అయిపోయింది. ఇలా కూర్చోండి చెబుతాను!'' అంటూ సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు.

శ్రీశైలంకూడా తాపీగా కూర్చున్నాడు.

మొదలుపెట్టాడు మహిషాసుర్!

''మా నాన్నగారు రెండు తరాలకు సరిపడా సంపాదించాడు. కానీ చాలా పిసినారి! ఎంత పిసినారి అంటే మా అమ్మకు పూట పూటకూ వంటకు సరిపడా దినుసులు కొలిచి ఇచ్చి స్టోరు రూం తాళం వేసుకునేవాడు. అలాంటివాడికి కట్నం లాగాలనే ఆశ ఉండటం సహజంకదా! చాలా బేరాలాడి మర్దిని నాన్నగారు చివరికి ఇల్లు అమ్మి కట్నమిచ్చి పెళ్ళిచేశారు. మా నాన్నగారు కట్నం లాగిన సంతోషంలో వున్నారు. మర్దిని నాన్నగారు ఇల్లుపోయిన బాధలో ఉన్నారు. మర్దిని అన్నగారు మా

పెళ్ళిలో మైకు పెట్టించి టేప్‌రికార్డర్‌లో పాట లు పెట్టారు. ఒక విచిత్రం చూశారా? బహుశా మీరెప్పుడూ కనివిని ఎరుగనిది! పెళ్ళికొడు కుని ఊరేగింపుగా తీసుకువస్తూ బ్యాండుమే ళంలో, 'రావోయి మాయింటికి ఓ మామా! మాటున్నది చిన్న మాటున్నది!' అంటూ మొ దలుపెట్టి కాశీయాత్ర తతంగం జరిగేటప్పుడు మైకులో 'ఎవరికోసం? ఎవరికోసం? ఈ ప్రేమ మందిరం ఈ శూన్యనందనం?' అనీ, జీలకర్ర బెల్లం తలమీద పెట్టేటపుడు 'సింగినాథం! జీలకర్రలే నీ నంగతంత...?' అనీ మూడుము ళ్ళు వేస్తూ తాళి కట్టేటపుడు 'ఈ జీవన తరంగాలలో ఆ దేవుని చదరంగంలో ఎవరికి ఎవరు స్వంతము ఎంతవరకీ బంధమూ!' అనీ, చివరికి శోభనం గదికి ముస్తాబై వెళుతు న్నప్పుడు 'ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు, అయ్యో పాపం పసివాడు!' అనీ ఇలా హృదయవిదారకంగా పాటలు పెట్టి నా మననంతా వికలంచేశారు.

మా నాన్నగారికి కూడా ఇది కంటగింపుగా ఉన్నా లక్షరూపాయలు జేబులో ఉన్న నంబ రంలో ఆ! అంటూ నోరు చప్పరించేసి, 'ఇ లాంటివి పట్టించుకోక హుషారుగా ఉండు!' అంటూ బిక్కమొహం వేసిన నన్ను వెన్నుత ట్టారు.

ఆ రాత్రి మా నాన్నగారిని మర్దిని అన్నగారు అదే... నా బామ్మర్ది 'నంతోషనమయం' అంటూ తాగించి స్టాంపు అంటించిన తెల్లపేప రుమీద నంతకం చేయించుకొన్నాడు. దాని మీద మేమే వాళ్ళకు లక్షరూపాయలు అప్పు ఉన్నట్లు తెలుపుతోందన్నమాట!

శోభనంగదిలోకెళ్ళిన నాకు గదిలో 'రారా కౌగిలిచేర రారాదొరా' అన్న పాట టేప్‌రికార్డర్ మీద నన్నగా వినిపిస్తూంటే ఉదయంనించి చావుపాటలు విని పాడయిన మూడ్ హుషారె క్కింది. మర్దిని కాసేపు 'నంతకాల ఆట ఆడు కుందాం' అంటూ కవ్వించి నాచేత కూడా ఓ స్టాంపు పేపరుమీద నంతకం పెట్టించింది! కడుపులో బాగా లేదంటూ బయటకెళ్ళి పేప రు వాళ్ళ అన్నచేతికిచ్చి వచ్చి టేప్‌రికార్డర్‌లో 'పాడు జీవితమూ యవ్వనం మూడునాళ్ళ ముచ్చటలోయి, అయ్యయ్యో నీదు పరుగులె చ్చటకోయి' అన్న పాట పెట్టించింది! 'ఛీ! ఏంపాటది తీసెయ్యి' అన్నాను.

'అయ్యో! అది తీసెయ్యటానికి వీల్లేదు! ఇక్కడ స్పీకరుమాత్రమే ఉంది! పాటలు విడి దింట్లో పెడతారు. టేప్ రికార్డర్ కాసెట్లు అక్క డే ఉంట! అదీగాక స్పీకరు ఈ గదిలో ఎక్కడ అమర్చారో నాకైతే తెలీదు' అంది!

వినుగ్గా పెట్టిన నా మొహంచూసి, 'ఈ పాట అవగానే మంచిపాట పెడతారేమో చూద్దాం' అంది.

ఆ పాటవగానే 'కల కానిది విలువైనది బ్రతుకు కన్నీటి ధారలలోనే బలిచేయకు!' మొదలయింది. మొహాలు చూసుకున్నాము. 'ఈసారి పాట చూద్దాం' అంటూ సైగచేసింది. 'కనుపాప కరువైన కనులెందుకో తనవారు వేరైన బ్రతుకుందెకో!', 'జగమే మాయ బ్రతు కే మాయ!', 'పెనుచీకటాయె లోకం చెలరేగె నాలో శోకం!', 'కలయిదనీ నిజమిదనీ తెలియ దులే బ్రతుకింతేనులే!', 'గాలివానలో వాననీ టిలో పడవప్రయాణం'... ఇలా ఒకదానివెంట మరొకటి కక్షగట్టినట్లుగా పాటలు వినిపిస్తూనే వున్నాయి. స్పీకరుకోసం రూమంతా గాలించా ను. దొరకలేదు. ఎలా దొరుకుతుంది! ఆ రూంనిండా బియ్యంబస్తాలు, పెళ్లికి తెచ్చిన నరుకులు, విప్పేసిన బట్టలు పట్టెమంచంకు నరిపడ స్థలం తప్ప అంతా వస్తువులే!

ఇంకో విషయం మరిచాను. ఈ పాటలతోనే మూడ్ చెదిరిచస్తుంటే పదినిమిషాలకోసారి ఎవరో ఒకరు తలుపుతట్టడం ఏదో వస్తువు కావాలని తీసుకోవటం మావైపు చూసి ము సిముసిగా నవ్వుకుంటూ వెళ్ళిపోవటం తెల్లారే వరకూ అలాగే గడిచిపోయింది! బహుశా నాకు జరిగినట్లు పెళ్ళి, శోభనం ఏ బికారి వెధవకు కూడా జరిగి ఉండదు.

ఆ తర్వాత ఆ నంతకాల పేపర్లు చూపించి బెదిరింపులు, పోలీసులు, నానా గొడవ. నేను ఒక లక్ష, నాన్నగారొక లక్ష అప్పు ఉన్నట్లు తేల్చారు.

మా నాన్న నీచావు నువ్వు చావు అన్నట్లు దబ్బు ఇవ్వకుండా వెళ్ళిపోయాడు. ఎలాగో వప్పించి నెలకో వెయ్యి అయన నాకు వంపేలా ఏర్పాటుచేసుకుని నా జీతం మొత్తం మర్దిని నాన్నగారికి పంపిస్తున్నాను. ఇప్పటికి ముప్పైవేలు తీరింది. ఇంకా లక్షా డెబ్బైవేలు

తీరాలి! అంతవరకూ ఈ గరిటెబాగోతం తప్పదు నాకు!''

శ్రీశైలంకు జాలివేసింది. ''పోన్లెండి! పిల్లలవుతే మీ కష్టాలు కాస్త తీరతాయి'' అన్నాడు ఓదార్పుగా.

''పిల్లలు పుట్టరు మాకు!'' అన్నాడు విరక్తిగా మహిషాసుర్.

''అదేం... ఏదైనా లోపమా?''

''ఇంతవరకూ మాకు శోభనం జరగలేదు. పైగా ఇంట్లో నేను ఏ కాస్త హుషారుగా ఉన్నా టేప్‌రికార్డర్‌లో హృదయవిదారకంగా దిక్కుమాలిన పాటలు. నాకు కోపం వచ్చి ఎపుడైనా చిందులేస్తే, 'మగాళ్ళయితే ఈ కోపం మీ నాన్నగారిదగ్గర చూపించి డబ్బు తీసుకురండి మా నాన్నకు ఇల్లులేకుండా చేసి మీరు సుఖపడదామనుకున్నారా!' అంటుంది మర్దిని'' నిస్సహాయంగా చూస్తూ కథ ముగించాడు మహిషాసుర్.

''మీ కథ సుఖాంతమయ్యే మార్గమే లేదా?'' అన్నాడు శ్రీశైలం.

''ఎందుకు లేదూ! వాళ్ళ నాన్నగారిని దబాయించి డబ్బు తెస్తే కథ సుఖాంతమవుతుంది!'' అంటూ చండి మాటలు వినిపించటంతో ఇద్దరూ వెనుదిరిగి చూశారు.

దుర్గ, చండి ఎప్పటినించి ఉన్నారో వారి వెనుక నిల్చుని కథంతా పూర్తిగా విన్నారు.

దుర్గమాత్రం నవ్వు ఆపుకోలేకపోతోంది.

''మరి మీ చెల్లినిమాత్రం మర్దినిగారు ప్రేమగానే చూసుకుంటారుకదండీ!'' అంది చండి.

''అందులోమాత్రం సందేహంలేదు. శాంతి, తనూ ఫ్రెండ్స్‌లాగా ఉంటారు. ముందు మా నాన్న శాంతిని నాదగ్గరకు పంపనన్నాడు చదువుకోసం. శాంతి పట్టుపట్టడంతో పంపించాడు.''

''మీ నాన్నగారి ఎదురుగా కూడా మీ భార్య ఇలాగే చాకిరీలు చేయిస్తుందా?''

''అపుడింకా ఎక్కువే చేయిస్తుంది! నాన్న ఓసారి గదమాయించి అడిగితే, 'నేను మీకు లక్షరూపాయలిచ్చి మీ కొడుకును కొన్నాను. కొన్నాక అధికారం ఉండదా? అంత నామోషీగా ఉంటే లక్షరూపాయలు పడెయ్యండి. నేనే ఆయనకీ మీకూ చాకిరీ చేస్తాను. నన్ను దబాయించాలని చూడకండి! అపుడే పోలీసులు, గొడవలు మర్చిపోయారా' అంటుంది! మా నాన్న కుక్కిన పేనులాగా అయిపోతాడు'' అన్నాడు మహిషాసుర్.

నిట్టూర్పు విడుస్తూ ఎవరిళ్ళలోకి వారు వచ్చారు.

''వంటేంచేశారు. భోంచేద్దామా'' అంది చండి శ్రీశైలంతో!

''నాకెందుకో మహిషాసుర్ కథ విన్న తర్వాత మనసేం బాగాలేదు చండీ!'' అన్నాడు శ్రీశైలం అదోలా!

''అదేం! నాకుమాత్రం సముద్రం ఒడ్డున చల్లగాలి పీలుస్తూ వేణుగాణం విన్నంత తన్మయంగా ఉంది. మీదంతా చోద్యం!'' అంది చండి కంచంలో అన్నం పెట్టుకుంటూ.

వింతగా చూశాడు శ్రీశైలం ఆమెని. 'ఈ మహాతల్లిని నేనెప్పుడు అర్థంచేసుకుంటానో, నన్ను ఈవిడెప్పుడు అర్థంచేసుకుంటుందో, నా జీవితానికి సుఖాంతమెప్పుడో!'' అనుకున్నాడు శ్రీశైలం వేదాంతిలాగా!

★ ★ ★

గోవిందరాజు దాదాపు వారంరోజులుండి వెళ్ళిపోయాడు. ఆ వారంరోజులూ గదిలో మంచంమీద దిండు మధ్యలో ఉంచుకుని దుర్గ, రాఘవ నానా అవస్థలతో గడిపేశారు.

గోవిందరాజు ఆరోజు ఉదయం లేచి ప్రయాణం కడుతూ, ''ఏరా అబ్బాయీ రాఘవా! ఈ ఆయా, ఆ కోర్టు గుమస్తా కోర్టు పంపించిన మనుమలటగా! మీరిద్దరూ మాట్లాడుకోకూడదటగా! ఓరోజు నీవు ఓరోజు అమ్మాయి వంట చెయ్యాలిటగా! ఎవరైనా వచ్చినపుడు ప్రేమగా ఉన్నట్లు నటించాలిటగా! ఆ వెంకటేశ్వరస్వామి పటం వెనుక రాసిన నిబంధనలు తప్పని సరిగా పాటించాలటగా!''

అంటూ ఇంకా చెప్పబోతుండగా,

''ఆపు బాబాయ్! ఇవన్నీ నీకెవరు చెప్పారు? ఎప్పుడు చెప్పారు?'' అనడిగాడు రాఘవ కోపంగా, ఇదంతా ఆ నూరమ్మ పనికానీ, ఆయాపనికానీ ఖచ్చితంగా అయ్యుంటుంది దుమ్ము దులపాలి అనుకుంటూ!

''నేనీ ఊరు వచ్చినరోజే తెలిసిపోయింది!''

''ఎలా? ఎవరు చెప్పారు?''

''ఆ వెంకటేశ్వరస్వామి పటం గాలికి ఊగుతుంటే సరిచేయబోతే వెనుక కూడా అద్దం తగిలితే చూశాను. చదివాను! తాలూకా ఆఫీసులో పని వచ్చినరోజే అయిపోయింది. మరీ సినిమా ఖర్చు కూడా లేకుండా మీ యింట్లో థ్రిల్లింగ్‌గా గడచిపోతోంటే వెళ్ళాలనిపించక ఉండిపోయానురా! ఎన్నాళ్ళున్నా వెళ్ళక తప్పదుకదా! వెళ్ళొస్తామరి! అమ్మాయ్ దుర్గమ్మా వెళ్ళొస్తా'' అంటూ కేకేశాడు.

దుర్గ వంట ఇంటినుంచి గోవిందరాజు మాటలు వింటూ నవ్వు ఆపుకోలేక నోట్లో చీర కుక్కుకుంది.

రాఘవకుమాత్రం వళ్ళంతా కుతకుతలాడింది. పెద్దవాడయిపోయాడుకానీ, లేకుంటే గోవిందరాజును చితకబాదేవాడే!

గోవిందరాజుమాత్రం మంచి సస్పెన్స్ సినిమా చూసి థియేటర్‌లోంచి తృప్తిగా వెళ్ళిపోయే ప్రేక్షకుడిలా వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆ తర్వాత వారం పదిరోజులదాకా రాఘవకు రాత్రిళ్ళు నిద్రపట్టలేదు. తాకకుండానైతేనేంగాక, ఒకేమంచంమీద దుర్గ, తనూ పడుకోవటం అలవాటయింది. గోవిందరాజు అలా వెళ్ళిపోగానే యాక్షన్ మానేసి మళ్ళీ ఎవరిపని వారు చేసుకోసాగారు.

మరునటి నెలలో డియస్పీ ఇంట్లో వాళ్ళమ్మాయి పుట్టినరోజు అంటూ డిపార్టుమెంటులో అందరినీ ఫ్యామిలీతోసహా రావాలని ఆయనే వచ్చి స్వయంగా చెప్పారు. ఆయన స్వతహాగా నిగర్వి! చాలా మంచివాడు. దాదాపు 45 సంవత్సరాల వయసుంటుంది. లేడీ కానిస్టేబుళ్ళను, యస్.ఐ.లను 'అమ్మాయ్' అంటూ కూతుళ్ళనో, తోడబుట్టినవారినో పిలిచినంత ఆప్యాయంగా పిలుస్తూ బాగా కలిసిపోతాడు. ఆయన మాట కాదనలేక అందరు లేడి కానిస్టేబుల్స్, ఇంకో యస్.ఐ., భర్తలతో వస్తామని చెప్పారు. దుర్గకుమాత్రం ఈ ఆహ్వానం కంటకంగా తయారయింది. అసలే పోలీసులంటేనే పడని రాఘవను పార్టీకెలా తీసుకురావాలా? అని ఆలోచిస్తోంది.

ఆయాతో కలిసి ఆలోచించింది. ఆయాకు కూడా ఏం పాలుపోలేదు. ఆయా అంటే రాఘు వకసలే పడదు. పోనీ ఎవరితోనైనా చెప్పిద్దామన్నా ఎవరున్నారు ఒక్క శ్రీశైలం తప్ప. రాఘవ అతనిమాట అసలే వినడు.

సరిగ్గా అదే సమయంలో రాఘవ పిన్నమ్మ కూతురి పెళ్ళి శుభలేఖ వచ్చింది. ఆ అమ్మాయి అంటే రాఘవకు చాలా అభిమానం! కానీ దాదాపు రెండు సంవత్సరాల నుంచీ బదిలీవల్ల భోపాల్‌లో వున్నారు. రాఘవ పెళ్ళికి రాలేకపోయారు. నెలక్రిందటే విశాఖ వచ్చార్ట! పెళ్ళికి వస్తూ వదినను తప్పక తీసుకురావాలి సుమా! అంటూ వసుధ ఉత్తరం రాసింది.

దాంతో దుర్గ డి.యస్.పి ఇంటికి ఫంక్షన్‌కెళ్ళటానికి రాఘవమీద ఆధారపడినట్టే, పిన్ని కూతురు పెళ్ళికి వెళ్ళటానికి రాఘవ కూడా దుర్గమీద ఆధారపడ్డాడు.

ఈ ఫంక్షన్‌కొస్తే ఆ పెళ్ళికొస్తానని ఆయాతో రాఘవకు చెప్పించటంతో ఒప్పందం కుదిరింది.

అలా ఒప్పందం కుదుర్చుకోకుండా ఒంటరిగా ఫంక్షన్‌కెళితే అందరూ వేసే ప్రశ్నలకు జవాబు చెప్పటం కష్టమనిపించింది దుర్గకు. ఎందుకంటే డిపార్టుమెంటులో వాళ్ళకు దుర్గ పెళ్ళయినట్లు తెలిసిందికానీ, ఇంతవరకూ భర్తను పరిచయం చేయలేదని కొందరూ, రిసెప్షన్ వగైరా లేదని కొందరూ, మీ ఆయన 'ముసుగువీరుడా?' అంటూ కొందరూ దెప్పిపొడుస్తున్నారు. అన్నిటికీ చిరునవ్వే సమాధానంగా ఇస్తూ దాటేసిందేతప్ప ఈ తగువులు, కోర్టు వ్యవహారం గురించి ఎవరికీ తెలీదు. తెలియటం ఇష్టంలేదు దుర్గకు. ఎలాగూ ఈ సంవత్సరం గడవనీ అపుడెలాగూ విడాకులు తప్పవు! ఏదో కారణాలు చెప్పి విడాకులు తీసుకున్నామని చెప్పచ్చు! పెళ్ళయిన మరీ ఐదారునెలలకే విడాకులా? అని వాళ్ళ మొహాల్లో ఆశ్చర్యార్థకాలూ, ప్రశ్నల గుర్తులతో ఇబ్బందిపడటం ఇష్టంలేదు దుర్గకు.

ఇంచుమించు రాఘవ బాధ కూడా ఇలాంటిదే. పోలీసు ఉద్యోగమే తమ ఎడబా

టుకు కారణమని బంధువుల్తో, స్నేహితులతో చెప్పాలంటే సిగ్గుగా వుంది.

'ఏం! పోలీసులంటే భయమా? ఛ! ఊరుకో! కారణమదై ఉండదులే. ఇంకేదో అయి వుంటుంది' అని కొందరు ప్రశ్నిస్తారని భయం! ఆ ఇంకేదో అన్నప్పుడు అక్కడున్నది తనే గనుక తనవేపే అనుమానంగా ఖచ్చితంగా చూస్తారు. తనకుఇంకేదో అర్థంకావటం, బాధపడటం ఇవన్నీ ఎందుకు? ఈ సంవత్సర కాలం ఎలాగో గడిపేసి విడాకులివ్వగానే ఠపీమని పెళ్ళిచేసుకుంటే అపుడు అందరినోళ్ళూ ఏదో ఒకటి చెప్పి మూయించవచ్చు.

అదేవిధంగా రాఘవ తల్లిదండ్రులకు కూడా రాశాడు.

డి.యస్.పిగారి ఫంక్షన్‌కెళ్ళారు రాఘవ, దుర్గ.

అందర్నీ పేరుపేరునా పరిచయం చేసింది భర్తకు! రాఘవ అక్కడికెళ్ళేముందు మనసులో ఎంత ఛీత్కరించుకుంటూ వెళ్ళాడో వెళ్ళిన అరగంటలోనే అక్కడున్నది పోలీసులనీ, వారంటే తనకు అలర్జీ అన్న సంగతి పూర్తిగా మరిచిపోయాడు. దానిక్కారణం అక్కడున్నవారు, వచ్చినవారు కొత్తపాత అనే బేధం లేకుండా కలిసిపోయి వరుసకలిపి రాఘవను బావగారూ! అంటూ వారి భార్యలు అన్నయ్యా అంటూ పిలిచి మర్యాదచేశారు.

ఆ పిలుపులు రాఘవను మొదట ఆశ్చర్యపరిచాయి. దుర్గ కలుపుగోలుగా, "మా డిపార్టుమెంటులో అందరూ అలాగే వరుసలు కలుపుకుని పిలుచుకోవటం అలవాటు" అంటూ రాఘవకు చెప్పటంతో మొదటమాత్రం 'నా బొంద పిలుపు' అని మనసులో అనుకున్నా అన్నయ్యా, బావగారూ, చెల్లి, అని పిలుపులు ఆ గుంపులో వినిపిస్తుంటే, 'వీరంతా ఒకే కుటుంబం ఎవరూ వేరుకాదు!' అని ఆ కాసేపు అనిపించింది.

అందరూ భోజనాలకు్కూర్చున్నారు. ఇంకా భోజనం పూర్తికాకముందే ఏదో వీధిలో దొమ్మీ జరుగుతోందంటూ ఫోను రావటంతో కొందరు అర్థాంతరంగా హడావిడిగా లేచిపోవటం జరిగింది. రాఘవతోపాటు ఉన్న ఓ ఇరవైమంది ఆడా, మగా తప్ప హాలు ఖాళీ అయిపోయింది.

"ఈ పోలీసోళ్ళ కథలే ఇంత! తిండి తినడానికి కూడా నోచుకోరు!"

"కత్తిమీద సాములాంటి జీవితాలు!"

"కట్టుకున్నాక తప్పుతుందా?"

"ఈ పోలీసోళ్ళ జీవితాల్లో ఉన్నంత థ్రిల్ మరెక్కడా ఉండదుట"

"మరే! ఏదోవిధంగా రాజీ పడాలిగా! ఇలా మాట్లాడకపోతే ఎలా?"

తలోవిధంగా వ్యాఖ్యానిస్తుంటే విని నిశ్శబ్దంగా ఇల్లుచేరాడు రాఘవ!

రాత్రి పదిగంటలు గడిచినా దుర్గ రాలేదు. మొదటిసారిగా దుర్గకోసం కంగారుగా ఎదురుచూశాడు.

దాదాపు 11 గంటల ప్రాంతంలో పోలీసు జీపులోంచి దిగింది దుర్గ. బాగా అలిసిపోయింది.

ఆమెకోసం ఎదురుచూస్తున్న మిగతా ముగ్గురు వారు... డిళ్ళవారు ఆమె రాగానే చుట్టుముట్టారు ఏమిటింత ఆలస్యం అంటూ.

ఊరి శివార్లలో ఉన్న పేదవాళ్ళ గుడిసెల్ని పెద్ద షావుకారుగా చలామణీ అవుతున్న ఓ గూండా నాయకుడు ఆ స్థలం తనదంటూ బుల్డోజర్లతో లేపేశాడట! చాలామందికి గాయాలయ్యాయి. ఆరుగురు చిన్నపిల్లలు, ఇద్దరు మహిళలు చనిపోయారు. వాళ్ళందరినీ అదుపులోకి తీసుకుని గాయపడినవారిని, చనిపోయినవారిని హాస్పటల్‌లో చేర్చి వచ్చేసరికి ఇంత సమయం పట్టిందని దుర్గ చెప్పింది.

అక్కడ జరిగిన బీభత్సం, జరిగిన మారణకాండ గురించి దుర్గ చెబుతుంటే రాఘవతో సహా అందరూ నోర్లు తెరచుకుని విన్నారు. ఆరోజు రాఘవ వంటచేశాడు. కానీ దుర్గ భోంచేయలేదు. ఓ గ్లాసు పాలు తాగి పడుకుంది.

మరునటిరోజు రాఘవ నిద్రలేచేసరికి దుర్గ డ్యూటీకి వెళ్ళిపోయింది.

"ఈరోజు ఆదివారం అయినా క్రితంరోజు జరిగిన దుర్ఘటనవల్ల డ్యూటీ వేశారు. ఈరోజు ఆదివారం సినిమాకు వెళ్ళేందుకు కూడా నాకు టైం ఉండదు. ఆయాకు, కోర్టు గుమస్తాగారికి కూడా ఇదే విషయం చెప్పండి!"

అంటూ ఓ చీటీ రాసి టీపాయ్‌మీద పెట్టి వెళ్ళిపోయింది.

రాఘవకు చాలా నిరుత్సాహం అనిపించింది. దాదాపు ఆరునెలలుగా తనకు తెలియకుండానే ఆదివారం దుర్గతో కలిసి సినిమాకో, షికారుకో, గుడికో వెళ్ళటం వస్తూ వస్తూ హెూటల్లో భోంచేయటం, స్కూటర్‌లో ఆమె తన వెనుక కూర్చోవటంలాంటి థ్రిల్లింగ్స్ కోసం ఎదురుచూస్తున్నాడు. ఈ ఆదివారం ఆమె లేకపోవటం సినిమా ఛాన్సు లేకపోవటంతో పిచ్చిపట్టినట్లయింది.

"ఏంటండీ వదినెగారు డ్యూటికి వెళ్ళిపోయారేంటి! అలా దిగులుగా కూర్చున్నారు?" అంటూ శ్రీశైలం పలకరించాడు రాఘవను.

"మరే! నిబంధనలన్న తర్వాత వాటిని ఉల్లంఘించటం నేరంకదా! ఈవిడేంటి ఆదివారంకదా! డ్యూటీ అంటూ వెళ్ళిపోయింది. నాదేంపోయింది కోర్టు గుమస్తా అటెండున్సులో ఆబ్‌సెంట్ పడుతుంది. ఆయా నోట్సులో ఓ పేజీ నిండుతుంది!" అన్నాడు ఉక్రోషం పట్టలేక.

"అవునవును! ఆమె డ్యూటికి వెళ్ళిందన్న కోపంకంటే, ఈరోజు ఆమెతో సినిమాకు వెళ్ళటం మిస్సయిందన్న బాధ ఎక్కువగా ఉంది మీ ముఖంలో. ఏమంటారు?" అంటూ ఉడికించాడు శ్రీశైలం

"ఆ! ఈ ముఖానికి ఆమాత్రం అనుభూతులు కూడానా?" నూరమ్మగారు ఎక్సర్‌సైజులు చేస్తూ గట్టిగా అనేసింది.

"ఏంటండీ!" గదమాయించి అడిగాడు రాఘవ మాట సూటిగా తనకు తగలడంతో.

"ఏంటిబాబూ! నిన్నెవరు పలకరించారు? ఏమిటో మొన్న యమధర్మరాజు దగ్గరకెళ్ళొచ్చిందగ్గర్నించి నేనేం మాట్లాడుతానో నాకే గుర్తుండిచావట్లేదు. నిన్నేమయినా అన్నానా నాయనా!" అంది తెచ్చిపెట్టుకున్న ప్రేమతో!

"అబ్బే... లేదులెండి! మీ పని మీరు చేసుకోండి!" అన్నాడు తేలుకుట్టిన దొంగలా రాఘవ!

★ ★ ★

ఆ మరునటిరోజు కాలేజీ లెక్చరర్ ఒకాయన గుండెనొప్పితో హాస్పిటల్‌లో అడ్మిట్ అయ్యాడని ఆయన్ని చూడటానికి స్టాఫంతా వెళ్ళారు.

వీళ్ళు వెళ్ళేసరికి హాస్పిటల్‌నిండా, లోపలా బయటా పూర్తిగా పోలీసులు నిండుకున్నారు.

'ఎవరో పోలీసు అధికారికి ఆరోగ్యం బాగుండలేదేమో!' అనుకున్నారు కాలేజీ స్టాఫ్ మొదట్లో.

కానీ, లోపలికి పంపేముందు ప్రతివారినీ వివరాలు కనుక్కొని సోదాచేసి మరీ పంపుతున్నారు.

డి.యస్.పి. ఇంటికి విందుకెళ్ళినపుడు పరిచయమైన ఓ యస్.ఐ. కనిపించాడు రాఘవకు.

"ఏంటి బావగారూ! మా చెల్లాయికోసం వచ్చారా? రాత్రి పదిదాకా ఆమె దర్శనం మీకులేదు" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే! అందుకుకాదు. మా లెక్చరర్ ఒకాయనకు హార్ట్ ఎటాక్ రావడంతో హాస్పిటల్‌లో అడ్మిట్ చేశారు. చూద్దామని వచ్చాము. అవును... ఏమిటి ఇంతమంది పోలీసులు... మీ డిపార్టుమెంటువారెవరికైనా ఆరోగ్యం బాగుండలేదా?" అనడిగాడు రాఘవ.

"అదేంకాదు, నిన్న దొమ్మీ జరిపించిన గూండా నాయకుడిని చంపుతామంటూ రాత్రి ఫోన్‌చేసి బెదిరించారట ఎవరో నక్సలైట్లవైపు మనుషులు. దాంతో ఈయనకు భయంతో బి.పి. పెరిగి కళ్ళు తేలేశాడు. హాస్పిటల్‌లో అడ్మిట్‌చేశారు. పోలీసు రక్షణ కావాలంటూ అతని భార్య విన్నపం మన్నించి ఈ హంగామా!" అన్నాడతను.

"అదేంటి? దొమ్మీ జరిపించినతనికి పోలీసుల రక్షణా?" 'అన్యాయాలు చేసేవారికేకదా మీ పోలీసుల సపోర్టు!' అన్న భావం ధ్వనించేలా వెటకారంగా అన్నాడు రాఘవ.

"దొమ్మీ అతను జరిపించాడని అందరికీ తెలుసు. కానీ దొమ్మీలో అతను లేడుకదా! తెగించి సాక్ష్యం లేకుండా అరెస్టు చేయటానికి వీల్లేదాయె! వెతకబోయిన తీగె కాలికి తగిలినట్లు అతనే పోలీసురక్షణ కోరాడు. ఎవరో చంపుతారని బెదిరించటం, ఈయన భయపడ్డం ఎలాగున్నా ఇంచుమించి పోలీసుల వలలో ఇరుక్కున్నట్టే ఇప్పుడు"

"ఇంతకూ ఇతను దొమ్మీ జరిపించి అమా

యకులను చంపించాడని పోలీసులకు తెలుసుకదా! అలాంటప్పుడు ఆయన్ని బెదిరించిన వాళ్ళకి దారి ఇస్తే వాళ్ళు వెళ్ళి చంపేస్తే ఓ పని అయిపోతుంది! ఓ మానవత్వం లేని రాక్షసుడి బారినుండి పేదలను కాపాడినవారవుతారుకదా!'' రాఘవ కొలీగ్ ఒకతను అన్నాడు యస్.ఐ.తో.

''ఆ పని మా డ్యూటీకే విరుద్ధం! డాక్టరు ఏవిధంగా ఓ మనిషిని బతికించాలని తమ శాయశక్తులా పోరాడుతారో, అంతకంటే ఎక్కువగా మా ప్రాణాలు పోగొట్టుకునైనా ఇతరులను రక్షించాలనేదే మాకు నేర్పిన మొదటిపాఠం. అతను దుర్మార్గుడు కావచ్చు! హంతకుడు కావచ్చు! అవన్నీ నిర్ణయించి చావాలో బతకాలో నిర్ణయించేది కోర్టు!'' అన్నాడతను.

రాఘవ మనసులో ఆలోచన మొదలయింది. ఓ అభిప్రాయం మనసులో హత్తుకుపోయింది.

దూరంగా పోలీస్ డ్రస్‌లో దుర్గ కనిపించింది. రాఘవనే చూస్తూందామె.



ఆ తరువాతవారంలో దుర్గ, రాఘవ విశాఖపట్టణం వెళ్ళారు రాఘవ పిన్నికూతురు సుధ పెళ్ళినిమిత్తం!

దుర్గ మూడురోజులు సెలవు పెట్టింది.

రాఘవ పిన్ని మాణిక్యమ్మ రాఘవను చిన్నప్పటినుంచి దాదాపు యశోదలా పెంచింది.

ఆమెకు మగపిల్లలు లేరు. సుధ, ఆ తర్వాత ఇంకో అమ్మాయి. వాళ్ళిద్దరు కూడా పెళ్ళయిన పదిహేను సంవత్సరాలవుతుండగా పుట్టారు. అందువల్ల పిల్లలు లేని సమయంలో రాఘవను మాణిక్యమ్మ దత్తు తీసుకోవాలనుకుంది. కానీ అందుకు రాఘవ తల్లిదండ్రులు ఒప్పుకోలేదు.

ఆ తర్వాత ఆమెకు పిల్లలు కలగటం, భర్త ఉద్యోగరీత్యా వెళ్ళటం, ఎప్పుడైనా, ఎక్కడైనా శుభకార్యాలు జరిగినపుడుమాత్రం ఓ వారం పదిరోజులుకానీ నెలరోజులుకానీ సెలవుమీద రావటం పనులు చూసుకుని వెళ్ళిపోవటం జరుగుతోంది.

ఈ నేపథ్యంలో అనుకోకుండా వ్యవధి లేకుండా రాఘవ పెళ్ళి జరగటం, ఆ పెళ్ళికి వాళ్ళు రాలేకపోవటంతో వారికి రాఘవ భార్యను చూసే అవకాశం లేకపోయింది. ఇపుడు సుధ పెళ్ళి కుదరటంతో మాణిక్యమ్మ శుభలేఖతోపాటు రెండు పేజీల ఉత్తరం రాసింది రాఘవకు పెళ్ళికి తప్పనిసరిగా భార్యతో కలిసి రావాలంటూ!

ఈ కోర్టు, విడాకుల తతంగం రాఘవ తల్లిదండ్రులు కూడా ఎవ్వరికీ తెలియనివ్వలేదు. ఆయాద్వారా ఈ విషయాలన్నీ రాఘవ దుర్గకు తెలియపరిచాడు.

విశాఖపట్నం వెళ్ళగానే సుధకు, మాణిక్యమ్మకు, ఆమె భర్తకు దుర్గను పరిచయంచేశాడు రాఘవ. మాణిక్యమ్మ, సుధ దుర్గను చాలా మెచ్చుకున్నారు. 'మా కోడలు' అంటూ అందరికీ పరిచయం చేసింది. 'మా వదిన' అంటూ సుధ తన స్నేహితులకు పరిచయం చేసింది.

''రాఘవా! నీకు మంచి అందమైన, గుణవంతురాలైన పెళ్ళాం దొరికింది. చాలా సంతోషంగా ఉందిరా నాకు'' అంటూ దుర్గను చూసి తెగ మురిసిపోయింది మాణిక్యమ్మ.

దుర్గను అంతగా పొగిడేస్తుంటే రాఘవకు కొన్త గర్వంగా అనిపించినా, మళ్ళీ పోలీసుద్యోగం గుర్తుకొచ్చి కోపం కూడా వచ్చింది.

అతి రహస్యం బట్టబయలు అన్నట్టు దుర్గ ఉద్యోగం గురించి రాఘవ ఎంత దాచాలన్నా నిలుపడలేదు. కారణం సుధ భర్త మోహన్ సి.ఐ. కావటమే. దుర్గ, మోహన్ ఒకే టైంలో ట్రయినింగ్ అయ్యారు. అతను దుర్గను చూసి వెంటనే గుర్తుపట్టేసి ''ఏమిటి సిస్టర్! బావున్నారా? వీళ్ళు మీకు బంధువులా? ఎలా? ఏమిటి?'' అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు.

దుర్గ మోహన్‌కు అన్నింటికీ చిరునవ్వుతో సమాధానం చెప్పి, రాఘవకు అతన్ని పరిచయం చేసింది మా క్లాస్‌మేట్ అంటూ!

మోహన్ చాలా కలుపుగోలుమనిషి. బావగారూ అంటూ కలిసిపోయి సాయంత్రానికంతా బావగారూ అంటూ ఇంత దీర్ఘంతీయడం కష్టంగా ఉందంటూ దాన్ని షార్ట్‌కట్‌చేసి బారూలోకి దించేసి అందర్నీ నవ్వించేశాడు.

పెళ్ళి ఘనంగా జరిగింది. చాలావరకు పెళ్ళికి పోలీస్ డిపార్ట్‌మెంటు తరలివచ్చింది. వాళ్ళు మఫ్టీలో వచ్చినా వాళ్ళ క్రాఫులనుబట్టి పోలీసులని పసిగట్టేశాడు రాఘవ. ఎక్కడికి వచ్చినా ఈ పోలీసుమేళం తప్పేట్టులేదని మనసులో విసుక్కున్నాడు. కానీ తన తరపు బంధువులే కావటంతో ఆ విసుగును మనసులోనే దాచుకోక తప్పలేదు.

పెళ్ళయిన గంటసేపటికి మోహన్ డియరెస్టు ఫ్రెండ్ సత్యమూర్తి వచ్చాడు బస్సు లేటు, రైలు అందలేదు అంటూ. కుశల ప్రశ్నలు, పరామర్శలు అయ్యాక, "ఏరా! మా చెల్లి ఇంకా పుట్టింట్లోనే ఉందా? రాజీపడలేదా?" అంటూ అడిగాడు మోహన్.

"ఎలా రాజీపడతాం! ఆడదానికి ఆవిడకే అంత టెక్కు ఉంటే నాకుండదా? ఎన్నాళ్ళుంటుందో ఉండనీ! ఆ ఉద్యోగముందనేగా అంత పొగరు!" అంటూ మూడ్ మారిపోయి కోపంగా మాట్లాడాడు.

రాఘవకు విషయం అర్థంకాక మోహన్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"వీడి భార్య మన దుర్గమ్మలాగే యస్.ఐ! ఈమధ్యనే ప్రమోషన్ వచ్చింది. వీడికి భార్య పోలీస్ ఉద్యోగం చేయటం ఇష్టంలేదు. ఉద్యోగం మానమని వీడూ మాననని ఆవిడా మూడు సంవత్సరాలు పోట్లాడుకుంటూ ఓ కొడుకును కూడా కన్నారు. అయినా వీరి పోట్లాట ఆగలేదు. సరికదా శృతిమించిపోయింది. ఆమె ఉద్యోగం చేసుకుంటూ పుట్టింట్లో ఉండిపోయింది. వీడుమాత్రం ఆమెతో రాజీపడటానికి ఒప్పుకోక వీడి ఉద్యోగం వీడు చేసుకుంటున్నాడు"

రాఘవకు అనిపించింది, సత్యమూర్తి బాధ, తన బాధ ఒక్కటేనని. కాకపోతే తమకు పిల్లలు పుట్టలేదు, తనలాగా ఆయన లెక్చరర్ కాకుండా రిజిస్ట్రారాఫీసులో క్లర్కు! అంతే తేడా.

"మా బావగారిని చూసి అయినా బుద్ధి తెచ్చుకోరా వెధవా! తను లెక్చరర్ అయినా భార్య పోలీస్ డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తుంటే నీలాగే ఉడుక్కుని కుళ్ళుకుంటున్నాడా?

నేనూ పోలీస్ డిపార్టుమెంటులోనేగదా చేస్తున్నాను. నేను, నీవు క్లోజ్ ఫ్రెండ్స్ుమయివుండీ పోలీస్ డిపార్టుమెంటులో భార్య ఉద్యోగం చేస్తుంటే పరువుతక్కువన్నట్లు భరించలేక పోట్లాడ్డం! నీ మనస్తత్వం చూస్తుంటే నాకు చాలా సిగ్గుగా ఉందిరా!" అంటూంటే రాఘవ తేలుకుట్టిన దొంగలా అయిపోయాడు.

"స్త్రీలు చంద్రమండలానికి వెళ్ళివస్తున్న ఈరోజుల్లో కేవలం పోలీసుద్యోగం చేస్తున్న స్త్రీ భార్య అయినందుకు ఉడుకుమోత్తనం, అసూయ చూపి వారిని బాధపెట్టడం చదువు, సంస్కారంగల ఈ యుగంలో పుట్టిన మనకు తగనిపని! ఆ ప్రవర్తన పురుషాధిక్యతను నగ్నంగా చాటి మనల్ని సంస్కారహీనులను చేస్తుంది. అసలు ఆవిడ ఆ ఉద్యోగం చేయటంవల్ల నీకేం బాధో వివరించి చెప్పు" అన్నాడు మోహన్ సత్యమూర్తితో.

"ఏంటోరా! స్త్రీ అంటే నిండుగా చీరతో ఇంటిపట్టున ఉండాలి. భర్త, పిల్లల సంరక్షణ చూస్తే చాలు. కాకపోతే చదివిన చదువు నిరర్థకం కాకుండా ఏ టీచరో, ఆఫీసులో క్లర్కుగానో అయితే అంత బాధ ఉండేదికాదు" అన్నాడు సత్యమూర్తి.

"అయితే నీకు ఆమె చేసే ఉద్యోగంకంటే, వృత్తిధర్మంగా వేసుకునే డ్రస్సుగురించన్న మాట అసలుబాధ! చూడు మూర్తీ! ఒక్కో వృత్తి ఒక్కోరకం. మాకు ఆవిధమైన డ్రస్సు అయితేనే అనువుగా వుంటుందని అలాంటిది పెట్టారు. నీవు ఉద్యోగంలో చేరిన కొత్తలో కాలు విరిగి హాస్పటల్‌లో మూడునెలలున్నావు... గుర్తుందా! 'సిస్టర్స్ నన్ను ఓ బ్రదర్‌లా ట్రీట్ చెయ్యటంవల్లనే నేను త్వరగా కోలుకున్నాను, అన్నావు గుర్తుందా! సిస్టర్స్ కూడా యూనిఫాం వేసుకుంటారుగదా! మరి నీవు వారిని సిస్టర్స్‌గానే ఎందుకు ఊహించుకున్నావు. చూసే కళ్ళకు, మనసుకు సంస్కారం ఉంటే అందరూ మంచిగానే కనిపిస్తారు. నిండా చీర కట్టు

కుని పసుపు రాసుకుని పూలుపెట్టుకున్న స్త్రీని గౌరవించనూవచ్చు. గౌరవిస్తూనే వంపుసొంపు లన్నీ వెతకవచ్చు. చెప్పానుకదా! అది మన సంస్కారంమీద ఆధారపడి వుంటుందని! పోలీస్ డ్రస్‌లో ఉన్నవారిని స్త్రీలైనా, పురుషులైనా పోలీసు అన్న భావంతో చూస్తారేతప్ప నీలాగా ఆలోచించరు. అనవసరంగా ఆలోచించి బుర్ర పాడుచేసుకుని టైం వేస్టుచేసుకోక మా చెల్లిని పుట్టింటినుంచి తీసుకురా! యస్.పి.గా నాకు తెలిసినాయన ఉన్నారు. నీవున్నచోటికే ట్రాన్స్‌ఫర్ చేయిద్దాం'' అన్నాడు మోహన్.

“చూద్దాంలే! నన్ను కాస్త ఆలోచించుకోనీ!” అంటూ సత్యమూర్తి లేచి వెళ్ళిపోయాడు.

“చూడండి బావగారూ! మీలాంటి మంచి మనసు ఎంతమందికుంటుంది చెప్పండి! ఇంత చదువు చదివీ వాడి ఆలోచనలు చూశారా ఎంత అసహ్యంగా ఉన్నాయో! పోలీసులు దేశానికికెంతముఖ్యమో చెప్పండి. నా భార్య ఓ పోలీసు, వంటింటికే అంకితం కాకుండా తనవంతు దేశసేవ కూడా చేస్తోంది. చేయాలి! అనుకునే మీలాంటి భర్తలుంటే స్త్రీలకింత బాధ ఉండేదికాదుకదా! పురుషుల్లో ఈ మార్పు, విశాలహృదయం లేకుంటే స్త్రీలు ముందంజ ఎలా వేస్తారు చెప్పండి! ప్రతి పురుషుని విజయం వెనుక ఓ స్త్రీ వుంటుంది అంటారు. ప్రతి స్త్రీ విజయానికి కూడా పురుషుడి ప్రోత్సాహం ఉండితీరాలి. అప్పుడే స్త్రీలు ఏదైనా సాధిస్తారు. దేశానికి మంచి జరుగుతుంది!” అన్నాడు మోహన్.

రాఘవని అతని మాటలు కాస్త ఆలోచింపచేశాయి.

“ఏమిటండీ కొత్తపెళ్ళికొడుకుగారూ! పాటకచేరీ ఏర్పాటుచేశారు రండి” అంటూ లాక్కుపోయారతన్ని ఎవరో వచ్చి.

ఆ సాయంత్రం అందరిదగ్గర వీడ్కోలు తీసుకుని రాఘవ, దుర్గ విశాఖపట్నంనుంచి బయలుదేరి వచ్చేశారు.

రాఘవ కళ్ళముందు పోలీస్ డిపార్టుమెంటు అంటే ఉన్న ఎలర్జీ కాస్త కాస్తగా కరుగుతున్నట్లుంది. అహం అడ్డొచ్చి ప్రశ్నిస్తోంది.

“ఇన్నాళ్ళయింది! ఏదో జరిగిపోయింది. మనం మామూలుగా ఉండిపోదాం అంటూ దుర్గ తనంత తాను వచ్చి తనను మంచి చేసుకుంటే కరిగిపోడా? పెద్ద పోజు కొడుతోంది! కోర్టు నిబంధనలు, గాడిద గుడ్డు, అంటూ ఏమాత్రం తొణక్కుండా రోజులు గడిపేస్తోంది.

‘ఛ! తనేమిటి ఇలా ఆలోచిస్తున్నాడు! ఆ మోహన్‌గాడేదో పోజుపెట్టి స్పీచిచ్చినంతమాత్రాన తను పడిపోయి ఈవిడకు దాసోహమయ్యేలా ఉన్నాడే! అతనూ ఆ డిపార్టుమెంటే కాబట్టి దేశభక్తి, దేశసేవ, సింగినాదం, అంటూ కబుర్లు చెబుతున్నాడు. వాడూ ఏదన్నా తనలాగా ఏ మామూలు ఉద్యోగమో చేస్తే తెలిసేది పెళ్ళానికి పాంటు, షర్టు తొడిగి ఊరిమీదకు పంపేవాడో లేక వంటింటికి అంకితం చేసేవాడో! పెద్ద పోజు వాడూ! తనదాకా వస్తేకానీ తెలియదని ఊరికే అన్నారా పెద్దలు.

అందరూ తనకు బుద్ధిచెప్పేవారే!

ఛ! అసలీ పెళ్ళికి రాకున్నా బావుండేది!

ఇలా తిట్టుకుంటున్నా లోపలమాత్రం రాఘవకు పోలీస్ డిపార్టుమెంటుమీద కొద్దిగా ఎలర్జీ తగ్గిందనే చెప్పాలి.

చీటికీమాటికీ ఆ డిపార్టుమెంటును డైరెక్టుగానూ, ఇన్‌డైరెక్టుగానూ సూటిపోటి మాటలతో తిట్టిపోసే అలవాటున్న రాఘవ విశాఖనుండి వచ్చాక సైలెంటయిపోయాడు.

★ ★ ★

వారంరోజులనించి దుర్గ రోజులో ముప్పావు భాగం డ్యూటీలో ఉండసాగింది. తనవంతు వంట చెయ్యాల్సి వచ్చినరోజు టైంలేక మరీ బాధపడిపోయి ఏ మూడుగంటలకో లేచి పని మొదలు పెట్టేది. ఆ వారం రాఘవతో సినిమా ప్రోగ్రాంకు కూడా ‘నాగా’ పెట్టేసింది. రాఘవకు కోపమొచ్చింది కూడా! ఇంట్లో ఆమెతో మాట్లాట్టం కుదరటంలేదు. ఈసారి సినిమాకు కాకుండా ఏ పార్కుకో తీసికెళ్ళి మనస్ఫూర్తిగా మాట్లాడాలనుకున్నాడు. కుదరటంలేదని చిరాకుపడ్డాడు. అయా దగ్గరికి మెల్లిగా చేరి “ఆవిడ ఈ వారం ప్రోగ్రాం క్యాన్సిల్ చేసేసి డ్యూటీకెళ్ళిపోయింది. కోర్టు నిబంధనలు ఉల్లంఘించిందికదా! మీరేమిటి ఊరికే కూర్చున్నారు. నోట్సు నింపట్లేదా?” అనడిగాడు.

''మరే! పెన్నులో ఇంకయిపోయింది. మళ్లీ రావాలి'' అంది ఆయా!

''ఇంద! నా పెన్ను ఇస్తాను తీసికోండి!'' అన్నాడు రాఘవ. ''అలా వీల్లేదండీ! పెన్నులో ఇంకయిపోయిందని మా ఆఫీసుకు అర్జీ పెట్టుకున్నాను. శాంక్షనయిందిట! రేపో, ఎల్లుండో ఇంకు తీసుకువస్తారు ఆఫీసువాళ్లు. అప్పుడు రాస్తాను'' అంది ఆయా! వళ్లు మండింది రాఘవకు. అదే తన విషయమైతే అరక్షణం ఆలస్యం కాకుండా బరబరా రాసేస్తుంది. కోపాన్ని మింగుకుని ''అలాగా!'' అంటూ లేచాడు రాఘవ! కుండీల్లో మట్టిపోస్తూ అక్కడే ఉన్న నూరమ్మగారు ఇది విని ఆశ్చర్యపోతూ ''ఏమిటే నీ పెన్నులో ఇంకయిపోతే దానికో అర్జీ, శాంక్షనూ, ఇంకు మోసుకురావడాలూనా. నమ్మాలా? ఏదో గవర్నమెంటు సొమ్ము తింటున్నానుకదా అని మరీ అంత పేట్రేగిపోకూడదు'' అంది.

ఆయా వెంటనే ''చూశారా మీకర్థమైనంత మాత్రం రాఘవగారి కర్థంకాదు! ఏమాట కా మాటే చెప్పుకోవాలి. శరీర వ్యాయామం గట్రా చేసేవారికి మెదడు కూడా చురుగ్గా ఉంటుందంటారు!'' అంది చెముడు నటిస్తూ.

''నేనంటున్నది అది కాదు'' అంటూ మళ్లీ మొదటినించి చెప్పింది నూరమ్మ.

''ఏమిటే! ఈ చురుకుదనం తెలివి, ఈ ఆరోగ్యం వగైరాలన్నీ అనుభవించటానికి, చూసి ఆనందించటానికి మీవారు లేరని బాధ పడుతున్నారా? దేనికైనా ప్రాప్తముండొద్దూ?''అంది ఆయా!

చేతిలో వున్న మట్టి తట్ట దబ్బున పడేసి వెళ్లిపోయింది నూరమ్మ! రాఘవకు కంపరమెత్తింది!

ఆయా మాత్రం చిద్విలాసంగా నవ్వుకుంది.

ఆరోజు సాయంత్రం దుర్గ డ్యూటీనించి ఇంటికి రాలేదు. నైట్ డ్యూటీ వేశారంటూ ఇంటికి కబురు పంపింది ఓ కానిస్టేబుల్‌తో.

''మరి భోజనం అదీ... తీసికెడితే బాగుంటుందేమో. దుర్గమ్మకు హోటల్ తిండిపడదు. నన్ను వెళ్లమంటారా? మీరు వెళతారా?'' అంది ఆయా రాఘవనుద్దేశించి! రాఘవకు వెళ్లాలని ఉన్నా ఆయా వెళ్లమంటే వెళ్లినట్లుండటం ఇష్టంలేదు.

''నిబంధనల్లో ఇలాంటివి లేవు. నాకోపిక లేదు'' అంటూ వెళ్లిపోయాడు.

''సరి! సరి! కందకు లేని దురద కత్తిపీటకెందుకు? ఎవరి గొడవ వారిది'' అంటూ వరండాలో పరుచుకుని పడుకుంది ఆయా! రాఘవ ఆయాతో పంతానికి మాట్లాడాడే కానీ ప్రాణం నిలువలేదు. చండితో క్యారియర్ కట్టించుకుని పోలీస్‌స్టేషన్ కెళ్లాడు. పోలీస్‌స్టేషన్ ముందర గందరగోళంగా ఉంది. కాలేజీ లెక్చరర్లు, అబ్బాయిలు, అమ్మాయిలు ఉన్నారు. రాఘవ మూడు రోజులుగా కాలేజీకి వెళ్లటంలేదు. సిలబస్ పూర్తయింది. అదీగాక సెలవుదినాలున్నాయి. ఖర్చుపెట్టేద్దామన్నట్టుగా సి.ఎల్. పెట్టేసి ఇంట్లో ఉన్నాడు.

పోలీస్‌స్టేషనులో దుర్గను రాఘవ చూడటానికి అరగంట పట్టింది! నిశ్శబ్దంగా క్యారియర్ అందించాడు. థాంక్స్ చెప్పి లోపలి కెళ్లిపోయింది దుర్గ!

పరిచయమున్న ఓ యస్.ఐ.తో వివరాలడిగాడు రాఘవ విషయమేమిటని?

''కాలేజీలో ఓ అమ్మాయిని ఏవో గొడవలు పాతకక్షల కారణంగా నిన్నరాత్రి రేప్‌చేసి చంపేసి రైలుపట్టాలమీద పడేశారు. ఈ ఉదయంనించి అబ్బాయిలు, అమ్మాయిలు చనిపోయిన అమ్మాయి గురించి కలెక్టర్ ఆఫీసు ముందు ధర్నాలు, గొడవలు. ఇంకేముంది? అందర్నీ తెచ్చి సెల్‌లో పడేశాం! బెయిల్ ఇచ్చి తీసికెళ్లటానికొచ్చిన జనం వీరంతా!'' ఒక్క ముక్కలో చెప్పేశాడతను. రాఘవ అక్కడే ఓ గంటసేపున్నాడు. సెల్‌లో ఉన్నవాళ్లు, బయట ఉన్నవాళ్లు ఒక్కొక్కరే తరిగిపోయారు. ఇద్దరమ్మాయిలను, మరికొంతమంది అబ్బాయిలను మాత్రం వదలకుండా సెల్‌లోనే ఉంచారు. వారు తీవ్రవాదులకు సంబంధించిన వాళ్లని అనుమానం రావటంతో బెయిల్ ఇవ్వలేదు. లేడీ పోలీసులు యస్.ఐ.లతోపాటు మిగతా పోలీసు సిబ్బందిని పకడ్బందీగా కాపలా పెట్టారు. అర్ధరాత్రి దాటుతోంది. అంతదాకా రాఘవ యస్.ఐ.లతో పిచ్చాపాటీ మాట్లాడుతూ గడిపే

శాడు. దుర్గ రాఘవ దగ్గరకొచ్చి "మీరిక ఇంటి కి వెళ్లండి. నేను ఉదయందాకా రావటానికి కుదరదు" అంది! రాఘవకెందుకో వెళ్లాలని పించట్లేదు. అయిష్టంగా లేచాడు. గేటుదాటి ఓ పది అడుగులు వేశాడో లేదో స్టేషన్‌లోంచి కేకలు వినిపించాయి. వెనక్కు తిరిగి పరిగెత్తా డు. స్టేషనులోంచి ఓ అమ్మాయిని బల వంతంగా తీసుకొస్తున్నారు. ఆమె వళ్లంతా రక్తసిక్తమై ఉంది. దుర్గ, మరికొందరు లేడీపో లీసులు ఆమెను దాదాపు మోస్తున్నట్లు తెచ్చి జీపు ఎక్కించారు. ఆ అమ్మాయి విపరీతంగా ప్రతిఘటిస్తూ కేకలు పెడుతోంది. జీపు వెళ్లిపో యింది. రాఘవ బిత్తరపోయినట్లు నిలబడ్డా డు. విషయమేమిటంటే ఆ అమ్మాయి చేతికు న్న గాజు పగలకొట్టి వళ్లంతా గాయాలు చేసు కుంది. దాదాపు నరాలు తెగిపోయినట్లు రక్తం కారుతోంది. హాస్పిటల్‌కు తీసికెళ్లారు. దుర్గ కూడా జీపులో హాస్పిటల్‌కెళ్లింది. రాఘవ టెన్షన్ పట్టలేక హాస్పిటల్‌కెళ్లాడు. ఆ అమ్మాయి చావు బతుకుల్లో ఉంది. ఆ అమ్మాయి మరణవాఙ్మూలంలో పోలీసులు తనను రేప్‌చేశారని అందుకే ఈ దారుణం చేసుకున్నానని చెప్పి చనిపోయింది. అంత నిర్దాక్షిణ్యంగా ఆ అమ్మాయి అబద్ధమాడటం చూసి రాఘవ ఆశ్చర్యపోయాడు. ఆ రాత్రి రాఘవ అక్కడ అంటే పోలీస్‌స్టేషన్‌లో లేకుండా ఉంటే ఆ అమ్మాయి చెప్పిన మాట లు నమ్మేవాడేమో కానీ స్టేషనునిండా పోలీసు లు. వచ్చే పోయేజనం. నమ్మశక్యంకాని అబద్ధ మాడటంతో పోలీసు సిబ్బంది నోరు తెరవట మేకాక భయపడ్డారు కూడా! మరునటిరోజు పేపర్లనిండా పోలీసులమీద నిందావాక్యాలతో తాటికాయంత అక్షరాలతో రాశారు. రాఘవకు చాలా బాధనిపించింది. ఆడపిల్లలు సుకుమా రులు సున్నిత హృదయులంటారు. కానీ ఆ ఒక్క అమ్మాయి చనిపోతూ చనిపోతూ ఇంత మంది పోలీసుల గుండెల్లో గుబులు పుట్టించి వెళ్లిందంటే ఆశ్చర్యమనిపిస్తోంది. దుర్గ ఆ వారంరోజులు టెన్షన్‌తో గడిపింది! స్టేషన్‌లో ఆ దారుణం జరగలేదని రాఘవకు తెలుసు. కానీ పోలీసులంటే తనలాగా అపోహలు, అనుమా నాలు పెంచుకున్న ప్రజానీకాన్ని ఎవరు నమ్మించగలరు. పోస్టుమార్టం రిపోర్టులు, ప్ర త్యక్షసాక్షులవల్ల కేసు బలహీనపడింది. అయినా ప్రజల్లో మాత్రం నమ్మకం కుది రించలేం. దుర్గకు చాలా బాధనిపించింది. స్టేషన్‌లో జరిగినవి జరుగుతున్నవాటి గురించి కాంపౌండ్‌లోనివారంతా ఏరోజు కారోజు కొత్త వార్తలు మాట్లాడుకోవటం అలవాటయింది ఆ సంఘటన జరిగాక!

"చూడు దుర్గమ్మా! ఆడపిల్ల పోలీసుద్యోగ మంటే అబ్బ! ఎంత గొప్ప! అనుకుని నిన్ను చూసి మురిసిపోయేదాన్ని! కానీ ఇంత బాధ లు ఉన్నట్టుండి చుట్టుకుంటాయనుకోలా! ఇలాంటివి జరుగుతుంటే పోలీసులు మంచి పేరు తెచ్చుకుందామన్నా వీలుపడని పరిస్థితి. ఇక ఆ ఉద్యోగం మానేసి రాఘవతో కాపురం చేసుకో! నా కూతురిలాంటిదానివి. నా మాట విను" అంది సూరమ్మ.

దుర్గ చిరునవ్వు నవ్వింది.

"ఇది చాలా చిన్న విషయం బామ్మగారూ! దీనికే ఇలా భయపడితే ఎలా?" అంది దుర్గ.

"ఏది ఏమైనా ఇది కొంపలు ముంచే ఉద్యోగంలాగా ఉంది. నీ ధైర్యానికి మెచ్చుకోవ చ్చు" అంది సూరమ్మ.

"ఆ డిపార్టుమెంటు స్వర్గం అనుకుంటు న్నావా? ఏమిటి! అంత ధీమాగా ఉంటున్నావ మ్మాయ్ చెబితే అర్థం చేసుకోవా ఏమిటి" పార్వతమ్మ సున్నితంగా మందలించింది!

"లేదండి. స్వర్గమని ఎందుకనుకుంటాను? మంచికో చెడుకో ఈ ఉద్యోగంలో చేరబడ్డాను. ఇప్పుడు భయపడి పారిపోవటం నాకిష్టంలేదు. ఏ ఉద్యోగమూ రిస్కులేకుండా లేదు. ఇంట్లో గృహిణిగా ఉన్నా సమస్యలు బాధలు లేకుండా ఎంతమంది ప్రశాంత జీవితం గడు పుతున్నారు. ప్రతి సమస్యను ఓ ఛాలెంజ్‌గా తీసుకుని సాల్వ్ చేసుకోవటం అలవాటు చేసు కోవాలే తప్ప బేలతనం ప్రదర్శించి పారిపోకూ డదు. అదీ నా పాలసీ!" అంది నవ్వుతూ దుర్గ.

"ఏమిటోనమ్మా! నీ అంత గుండెధైర్యం మాకులేదు" అంది పార్వతమ్మ.

"ఆ మాటకొస్తే మీకున్నంత గుండెధైర్యం మాకులేదు" అంది మర్యాదని కల్పించుకుని.

"ఏమ్మా! ఎందుకని?" అంది పార్వతమ్మ.

"బాబాయిగారిలాంటి చాదస్తపు భర్తతో ఇన్నేళ్లు వేగటం అంటే మాటలా?" అనటంతో అందరూ పక్కున నవ్వేశారు.

మరో వారంరోజులు సాఫీగా గడిచాయి.

★ ★ ★

"నేనూ చండీ పెళ్ళిచేసుకోవాలనుకుంటు న్నాము. మీ అభిప్రాయం చెప్పండి!" అంటూ రాఘవను అడిగాడు శ్రీశైలం.

"ఇందులో నా అభిప్రాయం ఏముంది! మీ పెళ్ళి మీ యిష్టం! అయినా మీరిద్దరూ దాదాపు సంవత్సరంనించి ప్రేమించుకుంటున్నారు కా బట్టీ, ఒకరినొకరు అర్థం చేసుకునే ఉంటారు కాబట్టీ సుఖంగానే ఉంటుంది. నేనిలా త్వరప డి నిర్ణయాలు తీసుకొని అఘోరిస్తున్నాను చూడండి" అన్నాడు రాఘవ.

"మీరు వదినగారి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకో లేక జీవితాన్ని వ్యర్థంచేసుకుంటున్నారు. చిన్న వాడిని అడుగుతున్నానని బాధపడకండి. అస లు మీకు పోలీసు డిపార్టుమెంట్ అంటే అంత కోపం, చులకనభావం ఎందుకు?" అనడిగా డు శ్రీశైలం.

"ఎందుకు అంటే? దానికి జవాబుండదు. కొంతమందిని చూడగానే మంచి, ఇంకొంత మందిని చూడగానే చెడు అభిప్రాయం ఏర్ప డటం సహజమేకదా! అలాగే ఇదీనూ!"

"పోనీ ఆ అభిప్రాయాన్ని మార్చుకోవచ్చు కదా! అంత మార్చుకోను వీల్లేని అభిప్రాయా న్ని ఏర్పరచుకున్నారా ఆ డిపార్టుమెంటు మీద!"

"ఎలుకతోలు తెచ్చి ఎందాక ఉతికినా నలుపు నలుపేగాని తెలుపుగాదు విశ్వదాభి రామ వినురవేమ!" అంటూ సూరమ్మగారు పద్యం గట్టిగా పాడారు.

ఆవిడ రాఘవకు, శ్రీశైలంకు కనిపించ కుండా గోడవారగా ఆసనం వేసుక్కూ ర్చుందింతసేపూ. రాఘవకు ఒళ్ళుమండింది. కానీ తమాయించుకున్నాడు. ఆవిడను 'ఏంటండీ!' అని నిలదీసినా 'నీపేరెత్తానా? నీ ఊరెత్తానా? నేనేం మాట్లాడుకున్నా అది నీకు సంబంధించినదేమోనని భుజాలు తడుము కుంటావెందుకు? ఆ యమధర్మరాజు దగ్గరకె ళ్ళొచ్చిందగ్గర్నుంచి నాలో నేను లేను! మధ్యలో ) నస ఏంటి? ముందు ఇల్లు ఖాళీచెయ్యి' అంటూ దండెత్తటం నేర్చుకుంది.

★ ★ ★

ఆ మరుసటి నెలలో కాలేజీలో పరీక్షలు జరుగుతున్నాయి. రాఘవను ఆడపిల్లల కాలే జీకి ఇన్విజిలేటర్‌గా వేశారు.

దుర్గను, మరికొంతమంది ఆడపోలీసులను కాలేజీ వెలుపల, లోపల బందోబస్తు వేశారు.

ఆరోజు కాలేజీలో గందరగోళం జరిగింది. కాపీ చేస్తున్న ఓ అమ్మాయిని రాఘవ రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నాడు. అట్ట కింద పెట్టు కున్న కాపీ స్లిప్పులు, అంతవరకు రాసిన పేపర్లు చింపివేసి కొత్త పేపర్లు ఇచ్చి తిరిగి రాయమన్నాడు. దాంతో ఆ అమ్మాయి రెచ్చి పోయి రాఘవతో తగాదా పెట్టుకుంది. తను మాజీ మంత్రి కూతుర్నంది. నిమిషాల్లో ట్రాన్స్ ఫర్ చేయిస్తానంది! రాఘవ అన్నిటికీ మౌనంగా ఉన్నాడు. విషయం ప్రిన్సిపాల్ దాకా పోయింది. ప్రిన్సిపాల్ ఆ అమ్మాయినే కోప్పడి చూడమ్మా ఈ మేష్టారు మంచి వాడు కాబట్టి నిన్ను పరీక్ష రాయటానికి అనుమతించాడు. ఈయన స్థానంలో నేనుంటే డిబార్ చేసి మూడే ళ్లు ఇంట్లో కూర్చోపెట్టేవాడిని" అంటూ కోప్పడి పంపించేశాడు.

దుర్గకు ఈ విషయం తెలిసింది కానీ పోలీసులు జోక్యం చేసుకునేంతగా వ్యవహారం రాలేదు కాబట్టి ఊరుకుండిపోయింది.

ఆ మరుసటి రోజు పరీక్ష జరుగుతున్న సమయంలో రాఘవ ఉన్న హాల్లోకి వచ్చి "ఎక్స్‌క్యూజ్‌మీ సర్" అంటూ ఓ కానిస్టేబు ల్‌తో సహా లోపలికి వచ్చింది దుర్గ. రాఘవకు చాలా కోపంవచ్చింది.

"చూడండి! ఇక్కడ చాలా ప్రశాంతంగా పరీక్ష రాస్తున్నారు. ఏ గొడవలూ లేవు మీరు వెళ్లచ్చు" అన్నాడు కఠినంగా.

రాఘవ మాటలు వినిపించుకోకుండా లోప లికి వచ్చి క్రితంరోజు గలాటా చేసిన అమ్మాయి దగ్గరకు సరాసరివచ్చి ఆ అమ్మాయి జాకెట్లో చెయ్యి పెట్టింది.

ఆ పిల్ల పెనుగులాడింది. రాఘవ దగ్గరకొ చ్చాడు "ఏమిటిది? ఆ అమ్మాయినేం చేస్తున్నా

రు ముందు బయటకెళ్లండి'' అంటూ అరిచాడు.

దుర్గ అతని మాటలు వినిపించుకోక ఆ అమ్మాయి చెంప పగిలేలా దెబ్బ కొట్టి జాకెట్‌లో దాచుకున్న ఓ చిన్నసైజు టానిక్ లాంటి సీసా బయటకు తీసింది. ఇంతలో వెనుక బెంచీలో కూర్చున్న మరో అమ్మాయి కనురెప్ప మూసి తెరిచేంత సమయంలోనే తన దగ్గరున్న ఓ సీసా రాఘవ మీదకు విసిరేయటం, రాఘవ ఆ సీసా మొహానికి తగలకుండా తల పక్కకు తిప్పటం జరిగిపోయింది.

దుర్గను, ముందు బెంచీలో ఉన్న అమ్మాయిని విడిపించే ప్రయత్నంలో తన చేతులు వాళ్లిద్దరి మధ్య ఉండటంతో సీసాలో ఉన్న యాసిడ్ రెండు చేతుల మీద పడింది. అది కూడా కొంచెం కొంచెంగా దుర్గ చేతుల మీద, ఆ అమ్మాయి చేతులమీద కానిస్టేబుల్ చేతుల మీద పంచుకున్నట్లు పడటంతో ఆ అమ్మాయీ, రాఘవా గావుకేకలు వేశారు.

ఇద్దరమ్మాయిల్నీ పోలీస్ జీప్ ఎక్కించి, రాఘవను తీసుకుని హాస్పిటల్‌కెళ్లి చికిత్స చేయించి ఇద్దరూ ఇల్లు చేరుకునేసరికి సాయంత్రమయింది. రాఘవకు రెండు చేతులు మీదా యాసిడ్ పడటంతో బొబ్బలు వచ్చి మంటతో బాధపడసాగాడు. హాస్పిటల్‌లో కనీసం ఓ రెండు రోజులైనా ఉండమన్నారు. కానీ దుర్గ అతన్ని ఆ వాతావరణంలో ఉంచటం ఇష్టం లేక తీసుకొచ్చేసింది. రాఘవ మాత్రం తన ఇష్టానిష్టాలు వ్యక్తం చేయక తన బాధలో తానున్నాడు.

పార్వతమ్మ, ఆయా, నూరమ్మగారు, మహిషాసుర్ కుటుంబం అంతా రాఘవను చుట్టుముట్టారు.

"చేతుల మీద కాబట్టి సరిపోయింది. ముఖం మీద చల్లి ఉంటే... అమ్మో... రాఘవా ఎంత గండం తప్పిందయ్యా నీకు సమయానికి అమ్మాయి రాబట్టి సరిపోయింది కానీ..." అంటూ పార్వతమ్మ కళ్లనీళ్లు పెట్టుకుని బాధపడింది.

నూరమ్మగారు కూడా బాధపడింది. "అనలా పిల్లతో విరోధం ఎందుకు పెట్టుకున్నావబ్బాయ్!" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

"ఆ పిల్ల దగ్గర యాసిడ్ సీసాలు ఉన్నాయని నీకెలా తెలుసమ్మాయ్!" అంది ఆయా దుర్గతో.

ఈ రోజు ఉదయమే చండి వచ్చి చెప్పింది! నిన్న కాపీ కొట్టిన గొడవ ప్రిన్సిపాల్ దాకా వెళ్లటంతో ఈ రోజు లెక్చరర్స్‌కు గుణపాఠం నేర్పాలనీ, ఈయన మొహం మీద యాసిడ్ చల్లాలనీ ప్లాను వేసిందిట ఆ పిల్ల! తన దగ్గరున్న సీసాలోని యాసిడ్ ఏ కారణం చేతనయినా చల్లలేకపోతే వెనుక బెంచీలో ఉన్న అమ్మాయిని చల్లమని నేర్పి సీసా ఇచ్చిందిట.

అయితే ఈ అమ్మాయి యాసిడ్ చల్లుతుందని మాత్రమే ఇన్‌ఫర్‌మేషన్ రావటంతో ఈ పిల్లనే పట్టుకోవటం, పెనుగులాడటంతో సరిపోయింది. వెనుక బెంచీ అమ్మాయి దగ్గర కూడా యాసిడ్ ఉందనీ, చల్లుతుందనీ ఊహించలేకపోయాము. అందువల్లనే ఈ ప్రమాదం జరిగింది. దుర్గకు కూడా ఎడమ చేతి మీద యాసిడ్ పడటంవల్ల కట్టుకట్టించుకుంది. కానీ రాఘవ లాగా ఎక్కువ బాధలేదు.

ఆ అమ్మాయి నిజంగా ఓ మాజీ మంత్రి కూతురే. కానీ ఆ పిల్లకు కాస్త ఉన్మాద లక్షణాలు, శాడిస్టులక్షణాలు ఉన్నాయనీ, క్షమించమనీ కూతుర్ని స్టేషన్‌నించి బెయిల్ మీద తీసికెళ్లాడుట ఆ అమ్మాయి తండ్రి. కేసు జరగకపోవచ్చు. అంటూ వివరాలు చెప్పింది దుర్గ.

మూడిళ్ల కుటుంబ సభ్యులూ ఈ దంపతులమధ్య ఈ రోజునించి కోర్టు నిబంధనలెలా పనిచేస్తాయో చూడాలని ఉత్కంఠతో ఎదురుచూడసాగారు.

రాఘవకు మాత్రం దుర్గతో సేవలు చెయించుకోక తప్పలేదు.

★ ★ ★

ఆరోజునించి దుర్గ టిఫిను, వంట చేయటం, రాఘవకు టిఫిన్ తినిపించటంతో సహా పనులన్నీ చేసి, చేతులకు ఉన్న కట్టు విప్పి డెట్టాల్‌తో క్లీన్ చేసి, మందువేసి, కట్టుకట్టి, టాబ్లెట్స్ మింగించి డ్యూటీకి వెళుతోంది.

ఈ పనులన్నీ రాఘవతో మాట్లాడకుండానే చేస్తోంది గానీ నూరమ్మగారూ, పార్వతమ్మా కుతూహలంగా వారిద్దరు మాట్లాడుకోటం వినా

లనుకుని గోడలచాటునించి, కిటికీలోంచి పను లు వదులుకుని మరీ చూసినా నిరాశే మిగి లింది. రాఘవ గత్యంతరం లేక దుర్గ తిని పిస్తే తిని మందులు మింగుతున్నాడు కానీ మనసులో చాలా బాధ పడసాగాడు. అతను బాధపడేది ఆమెతో సేవలు చేయించుకుంటు న్నందుకు కాదు. తనకింత సేవలు చేస్తోంది కదా! పెదవి విప్పి మాట్లాడకూడదా? అని రోజుకు వందసార్లు అనుకోసాగాడు.

"పొగరుబోతు" ఉక్రోషంగా అనుకున్నాడు.

ఓ మూడు రోజుల తర్వాత రాఘవ తల్లి దండ్రులూ, అక్క సుజాతా వచ్చారు. రాగానే రాఘవ తల్లి శోకాలు పెట్టింది. "వీడి జాతకమే నష్టజాతకం లాగుంది. ఎప్పుడు సుఖపడ్డాడు గాబట్టి. ఎపుడూ ఒంటరి బతుకే సరిపో యింది. చిన్నప్పటినించి చదువు పేరుతో, ఉద్యోగం పేరుతో తల్లిదండ్రులకు దూరంగా గడిపాడు. ఇపుడు పెళ్లయి పెళ్లాముండీ ఒంటరి బతుకైపోయింది" అంటూ పార్వత మ్మగారికి చెబుతూ ముక్కు చీదింది.

"ఊరుకోమ్మా! నాకిపుడేమయిందని" అన్నాడు రాఘవ.

"ఇంకా ఏం కావాలిరా! పిల్లలు సుఖంగా, సంతోషంగా కాపురం చేసుకుంటుంటే చూసి సంతోషించాలని తల్లిదండ్రులు ఆశపడతా రు. పెళ్లయి పెళ్లాముండి ఈ బతుకేంటి? ఈ కోర్టు వ్యవహారమేంటి?" అంది.

"అన్నీ అవే సర్దుకుంటాయి, మీరు కాస్త నెమ్మదించండి" అంటూ ఓదార్చబోయింది సూరమ్మగారు.

"అయినా మగనికిష్టంలేని ఉద్యోగం ఆడది చెయ్యటం, ఎదిరించటం మీ కాలంలో, మా కాలంలో చూశామా బామ్మగారూ! కలికాలం కాకపోతే. ఆడది ఆడదే, మగాడు మగాడే కాదంటారా? ఎన్ని జన్మలనించి దాపు రించిందో ఈవిడగారు మా ప్రాణాలు తోడెయ్యా టానికి" అంది అక్కసుగా.

అన్ని మాటలు అత్తగారు అంటుంటే కిమ్మ నకుండా వింటూ పనులు చేసుకోసాగింది దు ర్గ. దుర్గ వింటోందని రాఘవకు బాధగా ఉంది. తల్లి నోరు మూయించలేకపోయాడు ఆవిడ ఉన్న మూన్నాళ్లూ! నాలుగో రోజు 'నాకు పనులున్నా'యంటూ రాఘవ తండ్రి బయలు దేరుతూ "అబ్బాయిని చూసుకుని కొన్నా ళ్లుండిరా!" అని భార్యకు చెప్పాడు.

"సరి! సరి! నేనుండి చేసేదేముంది! నేను న్నా లెక్కా జమా లేకుండా తను వండిందే మేం తిని చావాలన్నట్లు చప్పిడికూడు చేసి పడేస్తోందిగా! ఎవరి అవస్థ వారిది. నేనీ వాతా వరణంలో ఉండలేను" అంటూ తనూ ప్ర యాణం కట్టింది.

"కొడుకు పెళ్లి కోసం తను పోలీసు ఉద్యోగి నన్న విషయం దాచి పెళ్లి చేసిన ఆ తల్లి, అత్తస్థానం రాగానే సాధించటం చూస్తుంటే స్త్రీలంతా ఇంతేనా? అనుకుని నవ్వుకుంది దుర్గ! ఎటొచ్చీ మామగారు మాత్రం దుర్గని పల్లెత్తుమాట అనలేదు. పైగా అప్పుడప్పుడూ తనని సపోర్టు చేస్తూ వచ్చాడు కూడా. ఇక ఆడపడుచు అర్ధమొగుడంటారు! ఈ అర్ధమొ గుడికన్నా పూర్తి మొగుడు రాఘవే ఎన్నో రెట్లు నయం" అనుకుంది దుర్గ.

"అదేంట్రా! పెద్దంతరం చిన్నంతరం లేకుండా ఆ మగ డ్రస్సు వేసుకుని బూట్లు టక్ టక్ లాడిస్తూ లాఠీ కర్రపుచ్చుకుని మగరాయు డిలా ఆ నడకేంటి? ఎలా భరిస్తున్నావురా బాబూ!"

"నీతో ఒక్కమాట కూడా మాట్లాడదేంటి?"

"పడకలు కూడా వేరేనా?"

"మొగుడికి రెండు చేతులూ కాలి బొబ్బలె క్కిపుళ్లయ్యాయి కదా! అవి నెప్పిగా ఉందా! తగ్గిందా! అంటూ చిన్న పరామర్శ వద్దూ!"

"చెప్పొద్దూ! ఉద్యోగం చేస్తున్నానని తెగ నీలుగుతోంది"

"అమ్మో! ఇదే మీ బావగారైతేనా ఉప్పు పాతర వేసి ఉందురు"

"అయినా నువ్వు చవటవని దానికి బాగా తెలిసిపోయింది. అందుకే ఆడిస్తోంది"

"ఏదో నాల్రోజులుండి ఓ వెంకటగిరి చీర కట్టబెడితే వెళదామనుకుంటే, గెడ్డం పెంచు కుని చేతులకు కట్లు కట్టుకుని పేషంటులా నువ్వు, మగరాయుడిలా అదీ, ఇంట్లో ఇరవై నాలుగ్గంటలూ ఆ నోట్సు రాసుకుంటూ ఆ ముసలిది, తెల్లారితే గంటకొట్టినట్టు వచ్చే ఆ గుమాస్తా! ఆస్పత్రి, పోలీసు స్టేషను, కోర్టు అన్నీ మీ ఇంట్లోనే కంపుకొడుతున్నాయి బాబూ నేనుండలేను" అంటూ ప్రయాణం కట్టింది రాఘవ అక్కగారు సుజాత.

"పోనీ నాక్కాస్త నయమయ్యేదాకా నీవైనా ఉండవే అక్కా!" అన్నాడు రాఘవ. అలాగైతే ఆవిడ త్వరగా వెళ్ళిపోతుందనీ, పోవాలనీ ఆశ పడుతూ.

ఆమె చిన్నప్పటినించి అంతే. ఉండ మంటే వెళ్లటం, వద్దంటే ఉంటాననటం, అవు నంటే కాదనటం లాంటివి అసంకల్పిత ప్రతీ కార చర్యల్లా చేస్తుందని రాఘవకు తెలుసు.

ఉండనంటే ఉండనని వెళ్లిపోయింది. వెళుతూ వెళుతూ "అవును రాఘవా! వచ్చిన ప్పటినించీ అడుగుదామని మర్చిపోతూనే ఉన్నాను. ఇంకో ఆర్నెల్లకు ఈ పిల్లతో సంబంధ బాంధవ్యాలు తెగిపోతాయికదూ!" అంది.

"ఊఁ" అన్నాడు ఇబ్బందిగా ఎటో చూస్తూ రాఘవ.

"అపుడు నీవు మళ్లీ పెళ్లి చేసుకోవచ్చుక దూ!"

"మరే!" కాస్త విసుగ్గా అన్నాడు.

"ఈ జంజాటం వదిలించుకుని త్వరగా మన ఊరు బదిలీ చేయించుకో! మన శశిరేఖ నిచ్చి పెళ్లి చేస్తాను! సరేనా" అంది. సరే అనేదాకా వదలనన్నట్టు.

"సరేస్లే" అంటూ గుమ్మంవైపు చూశాడు.

అక్కడ చేతిలో పళ్లరసం గ్లాసుతో ఎంత సేపటినించీ నిల్చుందో దుర్గ "సరేస్లే" అన్న రాఘవ మాట వింటూండగానే రాఘవ కళ్లల్లోకి చూసింది.

రాఘవ మొహం తిప్పుకున్నాడు భావాలు కనిపించకుండా! కానీ మనసులో చాలా బాధప డ్డాడు. భార్య ముందు మరో పెళ్లి గురించి భర్త మాట్లాడటం, అది భార్య వినటం ఆ ఫీలింగ్సు అనుభవించిన వాళ్లకే తెలుస్తాయి.

నెమ్మదిగా పళ్లరసం గ్లాసుతో వచ్చి రాఘవ నోటికందించింది. త్రాగుతూ దుర్గ వైపు చూశా డు. దుర్గ ముఖం మీద ఏ భావమూ కనిపించ కుండా జాగ్రత్త పడింది. అది కూడా ఆమె వృత్తిధర్మంగా, ట్రెయినింగ్‌లో నేర్పించిన పాఠంలాగా.

"వెళ్లొస్తారా రాఘవా! వెళ్లొస్తానమ్మా తల్లీ, నోరంతా చప్పిడి కూడుతో కాయకాసిపో యింది" అని లేచింది.

"ఏమండీ బామ్మగారూ! మా తమ్ముణ్ణి కాస్త పరామర్శిస్తుండండి! నోరు చచ్చిన వెధవ. ఎలా బతుకుతాడో ఏంటో! పార్వతమ్మగారూ! మర్దినిగారూ వెళ్లొస్తానండీ" అంది.

"మళ్లీ ఎప్పుడండీ రాక" అన్నాడు శ్రీశైలం.

"మాఘమాసంకంతా వచ్చేస్తాను, ఏకంగా ముహూర్తం పెట్టుకుని"

"కూతురి పెళ్లిగాని చేస్తున్నారా?"

"అవునయ్యా!"

"సంతోషం! ఏ ఊరబ్బాయి? కట్నం ఎంతి స్తున్నారు?"

"నువ్వు మరీ అమాయకుడివబ్బాయ్! మా రాఘవకిచ్చి చేస్తున్నాను. ఈ కోర్టు జంజాటం అవగానే పెళ్లి చేసుకుంటానని ఇపుడే మాట తీసుకుని వెళుతున్నాను రాఘవతో!" అందా విడ.

అంతా ముఖాలు చిన్నబుచ్చుకున్నారు. అది చూసి సుజాత మొహం అప్రసన్నంగా మారిపోయింది. ఏంటీ అంతా మొహాలు అలా పెట్టుకున్నారు, మీ కొంపలన్నీ నేను జప్తు చేసినట్లు! అవున్లే వాడు సుఖపడటం మీకెవ్వ రికీ ఇష్టం లేదని తెలుస్తోంది. ఈ కాంపౌండ్‌లో ఎవరు మాత్రం సుఖంగా బతుకుతున్నారు కాబట్టి? ఈ మర్దిని, మహిషాసుర్‌ల సంసారం ఇలా ఏడుస్తోందా? ఆ పార్వతమ్మ మొగుడి సాధింపులతో, కొడుకు సినిమా పిచ్చితో అలా వేగుతోందా? ఈ శ్రీశైలం ముదిరిన బెండకాయ కుమల్లే తయారయి పిల్లనిచ్చే దిక్కు, పెళ్లి చేసే దిక్కులేక చస్తున్నాడా? ఇక ఈ సూరమ్మ గారు నోటికి పత్యంగా ఏదీ వండుకు తినక, పచ్చికూరలు, గడ్డి, గరక అంటూ మేకతిండి తిని చస్తోందా! అందుకే మీరంతా ఇలా ఉంటే వాడు పెళ్లి చేసుకుని సుఖపడతాడని కుళ్లు" అంది అక్కసుగా.

అందరికీ కోపం వచ్చింది కానీ ఆడపడుచు వెనకే నిల్చుని అంతా వింటున్న దుర్గ నము దాయిస్తున్నట్టు, అభ్యర్థిస్తున్నట్టు చేతులు జోడించటంతో అందరూ నోళ్లు పడిపోయిన ట్టుగా ఉండిపోయారు.

★ ★ ★

"ఏమిటో చండీ! ఈమధ్య నా మనసు బాగుండటంలేదు" అన్నాడు శ్రీశైలం. రైలు పట్టాల వెంట ఇద్దరగా చేతులు పట్టుకుని

నడుస్తున్నారు.

"ఏం! ఎందుకని! ఎప్పటినించి?" అంది చండి!

"ఆవిడ నన్ను ముదిరిన బెండకాయ అన్నప్పటినించీ! నిజంగానా మొహం అంత ముదిరిపోయిందా? చెప్పు చండీ!"

"నాకంత కరెక్టుగా చెప్పటం తెలీదుకానీ గజనిమ్మకాయ తోలులాగా బుగ్గలు, పదేళ్లుగా వర్షం రాక బీటలు వారినట్లున్న పొలంలా నొసలు, రాయలసీమలో నీళ్లు లేక లోతుకెళ్లిపోయిన బావుల్లా కళ్లు, నీళ్లలో పడి చచ్చి ఊరిన కప్పలాంటి ముక్కు, గాడిద ఓండ్రపెట్టినపుడు తెరిచిన నోరులాంటి నోరు, బోర్లించిన గోదావరి పాత్రలాంటి తలకాయ... సింపుల్‌గా ఇవీ మీ ముఖవర్ఛస్సుకు సంబంధించి నాకు తెలిసినవీ, నిత్యం చూస్తున్నవీ. కానీ ఇందులో ఆవిడ చెప్పినట్లు బెండకాయ పోలిక మాత్రం నాకేం కన్పించటం లేదు" అంది ముఖాన్ని చూస్తూ ప్రశాంతంగా.

శ్రీశైలంకు ఆమె వర్ణన అర్థం అయిన తర్వాత కోపమొచ్చింది. తన మీద జాలికలిగింది. పిచ్చి పిచ్చిగా శరీరం కదిలించాలనిపించింది. కానీ ఏమీ చేయలేకపోయాడు.

"పోనీద్దూ! ఆ గొడవ వదిలెయ్! కాళ్లు పీకుతున్నాయి కూర్చుందామా?" అనడిగాడు! నిగ్రహించుకునీ, ముఖంమీద నవ్వు పులుముకుని.

"ఇక్కడా? అమ్మో! వద్దు! ఆమధ్య మద్రాసులో ఇలాగే ఓ అబ్బాయి అమ్మాయిని రేప్ చేసి రైలు కిందవడేసి శవాన్ని మూటకట్టి సముద్రంలో పడేసిన వార్త గుర్తొస్తోంది బాబూ! అయినా మీరెప్పుడూ నన్నిలాంటి స్థలాలకే తీసుకు వచ్చి నా మూడ్ పాడుచేస్తుంటారు" అంది.

శ్రీశైలంకు కళ్లు బైర్లుకమ్మాయి.

★ ★ ★

పార్వతమ్మ, శివయ్య, గణపతి భోజనానికి కూర్చున్నారు.

"ఆవకాయ వెయ్యనా బాబూ!" అంది పార్వతమ్మ.

"వద్దమ్మా! నాకు వేడి చేసింది. ఆయకాయ తింటే ఇంకా వేడి చేస్తుంది" అన్నాడు.

"ఏమిట్రా ఆ కూతలు! మొదటి రెండు పదాలు గట్టిగా మాట్లాడుతావు. చివరి పదాలు గుసగుసగా మాట్లాడుతున్నావు ఈమధ్య! గొంతుకేదన్నా రోగం వచ్చిందా? పోనీ ఆస్పత్రికి వెళ్లి చూపించుకో!" కసిరాడు తండ్రి.

"లేదు నాన్నగారూ! నాగార్జున స్టయిల్‌లో మాట్లాడటం ప్రాక్టీసు చేస్తున్నా! ఈ నెలాఖరులోగా నేర్చేసుకుంటే వచ్చే నెల బాలకృష్ణ వాయిస్ ప్రాక్టీసు చెయ్యాలి" అన్నాడు అదే స్టయిల్‌లో వినయంగా.

వళ్లుమండిందాయనకు. "నీ శ్రాద్ధం స్టయిల్, నీ పిండాకూడు స్టయిల్, నీ తద్దినం స్టయిల్. కులవృత్తి అయిన హరికథలు నేర్చుకోరా అంటే చెవి కెక్కదు నీకు! ఏదో కాలానుగుణంగా చదివి ఉద్యోగాలు చేసినా మా తాతముత్తాలు హరికథలు కూడా చెప్పి జనంలో భక్తి ప్రబోధం చేసి తరించేవారు! ఇపుడు నేనూ అదే చేస్తున్నాను. నీవూ అదే నేర్చుకోరా అంటే వెధవ సినిమాల పిచ్చేమిటి నీకు?"

"నాకిష్టం లేదు నాన్నగారూ! కోకిలను కాకిలాగా అరవమంటే అరుస్తుందా? ఏనుగును నెమలిలా డ్యాన్స్ చేయమంటే చేస్తుందా? హంస బురదలో ఈదగలదా? చెప్పండి. పవిత్రమైన సినిమాల్లో చేరి, పేరు తెచ్చుకుని, ఫలానా సినిమా యాక్టరు తండ్రి ఆయనే అని అందరూ అనుకునేలా మీకు పేరు తెచ్చేలా..."

"ఛ! నోర్ముయ్! మాటలు సక్రమంగా ఉపయోగించి మాట్లాడ్డం రాదు వెధవా? కాకి, ఏనుగు, బురద అంటూ పోలుస్తావా? నాగార్జున స్టయిలట ప్రాక్టీసట! వెధవన్నరవెధవ! అంబోతులాగా తిని బలిసాడు వెధవ! అసలు నిన్నని ఏం లాభం! దీన్ననాలి" అంటూ భార్యవైపు తిరిగాడు.

"గర్భవతిగా ఉన్నపుడు హరికథలు పురాణాలు వింటే మంచిది, బుద్ధిమంతులైన పిల్లలు పుడతారు. అమ్మవారిగుళ్లో హరికథ చెబుతున్నాను రావే, అంటే వస్తాను పద అంటూ సినిమాలకెళ్లావు! వాడిని కడుపులో ఉండగానే భ్రష్టుపట్టించావు! కాన్పు అయిన వారానికే మళ్ళీ సినిమాలు మొదలెట్టావు. ఏ కాస్త ఖాళీ దొరికినా రేడియోలో, టేప్ రికార్డర్‌లో హోరెత్తించే పాటలు! నడక నేర్చినేర్వగానే స్టెప్పులు, బ్రేకులు, డిస్కోలు, వచ్చేసాయి!

ఇపుడు సినిమాల పిచ్చి! నాకు మీరిద్దరూ బద్ధ శత్రువులయ్యారు ఛీ! ఛీ!'' అంటూ అన్నంలో నీళ్ళు పోసి వెళ్ళిపోయాడు...

గట్టిగా అరుపులు వినపడుతుంటే శ్రీశైలం వచ్చి ''ఏమిటి బ్రదర్'' అంటూ పలకరించాడు గణపతిని!

''చూడు బాబూ! శ్రీశైలం, నీవైనా చెప్పు! వాళ్ళ నాన్నగారిని తృప్తిపరచటానికి ఆ హారిక



థలు నేర్చుకుంటే పోలా, మధ్యన ఈ తండ్రీ కొడుకులతో నా ప్రాణం పోతోంది ఎవరూ నా మాట అర్థంచేసుకోరు వినరు'' అంది పార్వతమ్మ!

''ఏంటమ్మా! ఇంతవయసు వచ్చిన నీవే నాన్నగారి హరికథ ఓ గంట కూర్చుని వినవు! ఏకంగా నన్ను నేర్చుకోమంటున్నావు. నావల్లన వుతుందటే'' అన్నాడు గణపతి దీనంగా!

''పోనీ మీ నాన్నగారితో ఈ తిట్లు తినేకంటే ఆ హరికథలు కాస్తన్నా నేర్చుకోరాదుటయ్యా'' అన్నాడు శ్రీశైలం.

''అదేంటి సార్! మీరు కూడానూ! ఇలా రండి ఇలా కూర్చోండి!'' శ్రీశైలం వచ్చి కూర్చు న్నాడు గణపతి ప్రక్కన!



"ఎంత కులవృత్తి అయితే మాత్రం అది నేర్చుకుంటే కడుపు నింపుతుందా? చెప్పండీ! ఈయన ఉద్యోగం అయిదేళ్ళు ముందుగా రిటైర్‌మెంటుకు పెట్టుకున్నాడు. ఆ అప్లికేష ను గవర్నమెంటుకు అందిన వారంలోనే హరి కథ చెబుతానంటూ ఆఫీసరుగారి కాలనీలోనే అది ఏర్పాటు చేయించుకుని వెయ్యిన్నూటపవ దార్లు వసూలు చేసుకుని ఓ రాత్రి 'రుక్మిణీ కళ్యాణం' హరికథ చెప్పారు.

ఆ ఆఫీసరుగారి కూతురు ఆ హరికథ విని ఆ మరునటిరోజు తను ప్రేమించిన అబ్బా యితో రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో పారిపోయిన రీతిలో లేచిపోయి పెళ్ళి చేసేసుకుందిట.

పైగా ఆ అమ్మాయి వెళుతూ వెళుతూ ఓ ఉత్తరం తండ్రికి రాసిందిట. అందులో 'రాత్రి విన్న రుక్మిణీకళ్యాణం' హరికథ తనకు ఈ విధంగా వెళ్లటానికి ధైర్యాన్ని అయిడియా'ను ఇచ్చిందని రాసి వెళ్ళిందిట!

అంతే ఆఫీసరుగారు ఉగ్రుడయ్యారు. ఈయనమీద కక్షసాధింపు చర్యగా ఆయన రిటైర్‌అయి నాకు ఆ ఉద్యోగం ఇచ్చే ప్రతిపాద నమీద పెట్టుకున్న అర్జీ తిప్పికొట్టాడు.

"నాకు ఉద్యోగం లేకుండాపోయింది ఆ విధంగా! ఇదంతా అలా ఉంచండి ఆఫీసులో ఆఫీసరుగారు, మానాన్నగారు ఒకరిమీద ఒక రు నిప్పు, పెట్రోలులాగా బ్రతుకుతున్నారు నిత్యం తిట్టుకుంటూ! చూశారా హరికథ, కుల వృత్తి అంటూ తనే బాధపడుతూ కూడా నన్ను ఆ ఊబిలోకి దించాలని చూస్తున్నారు! ఇపుడు చెప్పండి! ఇంకా హరికథలు నేర్చుకో మంటారా?"

శ్రీశైలం అవునూ కాదూల మధ్య తల ఊపాడు!

"ఎంత చెడ్డా తండ్రి కదా! ఆయన చెప్పిన మాట కాస్తో కూస్తో వినకపోతే బాధపడరట య్యా శ్రీశైలం!" అంది పార్వతమ్మ!

"నేనో అయిడియా చెబుతాను వింటారా?" అన్నాడు శ్రీశైలం.

"చెబుతారనేగా ఇంత సోది"

"హరికథలు ఇంట్లో నాన్నగారితో ఓ గంట సేపు నేర్చుకోండి! ఆయన పగలంతా ఎలానూ ఉండరు ఇంట్లో. మీ సినిమా ప్రాక్టీసుకు అడ్డం ఏముంటుంది చెప్పండి!"

"ఈ అయిడియా బాగానే ఉన్నట్టుంది ఆలోచించి చెబుతాను"

"అదేంటండీ మాటల్లో స్టయిల్ మార్చా రు?"

"ఇది యన్.టి.ఆర్. స్టయిల్ లెండి! అది ఈ క్షణంనించే ప్రాక్టీసు చేస్తున్నాను"



రాఘవ మళ్ళీ తన పనులు చేసుకుంటు న్నాడు దుర్గ సాయం లేకుండా!

ఓరోజు రాఘవ ఇంట్లోలేని సమయంలో పార్వతమ్మ, సూరమ్మ, మర్ధిని, ఆయా దుర్గను చుట్టుముట్టారు. "అవునూ! ఇన్నిరోజులతనికి సేవలు చేశావు కదా! అతన్ని ముట్టుకోకుండా చెయ్యటానికి వీల్లేదాయె! నీవు ముట్టుకున్నపు డు ఆయన ఏమీ 'ఎమోషన్' ఫీలవలేదా?" మర్ధిని అనుమానపు ప్రశ్న!

"ఛీ! ఛీ! నీకెప్పుడూ ఇలాంటి అనుమా నాలే! అసహ్యంగా!" అంటూ కసిరింది దుర్గ!

"అవునమ్మాయ్ మీ ఆడపడుచేంటి అలా రెచ్చిపోతోంది పిల్లనిచ్చి చేస్తాననంటూ" అంది సూరమ్మగారు!

"అనటంలో తప్పేంఉంది!" అంది దుర్గ మామూలుగా నవ్వుతూ!

"నీ భర్తకు పెళ్ళయితే నీకేం పట్టనట్టు ప్రవర్తిస్తున్నావే!" అంది పార్వతమ్మ!

"అయితే ఇన్నాళ్ళూ అతనికి సేవలు చే శావు, ఏ ఉద్దేశ్యంతోనంటావ్!" అంది మర్ధిని!

"మీకందరికి పిచ్చిపట్టింది! ఆయనకు నా ఉద్యోగం అంటూ ఇష్టంలేదు! నేను ఉద్యోగం

వదలను. ఉద్యోగం వదిలేదాకా మేం కలిసి కాపురం చేయటంకల్ల! అది ఈ జన్మలో జరుగదు. మాదారులు కలవవు! ఎప్పటికైనా విడిపోవలసిన వాళ్ళమే! ఇక సేవలంటారా? ఆ మాత్రం సేవ మీలో ఎవరికైనా ఆపదవస్తే కూడా చేస్తాను. ప్రత్యేకమైన దృష్టితోనో, అభిమానంతోనో మాత్రం ఆయనకు సేవచేశానని మీరనుకుంటే పొరపాటు. లేనిపోని ఆశలు నాకు లేవు. నా డ్యూటీ ఎలా యాంత్రికంగా చేస్తానో ఇదీ అంతే! మా ఆడపడుచు అంటారా? వాళ్ళ బాధ వాళ్ళది! ఆయన పెళ్ళి చేసుకున్నా నాకు బాధ లేదు అసూయలేదు. ఇక నన్ను వెళ్ళనిస్తారా?'' అంటూ డ్యూటీకి వెళ్ళటానికి బయటకు వచ్చింది దుర్గ!

తలుపుబయట ఎప్పటినించో దుర్గ మాటలు వింటూ నిల్చున్న రాఘవ ఆమె రావటం చూసి పక్కకు తప్పుకున్నాడు. ఆ సంగతి దుర్గకు తెలియదు!

★ ★ ★

ఆ రోజు దుర్గ మాటలు విన్నప్పటినించి రాఘవ బాధపడసాగాడు! ఇక ఎప్పటికీ దుర్గ మారదా? ఆ ఉద్యోగం మానదా? అంటే ఈ ఆరు నెలలయిపోగానే ఎవరిదారి వాళ్ళదేనా?

రాఘవకు ఈ పదిహేనురోజులుగా దుర్గ అతిసామీప్యంగా తనకు సేవలు చేయటంవల్లనేమో ఆమె తనదగ్గరగా ఉండాలని తనని స్పర్శించాలని, ఇలాంటి జబ్బు ఇంకోటివస్తే బావుండుననిపించసాగింది! ఆమెతో గడిపిన పెళ్ళయిన తొలి పదిహేనురోజులూ నెమరువేసుకోసాగాడు! తన బాధ ఎవరితోనూ చెప్పుకోలేడు. దుర్గను తనవేపు తిప్పుకుని మార్చుకోవాలని చాలా ప్రయత్నాలు చేశాడు.

ఆరోజు ఆదివారం! సినిమా ప్రోగ్రాం ఉంది. సాయంత్రం ఇంటికి వచ్చేటపుడు ఓ ఫ్రెండును తీసుకొచ్చాడు. వస్తూ, వస్తూ దార్లో మల్లెలు కొన్నాడు. కోర్టు నిబంధనల ప్రకారం క్రొత్త వ్యక్తుల ముందు అన్యోన్యత నటించవలసి ఉంది.

''ఏమిటి దుర్గా! ఇంకా తెమలలేదా? వద! వద! టైమవుతోంది! ఏమోయ్! నీవూ వస్తావా పిక్చరుకు'' అంటూ బయటకు వచ్చిన దుర్గ తలలో మల్లెపూలు తురిమాడు!

దుర్గ ''ఓవర్ యాక్షన్ చెయ్యకు'' అన్నట్టు సీరియస్‌గా చూసింది రాఘవవేపు!

రాఘవ కాస్త తగ్గాడు. వచ్చిన ఫ్రెండు మెడికల్ షాపుకెళ్ళాలంటూ వెళ్ళిపోయాడు.

ఇద్దరూ స్కూటరుమీద బయల్దేరారు. సినిమాలో ఎన్నడూ లేనిది దుర్గ భుజంమీద వాలి నిద్రపోయాడు. నిజానికి అలా నటించాడు.

దుర్గకు చాలా ఇబ్బంది అనిపించింది! ఇంటర్‌వెల్‌లో తట్టి లేపింది.

''సారీ!' చెప్పి సరిగా కూర్చున్నాడు!

ఆ తర్వాత సినిమా చూస్తూ దుర్గ చేతిని మెల్లిగా చేతిలోకి తీసుకున్నాడు. ఓసారి మెల్లగా విడిపించుకుంది! మళ్ళీ అదేపని చేసేసరికి ఏంచేయాలో తోచక అలాగే ఉండిపోయింది!

చుట్టూ జనం సినిమాలో లీనంఅయిపోయున్నారు. రాఘవతో చాలా ఇబ్బంది నెదుర్కోసాగింది దుర్గ! సినిమా వదలగానే గండం గట్టెక్కినట్టు ఫీలయింది!

మరునటిరోజు ''అమ్మా కోర్టు గుమాస్తా వొచ్చాను! సార్! కోర్టు గుమాస్తా నొచ్చాను'' అంటూ కేకలు విని రాఘవ దుర్గ ఇద్దరూ బయటకు వచ్చారు!

''నీతో వేగలేక చస్తున్నానయ్యా! నిన్నంతా నవ్యంగానే గడిచింది ఆ పుస్తకం ఇలా ఇవ్వు సంతకం పెడతాను. నాలుగుళ్ళకి వినపడే నీ నోరూ నువ్వూను చస్తున్నాను'' అంటూ విసుక్కున్నాడు రాఘవ!

''ఉండండి! గుమాస్తాగారూ! నిన్న నవ్యంగా గడవలేదు నాకు!

నామీద అత్యాచారం జరగబోయింది కాస్తలో ప్రమాదం తప్పింది!'' అంది దుర్గ.

రాఘవ కంగారు పడ్డాడు!

''ఆ! ఎలా? ఎక్కడ? ఎవరు?'' అంటూ ఆయాతోపాటు ఆ కాంపౌండ్‌లో ఉన్న నలుగురు ఆడవాళ్ళూ చేరారు.

''సినిమాహాల్లో! ఈయన వల్లనే! సినిమా నకాలంలో వదలటంవల్ల గండం గట్టెక్కింది!'' మూడుముక్కల్లో చెప్పి వెళ్ళిపోయింది దుర్గ!

''ఆ!'' అంటూ అందరూ నోరు వెళ్ళబెట్టారు!

కోర్టు గుమాస్తా రాఘవవైపు ఓసారి తేరిపార

చూశాడు ఖూనీ చేసినవాడిని చూసినట్టు!

బరబరా ఏదో రాసుకుని వెళ్ళిపోయాడు!

మొహంలో నెత్తురుచుక్కలేకుండా పాలిపోయింది రాఘవకు.

ఇంట్లోకి కాళ్ళీడ్చుకుంటూ రాగానే ఆయా వంచిన తల ఎత్తకుండా నోట్సు రాసేస్తోంది! పీక పిసికి చంపేద్దామనిపించింది రాఘవకు! దుర్గ మాత్రం మామూలుగా పనులు చేసుకుంటోంది!

"అయినా ఇదేం పాడుబుద్ధి అబ్బాయ్ నీకు! మొన్నంతా ఆ పిల్ల నీకు బండెడు చాకిరి చేసి గట్టెక్కించిందన్న కృతజ్ఞత కూడా లేకుండా ప్రవర్తించావు!" అంది సూరమ్మగారు! ఆవిడకు రాఘవమీద ఎప్పుడు సందుదొరుకుతుందా? ఎపుడు సాధించుదామా అని కాచుకుని ఉంటుంది!

"అయినా కాలాలు బాగాలేవమ్మాయ్! ఈ మగజాతిని నమ్మటానికి లేదు. మన జాగ్రత్తలో మనముండాలి! ఏమేం చేశాడేంటి సినిమా హాల్లో!" అంది అందరికీ వినపడేంతగానూ గునగున నటిస్తూ!

రాఘవకు వళ్ళు మండింది!

"ఏమిటండీ ఈ న్యూసెన్సు! నేను నోట్సు తయారుచేసుకోవాలి. మీరు వెళితే కాస్త ప్రశాంతంగా ఉంటుంది" అన్నాడు కోపంగా!

"జాగ్రత్తమ్మాయ్!" అంటూ దుర్గ భుజం తట్టి రాఘవను దొంగను చూస్తున్నట్టు భయం చూపులు చూస్తు వెళ్ళిపోయింది!

దుర్గకు నవ్వొచ్చుకొస్తోంది! అయినా తమాయించుకుంది! రాఘవకు మాత్రం దుర్గ మీద చాలాకోపం వచ్చింది! ఆమెమీద ప్రతీకారం ఆరాత్రే తీర్చుకున్నాడు. ఆ రోజు తన ఫ్రెండ్సును నలుగురిని బలవంతపెట్టి బతిమాలి బామాలి ఓ ముసలి జంటను దూరపు బంధువులంటూ ఇంటికి వచ్చేలా నాటకమాడించాడు. ఒక్కరోజు తన ఇంట్లోబసచేసినందుకు రెండువందలిస్తానని వప్పించాడు.

"ఇదేంటబ్బాయ్! ఇంత ముసలి బామ్మ తాతయ్యా నీకున్నారని ఎప్పుడూ చెప్పనేలేదు!" అంటూ దీర్ఘం తీసి అడిగింది సూరమ్మగారు.

"మరే! మీరెప్పుడూ నన్ను అడగలేదుగా మా బంధువుల గురించి ఆరాలు" అన్నాడు రాఘవ కోపంగా!

తన వయసులోనే ఉన్న సూరమ్మగారు తనేదో మహా టీనేజ్‌దాన్లా ఫీలయిపోతూ, తనని బామ్మగారని సంబోధించటంతో ఆ నటించటానికి వచ్చిన జగదాంబగారికి వళ్ళు మండిపోయింది! సూరమ్మగారి వాలకం, పార్వతమ్మ ఆమె భర్త కొడుకు, మర్దిని మొత్తం కాంపౌండులో ఉన్నవారి చరిత్రంతా ఒక గంటలో ఆపోశన పట్టేసింది జగదాంబ! ఆమె వయస్సు అరవై దాటాయి కానీ నాటకాలు వేసినపుడంతా ముఖాలకు రంగు పూసుకోవటంవల్ల దాదాపు తొంభై ఏళ్ళ వయసు అని చెప్పినా నమ్మేలా కనిపిస్తుంది! నాటకాల మనుమలని ఏ మాత్రం నోరుజారకుండా చాలా గొప్పగా నటించేశారు! ఆ భార్యాభర్తలిద్దరూ!

"అదేంటబ్బాయ్! అమ్మాయికి సాయంత్రం ఇంటికి వచ్చేటపుడు కాసిని స్వీట్సూ, ఓ మూర మల్లెపూలూ తీసుకురావాలని తెలీదుటయ్యా! ఏం పిల్లలో ఈ కాలం పిల్లలు రానురాను అన్నింటినీ వ్యాపార దృష్టితో చూడటం, జమా ఖర్చులంటూ పొదుపులతోనే సంసారం సాగిస్తారు! ఓ అచ్చటా ముచ్చటాలేదు! అదే మా కాలంలో అయితే నా మీ తాతగారు రోజూ సాయంత్రాలు ఓ బుట్టెడు మల్లెలు తెచ్చేవారు" అంది ముసిముసిగా నవ్వుతూ!

అక్కడే ఆసనాలు వేస్తున్న సూరమ్మగారికి జగదాంబ అతిశయం చూసి వళ్ళు మండింది! "ఏం! మీవారు మల్లెపూల తోటమాలిగా పనిచేసేవారా?" అంది ఎకసక్కెంగా!

"తోటమాలి పని చేయటానికి ఆయనకేం ఖర్మ మాకు పది మల్లెల తోటలు, పది కొబ్బరి తోటలు, ఓ ఇరవై మామిడి తోటలు మొత్తం వంద ఎకరాలుంది! మల్లెపూలు భర్త భార్యకు ఎందుకు తెస్తాడు? అయినా నా పిచ్చిగానీ శోభనం రాత్రే సన్నానులుతో మీటింగుపెట్టుకున్న మీవారికి ఏం తెలుసు మల్లెపూల విలువ! పాపం మీకు మాత్రమేం తెలుసులెండి!" జాలిపడుతూనే దెబ్బతీసింది ఆవిడపైన!

సూరమ్మగారు ఒంటికాలిమీద లేచింది జగ

దాంబమీదికి "మా వారు శోభనం రాత్రి నన్నా సులతో మీటింగు పెట్టుకోవడం నీవు చూశావా? అధిక ప్రసంగం మాట్లాడితే నాకు సరిపోదు జాగ్రత్త!" అంటూ మీదిమీదికి వచ్చింది!

రాఘవ దుర్గ కలుగచేసుకుని పోట్లాటను ఆపారు!

ఆరాత్రి దుర్గ రాఘవ గదిలో పడుకోక తప్పలేదు! దుర్గను నానా అల్లరిచేసి వశపర చుకున్నాడు రాఘవ! ఏమాత్రం గట్టిగా మాట్లా డినా అవతలికి వినిపిస్తుందని ఎంత గింజుకు న్నా రాఘవ దుర్గను వదిలిపెట్టలేదు.

పైగా, ఆ మరునాటి ఉదయం, కోర్టు గుమా స్తా వచ్చేముందు "నిన్నంతా సవ్యంగా గడవ లేదని, చెప్పి సంతకం చెయ్యి" అన్నాడు దుర్గతో చిలిపిగా చూస్తూ!

దుర్గ చాలా సీరియస్‌గా ఉండిపోయింది! ఆమె సీరియస్‌నెస్‌ను పోగొట్టాలని స్నానంచే సేటప్పుడు, భోజనం చేసేటపుడు పరాచికాలా డాడు. ముసలి దంపతులను ఇంకో నాలుగు రోజులుండేలా చేశాడు. ఎలాగూ కిరాయి వస్తుందనే ఆశతో వాళ్ళూ ఒప్పుకున్నారు!

వాళ్ళున్నన్ని రోజులూ రాఘవ చాలా హాయిగా గడపవచ్చనుకున్నాడు. కానీ రెండు రోజులు మాత్రం అతని ఆటలు సాగినా మూడ వరోజు సరిగ్గా సాయంత్రానికి చాప, చెంబు కంచం తీసుకుని తలుపువార పడుకుంది హాల్లోనే! రాఘవ కది నాటకమని తెలిసినా కిమ్మనలేదు.

ఇక ఈ ముసలాళ్ళకు కిరాయి దండుగ అని తెల్లారే పంపించేశాడు! ఆ రోజునించి ఆయాను ఇక్కడే పడుకోమంది దుర్గ! కొత్తలో ఆయా ఇక్కడే పడుకునేది కానీ ఇంటిదగ్గర మనవడు తనులేనిది నిద్రపోడని చెప్పి ఇంటి కి వెళ్ళేది! దుర్గ రాఘవ నిర్వాకమంతా చె ప్పింది!

"పోనీలే అమ్మా! ఆడదానికి ఎంత చెడ్డా మగడితోనే జీవితం. అయ్యగారు మారి నిన్ను సల్లగా చూసుకుంటే చాలు" అంది! ఆయా!

"నన్ను చల్లగా చూసుకుంటారు నాకాన మ్మకం ఉంది! కానీ నా ఉద్యోగాన్ని చూస్తే మంటకదా ఆయనకి! అలాంటప్పుడు ఈ రాజీ బ్రతుకెందుకు? దీనివల్లే రేపు కడుపువస్తే నష్టపోయేదీ బాధపడేదీ నేనే కదా! ఎలాగో ఓ బిడ్డకు తల్లిని చేస్తే చచ్చినట్టు ఉద్యోగం మానేసి ఆయన పంచన పడుంటానని ఇలా చేస్తున్నారు. అంతే కానీ, నామీద ప్రేమతో కాదు! స్త్రీ సుఖమే కావాలనుకుంటే ఆయనకు నేనే కావాలని రూలులేదుగా! వాళ్ళఅక్కయ్య కూతురిని చేసుకుంటాను లగ్నాలు పెట్టించు ఆర్నెల్లతర్వాత అని చెప్పి పంపిన ఈ మనిషి మళ్ళీ నా దగ్గర ఇలా ప్రవర్తిస్తున్నారంటే నామీద కక్షసాదింపుచర్యగాక మరేమిటి?" దు ర్గ బాధపడుతూ వెక్కివెక్కి ఏడ్చింది!

మొట్టమొదటిసారిగా దుర్గ అలా ఏడవటం చూసిన ఆయా ఓక్షణం నివ్వెరపోయి ఆమెను అక్కున చేర్చుకుంది తల్లిలా!

బయటకెళ్ళి వచ్చిన రాఘవ శ్రీశైలం తలుపు బయటే ఉండి దుర్గ మాటలు విని నోట మాటరాక నిలబడిపోయారు!

కాసేపటికి శ్రీశైలం, రాఘవ భుజంతట్టి లోపలికి వెళ్ళు అని చెప్పి తన గదిలో కెళ్ళిపో యాడు.

రాఘవకు లోపలికి వెళ్ళాలనిపించలేదు! పూలచెట్ల మధ్యనున్న సిమెంటుబెంచీమీద పడుకున్నాడు చీకట్లో!

రాఘవ మనసు దుర్గ మాటలు విన్నత ర్వాత కకావికలమైంది! అందుకా దుర్గ తన నంతగా ప్రతిఘటించింది! తన ఉద్యోగం మీద ఇష్టంలేకపోవచ్చు కానీ తనమీద కూడా ఇష్టంలేదని ప్రతీకారం తీర్చుకునే వాడిలా ఊహించుకుంటోందా? ఆమె మనసు తెలుసు కోకుండా తనెంత కర్కుర్తిగా ప్రవర్తించాడు. రాఘవకు తనమీద తనకే అసహ్యం వేసింది!

ఇంకో అయిదు నెలల్లో దుర్గ తనని వదిలి వెళ్ళటానికే నిశ్చయించుకుందన్న సంగతి ఆమె మాటలవల్ల అర్థంచేసుకున్న రాఘవ మన సు నిర్లిప్తంగా మారిపోయింది!

★ ★ ★

"ఏంటండీ! అమ్మాయి నిన్నటినించి ఏదో బాధలో ఉన్నట్టుంది" అంటూ సూరమ్మగారు ఆయా నడిగింది.

ఆయా బదులేం చెప్పలేకపోయింది. కా రణం రాఘవ అక్కడే పుస్తకం చదువుతూ కూర్చున్నాడు.

"కొంపదీసి ఈ మహానుభావుడు ఏదైనా

అఘాయిత్యం చెయ్యలేదుకదా!'' అంది.

అక్కడ ఉన్న తను వినాలనే అదేపనిగా మాట్లాడుతున్న సూరమ్మగారి మీద కోపం ముంచుకొచ్చింది రాఘవకు.

''ఏంటండీ అఘాయిత్యం అంటున్నారు నేనేం ఖూనీ కోరుననుకున్నారా? ఊరుకొన్నకొద్దీ రెచ్చిపోతున్నారు. ఏదో పెద్దావిడ కదాని మర్యాద ఇస్తుంటే?'' ఇంతెత్తున లేచాడు.

''ఏం బాబూ! అంత రోషం వచ్చిందీ. వున్న మాటంటే వులుకుగానీ, అన్నమంతా పట్టి చూడాలా? అయినా నాకెందుకు ఈ గొడ వంతా. ఎప్పుడో పైకి పోవల్సిందాన్ని ఆ యమ ధర్మరాజు వెనక్కి పంపడంతో, ఇదిగో ఇలా మీచేతా మీచేతా మాటలుపడుతున్నాను'' అంటూ ఫ్లాష్‌బ్యాక్‌లోకెళ్లిపోయింది. అప్పటికే రాఘవ, ఆయా వెళ్లిపోయారు.

★ ★ ★

చిత్రగుప్తుడు ఫైళ్లముందు కూర్చుని గొణుక్కుంటున్నాడు.

''రాజాధిరాజా! రాజమార్తండ యమధర్మ రాజా! నమోనమః'' అంటుండగా యమధర్మ రాజు సింహాసనం మీద కూర్చుని ''ఏమిటి చిత్రగుప్తా, నీలో నీవే వదరుకొనిచుంటివి! ఏమిటి సంగతి?'' అనడిగాడు.

''ఏమీ లేదు ప్రభూ! ముసలితనము మీద పడింది. పని భారము ఎక్కువైనది. ఇద్దరు చేయవలసిన పనిని ఒక్కడినే చేయుచున్నాను. ఇంకొకరిని నియమింపరాయె'' అన్నాడు.

''ఊఁ ఊఁ! రోజూ ఉన్న గొణుగుడే కదా! బడ్జెట్ లోటుతో బాధపడుచున్నాము. ఇంకొకరిని నియమిస్తే జీతభత్యములు పంచటానికి వీలు కాదు. సరిసరి నేరస్థులను ప్రవేశపెట్టుము''

ఇంతలో యమభటులు ఒక స్త్రీని ప్రవేశ పెట్టినారు. ఆ స్త్రీ ఎవరో కాదు! సూరమ్మే.

''ఏమీ, ఈమె చేసిన నేరము. ఈమె జీవిత కాలమెంత?''

''ఈమె వయసు దాదాపు తొంభై సంవత్సరాలు!''

''చిత్రగుప్తా! నీకు మతిమరుపు ఎక్కువ అవుతున్నదా? ఇన్ని సంవత్సరాలు ఈమెనెట్లు బతికించితివి. బతికించితివిపో! భూలోకమున మనచే పాలింపబడు ధర్మానుపత్రులు, పోలీసు స్టేషన్లు మొదలైన బ్రాంచిలు తమ విధులు సక్రమంగా నిర్వహించుట లేదా ఏమి?'' హూంకరించాడు యమధర్మరాజు.

''లేదు ప్రభూ! ఈమె ఆరోగ్య సూత్రాలు పాటించి ఆసనాలువేసి ఆరోగ్యాన్ని పదిలంగా కాపాడుకొంది. ఇపుడు కూడా ఈమె మన లోకానికి వచ్చేది కాదు. ఏదో కుట్రతో ఈమె మీద విషప్రయోగం జరిగి చనిపోయింది'' అన్నాడు చిత్రగుప్తుడు.

''సరి! సరి ఈమె చేసిన పాపాల పట్టీ తెరు... టైం వేస్టు చెయ్యక!''

''ప్రభూ! ఈమె భర్తను సరిగా చూసుకోనందువల్ల ఈమె భర్త సన్యాసుల్లో కలిసిపోయాడు'' అదే ఈమె చేసిన నేరము.

''ఆ! స్త్రీ అయివుండి పాతివ్రత్యమును భంగపరచి భర్తనుహింసించిందన్నమాట! ఎంత అహంకారము?

''ప్రభూ! ఈమె ఎవరో కాదు క్రితం జన్మలో సావిత్రి! సత్యవంతుని భార్య! ఏమిటి ప్రభూ! గుర్తు రావటం లేదా? 'నీ పతి ప్రాణంబుదక్క నీ పతి ప్రాణంబుదక్క' అంటూ మీచే నుత్తికొట్టించి మిమ్ములను మోసగించి భర్తను రక్షించుకున్నదీమెయే''

''ఆఁ అబలా ఏమిది? ఆనాడు నీ భర్త ప్రాణం కొరకు సత్యలోకము వరకూ వచ్చితివే! అలాంటి నీవు భర్తను సన్యాసుల్లో కలవటం భావ్యమా?''

సూరమ్మగారికి వళ్లుమండింది. ''ఏంటయ్యా! నీ వాగుడు! మా దేశంలో కోర్టులో కూడా ఇంతసేపు నిలబెట్టరు. మర్యాద కూడా తెలీదు నీకు. ఏ జన్మలో నుత్తి ఆ జన్మలోనే సరా! నీలాగా ఒకే జన్మ కాదుగా మాకు! సమయాన్ని బట్టి రకరకాలుగా ప్రవర్తించాలిమరి''

''ఆపు! ఏమా అధిక ప్రసంగం! ఇంతకూ నీ భర్త సన్యాసుల్లో ఎందుకు కలిశాడు''

''ఆఁ ఏముంది! వరుసగా పది తెలుగు సినిమాలూ, నాలుగు టి.వి. సీరియల్స్ చూశాడు, అంతే! ఐపులేడు. నాకు తెలీక అడుగుతాను టి.వి. కేంద్రం కూడా మీ బ్రాంచినేకదా!''

''చిత్రగుప్తా! ఈమెను కొరడాలతో కొట్టించి, నూనెలో వేయించి, మంటల్లో వేయించు''

''క్షమించాలి ప్రభూ! కొరడాలు పీపుల్స్‌వార్ గ్రూపు వాళ్లు ఎత్తుకెళ్లారు. నూనె, గ్యాస్ ఎప్పు

డో నిండుకున్నాయి. స్టాకులేదు.

"ఆ(" అంటూ కోపంతో కుర్చీకి చేతులు గుద్ది! "సరే ఈమెను పెద్దాసుపత్రిలోనే ఇంకా కొన్నాళ్లు పడేయి! అదే ఈమెకు తగిన శిక్ష! వెళ్లండి. తీసుకు వెళ్లండి" అనేశాడు యమధర్మరాజు.

"నీ జిమ్మడ! నీ పిండాకూడు" అంటూ తిడుతున్న సూరమ్మగారిని కొడుకు కోడలు తట్టి తట్టి లేపారు ఆనందంగా.

★ ★ ★

"బావగారూ! రేపు నేను, శ్రీశైలంగారు పెళ్లి చేసుకుంటున్నాం రిజిష్ట్రాఫీసులో. మీరు తప్పక రావాలి" అంది చండి.

"అదేమిటి! రిజిష్ట్రాఫీసులో ఎందుకు? శాస్త్రోక్తంగా ఇక్కడే చేసుకోవచ్చుగా!" అన్నాడు రాఘవ.

"శాస్త్రోక్తపు పెళ్లిళ్లు మా ఇంట్లో అచ్చిరావటంలేదులెండి అందుకే రూటు మార్చేశాం" అంది నవ్వుతూ.

"మరి వెడ్డింగ్ కార్డ్సు విందు భోజనం వగైరా వగైరాలు కూడా లేవా కొంపదీసి"

"మరే! శ్రీశైలంగారి పొదుపు సంగతి మీకు తెలుసుగా! అవేవీ వద్దన్నారు!"

రాఘవ నవ్వి "నర్లే! విందు మేం ఏర్పాటు చేస్తాం. తింటానికైనా వస్తాడేమో అడుగు" అన్నాడు.

"నాకేం అభ్యంతరం లేదు. రాకపోతే మీరు బాధపడతారుకదా! అలాగే తప్పకుండా వస్తాం" అంటూ ప్రవేశించాడు శ్రీశైలం.

మరునటి రోజు ఉదయం రిజిష్ట్రాఫీసులో చండి, శ్రీశైలం పెళ్లయింది. సాక్షి సంతకాలు దుర్గ, రాఘవ, మర్దిని, మహిషాసుర్ పెట్టారు. రాఘవ ఇంట్లోనే కాంపౌండ్‌లోని వారందరికీ పార్వతమ్మ గారితో వంట చేయించాడు. అందరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశారు.

"మా వాడి పెళ్లి ఎప్పుడవుతుందో ఏమో" అంది పార్వతమ్మ కాస్త దిగులుగా.

"అమ్మా! అమ్మా! నా పెళ్లి గురించి తొందరే మొచ్చిందే!" అంటూ నాగేశ్వరరావు స్టయిల్‌లో మాట్లాడాడు, వాడు.

"ఛ! ఏమిట్రా ఆగి ఆగి ఆ మాటలు? సరిగ్గా మాట్లాడిచావు" కసిరాడు తండ్రి.

"నాన్నా! నాన్నా! ఇది మా గురువుగారైన నాగేశ్వరరావు స్టయిల్ నాన్నా! నన్నాపకండి"

"నోర్ముయ్! చీపురు మొహం వెధవా? గొంతు సరిగాలేదు వెధవకి. తెల్లారేలేచి మా అమ్మలా ఎక్సర్‌సైజులు చెయ్యరా! కంఠస్వరం బాగలేకుంటే హరికథలెలా చెబుతావురా చేటమొహం శుంఠా!" అంటూ తిట్లు అందుకున్నాడు.

"తండ్రీ! నన్నిలా స్వేచ్ఛగా బతకనివ్వవు కదా! అకటా!" అంటూ ఎన్.టి.ఆర్.స్టయిల్ కొచ్చేశాడు.

"వీడిరోగం కుదరాలంటే ముందు వీడికి పెళ్లి చెయ్యాలి! అమ్మా! నీవేం చేస్తావో నాకు తెలీదు. నెల రోజుల్లోగా పిల్లను వెతికి పెళ్లి చేసే బాధ్యత నీదే! వీడి పెళ్లాంతో వీడిని చీపురు దెబ్బలు కొట్టించే దాకా వీడు మారడు" అంటూ లేచిపోయాడు.

అందరూ గొల్లున నవ్వేశారు.

★ ★ ★

మరో పది రోజులు గడిచాయి! దుర్గ తల్లి శాంతమ్మ చండిని సాంప్రదాయకంగా చీరె సారెతో శ్రీశైలంకు అప్పచెప్పింది. "అక్కచెల్లెళ్లు పక్కపక్కనే ఉన్నారు హాయిగా" అంటూ మెచ్చుకుంది, సూరమ్మగారు.

"ఇంకో నాలుగు నెలలేలెండి ఈ ముచ్చట. కోర్టు గడువు తీరిపోగానే ఎవరిదారి వాళ్లది. మీ ఇల్లు ఖాళీ అవుతుంది" అంది ఆయా!

దుర్గ తల్లి మొహం బాధగా మారిపోయింది ఆయా మాటలతో.

"నా కూతురి అదృష్టం బాగాలేదు" అంటూ కళ్లు తుడుచుకుంది.

అక్కడే ఉన్న రాఘవకు కోపం వచ్చింది. కూతురు తప్పు చేస్తే మందలించి భర్తనునరించి మసలుకొమ్మని చెప్పకపోగా తనేదో నేరం చేసినట్లు చూసే ఆవిడంటే రాఘవకెప్పుడూ కోపమే.

"చిన్న కూతురి అదృష్టమైనా బాగుండేలా దేవుణ్ణి ప్రార్థించండి!" అంటూ లేచి వెళ్లిపోయాడు అక్కడినించి.

"చూశావా! చూశావా ఎలా మాట్లాడతారో ఈయన! ఆ మాటకొస్తే ఇతనితో కాపురం

చేయలేదన్నదొక్కటే లోపం తప్ప నా కూతురి కేం! రాజాబతుకు. మగాడిలా బతుకుతోంది. ఇతనికంటే ఎక్కువే సంపాదిస్తోంది. అయినా దాని సంపాదన తినటానికి నోచుకోవద్దూ'' అంది ఆవిడ, అర్థం పర్థం లేకుండా ఆవే శంగా.

''ఏంటమ్మా! ఆ వాగుడు! మనకవస రంలేని మనుషుల గురించి ఎక్కువ ఆలో చించటంకానీ, మాట్లాడటం కానీ చేయవద్దని చెప్పానా? ఛీ! ఛీ! అందరూ తలనెప్పిగా తయారవుతున్నారు రోజురోజుకీ'' అంటూ వెళ్ళి పోయింది దుర్గ!

ముక్కు చీదుతూ ''అంతా నన్నే తప్పువడ తారు'' అంటూ చండిక ఇంట్లోకెళ్ళిపోయింది.

''ఏంటి గణపతీ, ఏంటలా డల్‌గా ఉన్నా రు? ప్రొద్దున్నే మీ నాన్నగారి సుప్రభాతంగాని విన్నారా ఏమిటి?'' అంటూ పలకరించాడు శ్రీశైలం.

''అవునుమరి! మేమెప్పుడూ డల్‌గానే ఉంటాం. ఏనుగు మొహాలేసుకుని. మీరు మాత్రం ఎప్పుడూ ఫెయిర్ అండ్ లవ్‌లీ అమ్మాయిలా ఫ్రెష్‌గా ఉంటారు'' అన్నాడు చేతులూపుతూ.

''ఏంటయ్యా బ్రహ్మానందం వాయిస్ ప్రాక్టీ సు చేస్తున్నావా ఏమిటి?''

''అబ్బే లేదండీ! శ్రీశైలంగారి వాయిస్ ప్రాక్టీసు చెయ్యాలనుకుంటున్నాను''

''ఏంటి బ్రదర్! చిర్రుబుర్రు లాడుతు న్నావు! స్నేహితుణ్ణి నాకు చెప్పకూడదా నీ బాధేమిటో''

''ఆహాఁ ఎంత స్నేహం, ఎంత స్నేహం. స్నేహమేరా జీవితం స్నేహమేరా శాశ్వతం. స్నేహబంధము ఎంత మధురమూ!'' అంటూ డ్యాన్స్ చేశాడు గణపతి, శ్రీశైలం చేతులు పట్టుకని.

''అయితే ఈ చిర్రుబుర్రు కోపమంతా నా మీదేనన్న మాట! నేనేదన్నా బాధపెట్టే పని చేశానా? డొంక తిరుగుడువద్దు డైరెక్టుగా పాయింటుకొచ్చేసెయ్'' అన్నాడు శ్రీశైలం అనునయంగా చేతులు పట్టుకుని.

''ఈ కాంపౌండ్‌లోని భార్యాబాధితుడు మహిషాసుర్ అలా ఏ సుఖం లేకుండా విషాద గీతాలకు బలైపోతున్నాడా?'' గణపతి అంటుండగానే మహిషాసుర్ ''ఏమిటి నన్ను గూర్చి మాట్లాడుకుంటున్నారు?'' అంటూ చే రాడు.

''నువ్వుండు కాసేపు... చెప్పు!'' అన్నాడు శ్రీశైలం గణపతివైపు తిరిగి.

''ఆ రాఘవగారిలా కోర్టు బాధలు పడుతూ పెళ్ళాముండీ కష్టాల పాలయ్యాడా? ఇక నేను పెళ్ళి పెటాకులు లేకుండా వడ్డించిన విస్తరి ముందు కూర్చుని కూడా తినకుండా ఊరికే లొట్టలేసుకుంటూ మా నాన్న తిట్లకు అంకిత మైనానా?''

''వడ్డించిన విస్తరి ఎవరు? మీరు ఎందుకు లొట్టలేస్తున్నారు?'' మహిషాసుర్ అందుకున్నా డు.

''అది తర్వాత చెబుతాను'' అంటూ శ్రీశైలం వైపు తిరిగి ''ఇంతమంది బాధపడు తుంటే మీరు మాత్రం పెళ్ళి చేసుకుని కుల కడం బాగుందా? మీరింత స్వార్థపరులనుకోలే దు. ఊరికే భుజాలు చుట్టూ పెనవేసుకుని స్నేహం మీద పాటలు పాడుకోవటం కాదు. స్నేహితుల కష్టసుఖాలు కూడా విచారించి తీర్చగలగాలి'' అన్నాడు.

''సారీ బ్రదర్! తప్పయిపోయింది. నీ ప్లా బ్లం సాల్వ్ చేస్తాను''

''చూడండి మహిషాసుర్‌గారూ మీకు పగటి పూట వంట బాధ రాత్రిపూట విషాదగీతాల బాధ తప్పేలా ఓ ఉపాయం చెబుతాను. నేను చెప్పినట్లు చేస్తారా?'' అన్నాడు శ్రీశైలం.

ఈ బాధ తప్పిస్తానంటే వద్దంటానుటండీ! అయినా మీరేం ఉపాయం చెబుతారు? చందా లేసుకుని డబ్బు కూడబెట్టి మా నాన్నగారికి స్తారా?''

''నర్లెండి! ఇలాంటి విషయాలకు చందాల డిగితే ఈ కాంపౌండ్‌లోని వారే ఇవ్వరు. బయ టివాళ్ళు కొట్టినా కొడతారు. ఈ రోజే మీ నాన్నగా రికి అర్జంటుగా రమ్మని టెలిగ్రాం ఇవ్వండి''

''ఎందుకూ?''

''ఇవ్వండి చెబుతాను. ఈలోగా మీతో రిహా ర్సల్ చేయిస్తాను సరేనా?''

''అలాగే!'' అంటూ వెళ్ళిపోయాడు మహిషా సుర్.

''ఏంటండీ! మహిషాసుర్ వాళ్ళ నాన్న అసా

ధ్యుడు. కొడుకు పనిమనిషికన్నా హీనంగా చాకిరీ చేస్తున్నా డబ్బు ముఖ్యమని తలిచే జాలిలేని మనిషి! ఆయన దగ్గర మీ రిహార్సల్స్ పని చేస్తాయంటారా!'' అన్నాడు గణపతి సందేహంగా.

''నీకా సందేహం అక్కర్లేదు. నీవు కూడా రెడీగా ఉండు, రిహార్సల్‌కు రాత్రి ఏడు గంటలకు. నాకిపుడు ఆఫీను టైం అయింది. వెళ్తాను'' అంటూ ఇంట్లోకెళ్లాడు శ్రీశైలం.

''అబ్బ! త్వరగా రండి స్నానం చేసి, గుత్తి వంకాయకూర చేశాను'' అంది చండి ఆత్రంగా.

''అబ్బ! వస్తున్నానుండు కాంపౌండ్‌లోని వారి కష్టాలు తీర్చి రావటమంటే మాటలా?'' అంటూ వళ్లు తుడుచుకుంటూ వచ్చి కంచం ముందు కూర్చున్నాడు శ్రీశైలం హీరో పోజుపెడుతూ.

''ఎందుకొచ్చిన గొడవలు మీకు! ఏదైనా బెడిసికొడితే కొంప ఖాళీ చేయిస్తారు!'' అంటూ వడ్డించసాగింది చండి.

''నేనంత ఆషామాషీ మనిషిని కాదులేవోయ్! నీతో దాదాపు మూడేళ్లు వేగి పెళ్లి చేసుకున్న ఘనుణ్ణి'' అంటూ బుగ్గ మీద చిటికేశాడు.

''నువ్వు భోంచేయవా?'' అంటూనే గబగబ తినేసి చెయ్యి కడుక్కున్నాడు.

''నేను తర్వాత భోంచేస్తాగానీ, గుత్తి వంకాయ కూర ఎలా ఉంది. నా కిష్టమని చేశాను'' అంది చండి తల దువ్వుకుంటున్న శ్రీశైలాన్ని చూస్తూ. శ్రీశైలం మెదడు ఒక్క క్షణం ఫ్లాష్‌బ్యాక్‌ల చుట్టూ తిరిగి వచ్చింది.

వెంటనే ''రుచి బాగానే ఉంది... కానీ చూడ్డానికే ఆ ముక్కలు నీళ్ల తొట్టిలో పడి చచ్చిన ఎలుకల్లా ఉన్నాయి!'' అంటూ చెప్పులేసుకుని వెళ్లిపోయాడు గబగబా!

చండికి ఆ తరువాత మూడు రోజులు అన్నం నయించలేదు. నరికదా ఆ తర్వాత వంకాయలు ఆ ఇంట్లో బ్యాన్ అయ్యాయి.

★ ★ ★

ఊరినించి మహిషాసుర్ తండ్రి పోతురాజు వచ్చాడు.

ఎక్కడి వారక్కడ దిగాలుగా కూర్చున్నారు.

''ఏంట్రా! ఆ టెలిగ్రాం... అంతా బాగానే ఉన్నారే! అనవసరంగా టెలిగ్రాం ఇచ్చి డబ్బులు నీవు వేస్టు చేసుకోవటం కాక భయపడి నేనూ సూపర్ ఎక్స్‌ప్రెస్ కొచ్చాను బోలెడు ఛార్జీపోసి'' అంటూ తిట్లనందుకున్నాడు.

''నాన్నా! మన మహిషాసుర వంశాన్ని మంట గలిపింది నాన్నా! నీ కూతురు శాంతి'' అంటూ భోరునేడ్చాడు మహిషాసుర్.

''ఏమిట్రా! ఏం జరిగింది ఎవడినేనా ప్రేమించిందా!'' అన్నాడు సంతోషంగా.

''అవున్నాన్నా!''

''దానికంత ఏడుపెందుకు? పైసా కట్నం లేకుండా దాని మొగుణ్ణి అదే వెతుక్కుంది. చిట్టితల్లికన్నీ నా పోలికలే'' అన్నాడు సంబరంగా.

''అంతవరకు బాగానే ఉన్నాయి మీ పోలికలు. మీ కూతురికి కడుపొచ్చింది. పైగా ఇపుడు అయిదో నెల. అబార్షన్ చేయిస్తే పెద్ద ప్రాణానికే ప్రమాదం అన్నారు డాక్టర్లు. కడుపు చేసిన కుర్రాడేమో ఓ అయిదు లక్షలు కట్నమిస్తే కానీ పెళ్లి చేసుకోడుట. పోనీ, ఆ వెధవతో మనకొద్దు మన పాట్లు మనం పడదామన్నా కాలేజీ గోడల మీదికి వీరిద్దరి పేర్లూ ఎక్కాయి. కాస్తయినా కట్నం తగ్గించుకోమంటే ససేమిరా అంటున్నాడు. నీ కూతురేమో ఆత్మహత్యా ప్రయత్నం చెయ్యబోయింది. పోతేపోనీ, చస్తే చావనీ అనుకుందామంటే చావుకు మా నాన్నే కారణం. నా పెళ్లికి ఆయన వప్పుకోడు అంటూ ఉత్తరం రాసిపెట్టింది. దీన్ని బట్టి మన పరిస్థితి ఏమిటో ఆలోచించు'' అంటూ కన్నీళ్లు తుడుచుకున్నాడు మహిషాసుర్. గాలి తీసేసిన బెలూన్‌లా అయ్యాడు పోతురాజు.

''ఓసి! అప్రాచ్యపు ముండా? సిగ్గులేదుటే నీకు'' అంటూ చండాలపు తిట్లు తిట్టాడు కూతుర్ని.

శాంతి వెక్కి వెక్కి ఏడుస్తూండిపోయింది.

''ఇంతకూ ఆ వెధవ ఎవడు వాడి కాళ్లో, కడుపో పట్టుకుని కట్నం తగ్గించుకోమని అడుగుతాను. అంటుండగానే, ''నేనేనండి మీరిచ్చే వరధనముతో వెయ్యేళ్లు వర్థిల్లేవాడిని నేనే'' అంటూ రంగ ప్రవేశం చేశాడు గణపతి.

''ఎలుకంతలేదు వీడికి అయిదు లక్షల కట్నమా?'' అన్నాడు గట్టిగానే!

"చూడండీ! మాటలు జాగ్రత్తగా రానీయండి! అసలు మీ అమ్మాయిని పది లక్షలు కట్నమిచ్చినా నేను పెళ్ళిచేసుకోను" అన్నాడు కోపంగా వెనుతిరిగిపోతూ!

"ఏమండీ" అంటూ కాళ్ళు పట్టుకుంది శాంతి.

"ఛీ! వదులు తెలుగు సినిమా లెక్కువ చూశావా? ప్రతిసారీ కాళ్ళు పట్టుకుంటావ్ బుద్ధి లేదూ!"

"ఏంటయ్యా పిల్లకు కడుపు చేసింది చాలక పైగా కొండెక్కుతున్నావు" గర్జించాడు పోతురాజు.

"అంతటి ఘనకార్యం చేశాను కాబట్టే కొండలూ పర్వతాలు ఎక్కుతున్నాను. నోట్ దిస్ పాయింట్!" అన్నాడు కృష్ణ వాయిస్‌ననుకరిస్తూ!

"ఛీ! ఉండుండి ఉడతలు పట్టేవాడిని ప్రేమించావేమిటే!" అంటూ ఛీత్కరించాడు!

శృతిమించి పాకాన పడుతున్న తరుణాన శ్రీశైలం కల్పించుకున్నాడు.

"చూడండి బాబాయ్‌గారూ! మీకెంతో డబ్బుంది! అందులో అయిదు లక్షలు పోతే మళ్ళీ సంపాదించుకోవచ్చు! కానీ పరువుపోతే ప్రాణం పోయినట్టు లెక్కకదండీ! పరువుపోయాక అంత డబ్బుండి వేస్టు కదండి" అన్నాడు.

మొత్తానికి అతన్ని ఒప్పించటానికి కాంపౌండ్‌లో అందరికీ తలప్రాణం తోకకొచ్చింది!

చివరికి రెండు లక్షలకు బేరం కుదిరింది! ఆ మరునటిరోజే శాంతి, గణపతి పెళ్ళి శాస్త్రోక్తంగా గుళ్ళో జరిగింది!

సూరమ్మ, పార్వతమ్మ, శివయ్య శ్రీశైలం తెలివిని మెచ్చుకున్నారు. మర్ధిని తండ్రి రమణయ్యకు డబ్బు పంపించి ఇల్లు వచ్చేలా చేశారు!

మహిషాసుర్ విషాదగీతాల క్యాసెట్లు నీళ్ళు కాచే బాయిలర్‌లో వేసేశాడు!

మర్ధిని సంతోషానికి అవధుల్లేవు. చండి ఆ సాయంత్రం మల్లెపూలు తలనిండా పెట్టుకుని శ్రీశైలం ప్రక్కనచేరి "అబ్బ మీలో ఇంతతెలివి, సమయస్ఫూర్తి ఉన్నాయని నాకు తెలీదు సుమండీ! ఒక్క దెబ్బకు రెండు పిట్టలన్నట్లు రెండు కాపురాలు చక్కవరచారు సుమా!" అంది మెడచుట్టూ చేతులువేస్తూ!

"చండీ! ఓ చిన్న గుడ్డపీలిక కిరసనాయిల్‌లో ముంచి తీసుకురా!" అన్నాడు.

"ఎందుకండీ!" అంది చండి ఆశ్చర్యంగా!

"చెబుతా! ముందు తీసుకురా!"

చండి గుడ్డపీలికను తెచ్చింది! దాంతో మంచం చుట్టూ ముగ్గువేసినట్లు నేలమీద రుద్దాడు!

"అదేంటి ఎందుకలా చేస్తున్నారు!" అంది భయంగా!

"ఏంటోయ్ అలా భయపడతావ్ చేతబడి కాదులే! నీ తల్లో మల్లెపూలవాసన చూస్తుంటే ఆమధ్య పేపర్లో ప్రేయసి తలలో మల్లెపూలలో దాగిన పది బారల మిన్నాగు ప్రియున్ని కాటేసి చంపిన వార్త గుర్తొస్తోంది! కిరసనాయిలు వాసనంటే మిన్నాగులకు పడదు కదా! అందుకే అలా చేశాను! ఇంక భయంలేదు" అన్నాడు మంచమెక్కుతూ!

చండికి తల తిరిగినట్లయింది! ఏదో మాట్లాడబోయింది.

"ఇంకేం భయంలేదన్నానా!" అంటున్న శ్రీశైలం మాటలు చండికి వినిపించలేదు!



మరో అరవై రోజులు ఎవరి ప్రమేయం, ఏ గొడవా లేకుండా గడిచిపోయాయి!

రాఘవ దుర్గతో చాలా ముభావంగా ప్రవర్తించసాగాడు! దుర్గ అది గమనించినా తుఫాను ముందర ప్రశాంతతను గుర్తుకు తెచ్చుకుని మామూలుగా ఉండిపోయింది!

జీవితం యాంత్రికంగా గడిచిపోతోంది! డ్యూటీకి వెళ్ళటం, రావటంతోనే రోజులో సగ భాగం గడిచిపోతోంది! ఇంకెన్నాళ్ళు! ఇంకొద్ది రోజుల్లో ఎవరికెవరో! ఎవరి దారి వారిదే! ఈ కాంపౌండ్‌లో ఉన్న వారందరితోనూ ప్రేమాను బంధాలు, ఆప్యాయత, అభిమానం ఈ సంవత్సరకాలంలో చవిచూసింది! అయనకేం మగాడు! ఎక్కడున్నా అడ్జెస్ట్ అయిపోగలడు. తన బ్రతుకే వంటరి బ్రతుకు అనుకోగానే బాధపడేది దుర్గ.

రాఘవ కూడా ఇంచుమించు ఇలాగే ఆలోచిస్తున్నాడు! ఈ సంవత్సర కాలంలో దుర్గతో మాట్లాడకపోయినా, ఆమె చేసిన వంట తినటం, ఆమె డ్యూటీనించి రావటం కాస్త ఆలస్యమైనా తనకు తెలీకుండానే ఎదురుచూడటం, కంగారుపడటం, బంధువులు వచ్చినపుడు తప్పనిసరిగా మాట్లాడ్డం, ఆమెను ఉడికించటం, ఏ రోజుకారోజు క్రొత్తదనంతో గడిచిపోతున్నాయి. ఇంక కొద్ది రోజులకు ఆమె తనకు దూరమవుతుంది అనుకుంటేనే గుండెల్లో ముల్లుగుచ్చుకున్నంత బాధ! తనకేనా బాధ! ఆమెకు లేదా! ఆమెకు లేని బాధ తనకెందుకు?

ఓసారి 'క్యాంపు' అంటూ దుర్గ రెండురోజులు ఊరికి వెళ్లటంతో తనకు పిచ్చిపట్టినట్లయింది! రెండు మూడుసార్లు పోలీస్‌స్టేషనుకు ఫోనుచేసి కనుక్కున్నాడు "దుర్గ వచ్చిందా?" అంటూ!

అయితే అలాంటి బాధ దుర్గకు ఏమాత్రం లేదని ఆ తర్వాత తెలుసుకున్నాడు.

తనూ ఓసారి నాన్నగారికి వంట్లో బావుండలేదని ఉత్తరం వస్తే ఊరికి వెళ్ళి నాలుగురోజులకు తిరిగి వచ్చాడు. తను వచ్చేటప్పటికి వాకిట్లో ఎదురుచూస్తుంటుందని ఆలోచిస్తూ వచ్చిన తనకు తాళంవేసిన ఇల్లు వెక్కిరించింది.

దుర్గ సినిమాకు వెళ్లిందని తెలిసింది.

మర్ధిని కాబోలు "అన్నయ్యగారు వూరినించి వచ్చేసరికి ఇంట్లోలేకుండా వెళ్ళావు! అదే నీవు రెండు రోజులు క్యాంపుకెళ్ళేసరికి అన్నయ్యగారు కాలుగాలిన పిల్లిలా తిరిగేవారు" అంది!

"సర్లే! మరీ అపోహలో పడేయకు నన్ను! నీవు వర్ణించినంత బాధ పడే ఖర్మ ఆయనకు లేదులే! నేనెందుకు ఎదురు చూడటం! ఆయనగారు కాబోయె పెళ్లాంతో సినిమాలు, షికార్లు తిరగటానికి కాదూ వెళతా? అయినా కొద్దిరోజుల్లో ఎవరిదారి వారు చూసుకోక తప్పదు. అనవసరంగా ఈ ఎదురు చూడటాలు, యాక్షన్స్, తెచ్చిపెట్టుకున్న కంగారు నాకిష్టంఉండదు!" అనేసింది దుర్గ ఖచ్చితంగా.

చాలా బాధపడ్డాడు రాఘవ!

తన బ్రతుకింతే! ఈవిడతో తెగేది లేదు తెల్లవారేది లేదు! కందకులేని దురద కత్తిపీటకెందుకన్నట్టు ఆడదానికి లేని భయం, బాధ మగాడికెందుకు, అని జారిపోతున్న మనసుని బెట్టులోకి లాగాడు రాఘవ!

ఆరోజు ఆదివారం! సినిమా ప్రోగ్రాం ఉంది! అంతా రెడీ అయి స్కూటరెక్కబోతుండగా కళ్ళు తిరిగి పడిపోయింది దుర్గ!

ఆయా, మర్ధిని పరిగెత్తుకొచ్చి పట్టుకున్నారు! రాఘవ కంగారుపడుతూ నీళ్లు తెచ్చిచ్చాడు!

"అయ్యో! అయ్యో! ఏమయింది తల్లీ నీకు! స్కూటరెక్కకనే పడిపోవటం మేలయింది! అదే రోడ్లో ఎక్కడైనా పడిపోయి ఉంటే కొంప మునిగేది" అంది సూరమ్మగారు గుండెలు బాదుకుంటూ!

"మరే! అమ్మాయికీమధ్య ముఖం పీక్కుపోయింది! సరిగా తిండి తింటున్నట్లు లేదు!" అంది పార్వతమ్మ!

"ప్లీజ్! నన్ను వంటరిగా పడుకోనివ్వండి" అన్నట్టు అటువేపు ఒత్తిగిలి పడుకుంది దుర్గ!

రాఘవకు కంగారుగా అనిపించింది! ఆ రాత్రంతా సరిగా నిద్రపట్టలేదతనికి! రెండు మూడుసార్లు లేచి వచ్చాడు గదిలోంచి! కానీ ఆయా దుర్గ పక్కనే పడుకోవటంతో ఓదార్పుగా తాకటానికి కూడా వీల్లేకపోయింది!

తెల్లారి దుర్గ మామూలుగా పనులు చేసుకుంటోంది! రాఘవ మెల్లిగా ఆయా పక్కనచేరి "ఆవిడకేమయింది ఆయా! రాత్రి ఎందుకలా పడిపోయింది. ఈ పూట డ్యూటీకి వెళ్ళకపోతేనేం? రెస్టుతీసుకోవచ్చుగా!" అన్నాడు.

ఆయా రాఘవను క్రిమినల్‌ను చూసినట్టు చూసి "మీకెందుకు ఆవిడసంగతి మీ పనులు మీరు చేసుకోండి" అంది తాపీగా!

వళ్లు మండింది రాఘవకు! మళ్ళీ జన్మలో ఈవిడకు 'మామ'గా పుట్టి సాధించాలి అనుకున్నాడు కక్షగా!

ఆ సాయంత్రం రాఘవ రాగానే శ్రీశైలం దగ్గరికెళ్ళి కూర్చున్నాడు. తర్వాత దుర్గ రావటం చూసి మెల్లిగా లేచి తలుపువార నిలబడి లోపలి వాళ్ళ సంభాషణ వినసాగాడు.

''డాక్టరు దగ్గరికెళ్ళావామ్మా!'' ఆయా ప్రశ్నిస్తోంది!

''లేదు ఆయా!''

''అదేం? వెళ్ళలేకపోయావా?''

''ఇపుడు వెళ్ళటం కుదరదు ఆయా! మంత్రిగారు వస్తున్నారు! నన్నూ బందోబస్తుకు వేశారు! ఆ మంత్రిగారు రావటం కాదుకానీ ఆయనగారు రాకముందు ఓ పదిరోజులు నించే నానా హంగామాతో మా ప్రాణాలు తోడేస్తారు!'' అంది దుర్గ.

''ఎప్పుడూ నీ డ్యూటీ గురించే ఆలోచిస్తావు! నీవు ఒక్కదానివి లేనంతమాత్రాన మంత్రిగారి రాక ఆగిపోదుకానీ పద డాక్టరు దగ్గరికెళదాం?'' అంది ఆయా!

''అయ్యో! నీకెలా చెప్పాలి! వారం క్రితంనించే ఎవరూ సెలవు పెట్టకూడదని వార్నింగ్ ఇచ్చేశారు!''

''ఇలాంటివి ముందే చూసుకోవాలమ్మా! ముదిరితే ప్రాణానికే ముప్పు!'' అంది ఆయా!

''సర్లే ప్రాణానికి ముప్పు అయితే మునిగిందేముందిలే ఆయా! నాకోసం ఏడ్చేవాళ్లెవరున్నారుగనుక! నువ్వొరికే కంగారుపడకు! అయినా నీ డ్యూటీ కూడా ఇంక కొద్దిరోజులే కదా! అనవసరంగా నామీద అభిమానం పెంచుకుంటున్నావు. తర్వాత బాధ పడతావు'' అంది దుర్గ!

ఆయా కళ్ళు తుడుచుకుంది! దుర్గ ఆయా దగ్గర చేరి ''ఏంటి ఆయా ప్రతి చిన్న విషయానికి తెగ బాధపడతావు''! అంది!

''మరే! నీలాగా నేను పోలీసును కాదుగా గట్టిగుండెతో ధైర్యంగా ఉంటానికి!'' అంది.

''ఏది ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది! హైరానాపడకు! ఈ విషయం ఎవ్వరితోనూ నసేమిరా చెప్పకు!'' అంటూ బాత్రూంకెళ్ళిపోయింది!

రాఘవకు కంగారనిపించింది వాళ్ళిద్దరి మాటలు విన్నతర్వాత! ఏమిటి జబ్బు! ముదిరితే ప్రాణానికి ముప్పు అయ్యేంత ప్రమాదమా? అని రాఘవ గుండె కొట్టుకోసాగింది.

ఆయాకు దుర్గ మాట వేదవాక్కు. తనకు చస్తే చెప్పదు! దుర్గతోనే డైరెక్టుగా అడిగే సాహసం తనకు లేదు! రాఘవ మనసులోనే చాలా బాధపడసాగాడు. ఏదిఏమైనా దుర్గనే ఒంటరిగా అడిగెయ్యాలనుకున్నాడు. మళ్ళీ 'అయినా ఆవిడెలాపోతే తనకెందుకు?' అని ఒక్క నిమిషం అనుకున్నాడు.

కానీ దుర్గ లేనిది, ఆమె సాహచర్యం లేనిది తనకు జీవితం శూన్యంగా గోచరిస్తోంది! ఆ ఊహనే భరించలేకపోతున్నాడు. ఆమెకూ, తనకూ మాటలు లేకున్నా ఫర్వాలేదు. ఆమెతో తనకు దాంపత్య సుఖంలేకున్నా నష్టం లేదు! కానీ ఆమె తననించి విడిపోతుందనుకుంటుంటే, ఆమె ఆరోగ్యానికి ఏదో ప్రమాదం ఏర్పడబోతోందంటే భరించలేకపోతున్నాడు!

'మరయితే ఆమెను 'నీవు మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావా?' రాఘవను ప్రశ్నిస్తోంది అంతరాత్మ.

'ఖచ్చితంగా! అందులో సందేహంలేదు' అన్న సమాధానం వచ్చింది రాఘవనించి!

'అలాగా! అయితే ఆమె ఉద్యోగాన్ని కూడా ఇష్టపడుతున్నావా?'

'ఇష్టం సంగతి ఎలా ఉన్నా అడ్జెస్ట్ అయిపోవాలనుకుంటున్నాను ఆమెకోసం'

'ఏమంత ఖర్మ! లోకంలో ఆడాళ్ళు లేనట్టు! నీకిష్టంలేని ఉద్యోగం చేసే అమ్మాయితో మనసు చంపుకుని అడ్జెస్ట్ అయిపోవాల్సిన ఖర్మేమిటని?'

'ఇంతకుముందులా కాదు నాకిపుడు పోలీస్ డిపార్టుమెంట్ అంటే ఎలర్జీ లేదులే. దుర్గ సాహచర్యంతో పోలీస్‌డిపార్టుమెంట్‌మీద నాకున్న అపోహలు చాలామటుకు తొలగిపోయాయి. ఇకపోతే, లోకంలో మిగతా ఆడాళ్ళ సంగతి నాకొద్దు, నాకనవసరం కూడా! దుర్గ వ్యక్తిత్వాన్ని ఒకప్పుడు అహంభావంగా భావించటం లేదు నేనిప్పుడు. ఆమెను బాధపెట్టి, నేనూ బాధపడి జీవితంలోని మధురాను

భూతుల్ని దూరంచేసుకోడం నాన్సెన్స్! ఇక నావల్లకాదు! అంతే కానీ ఇపుడు దుర్గ నీనించి విడిపోవాలని ఆత్రపడుతున్నట్లు, రోజులు లెక్కిస్తున్నట్లు, ఆమె మాటల్లో గోచరిస్తోంది! నిజంగా నీవు ఆమెను కావాలనుకున్నా ఆమె నీ నించి దూరమవుతే అపుడేం చేస్తావు?'

'ఆమె నానించి దూరం కాదు'

'ఏమటంత నమ్మకం? దుర్గ వ్యక్తిత్వంగల అమ్మాయి! ఇన్ని మాటలతో బాధపెట్టిన నిన్ను క్షమించి నీతో కాపురం చేస్తుందని ఎలా అనుకుంటున్నావు'

నన్నిక బాధపెట్టకు! ఆ ఊహనే భరించలేను! దుర్గ నాక్కావాలి, దుర్గ నాక్కావాలి! అసహనంగా ఆక్రోశించింది రాఘవ మనసు! అతని కళ్ళు వర్షించి బుగ్గలమీదుగా జారిపోయాయి.

అటుగా వచ్చిన దుర్గ రాఘవ చెంపలమీద కన్నీళ్ళు చూసి ఆశ్చర్యపోయింది!

కుర్చీలో పరధ్యానంగా కూర్చున్న అతనికి వినవడేలా గట్టిగా దగ్గింది!

దాంతో అతడు సర్దుకుని బుగ్గలు తుడుచుకుని తడబాటుగా బాత్‌రూంకెళ్ళిపోయాడు.

అతని కన్నీళ్ళకు కారణాలు వెతుక్కుంటూ దుర్గ నిల్చుండిపోయింది అలాగే!

★ ★ ★

ఆయాకు చెముడుందన్నమాటేగానీ హుషారుగా అందరితోనూ మాట్లాడే స్వభావం కలది. నిశ్శబ్దంగా ఉన్నవాళ్లనుకూడా గిల్లి మరీ మాట్లాడించేది. మహిషాసుర్‌ని, మర్దినిని మరీ ఉడికిస్తుండేది! "మార్కెట్లో ఏడుపుగొట్టు పాటల క్యాసెట్టు వచ్చిందిట! తెప్పించుకోలేకపోయారా?" అనేది.

శ్రీశైలం దగ్గరకొచ్చి "ఏంటబ్బాయ్ నీరసంగా ఉన్నావు. నీ పెళ్లాం ఏదైనా కొత్తవంట చేసిందా? అబ్బే... ఏంలేదు దాన్ని చూసి నీకు ఏ కప్పలో, చచ్చిన ఎలుకలో గుర్తొచ్చి తిండి మానేసి నీరసంగా ఉన్నట్టనిపిస్తేనూ" అంటూ గుర్తుచేసేది.

పార్వతమ్మ దగ్గరికొచ్చి "ఏమిటీ! ముసలిపీనుగ ఎక్కడికెళ్లిందేమిటి? దాని బొంద ఆసనాలూ పిండాకూడు ఆరోగ్యసూత్రాలు నాకు మాత్రం వళ్లు మండుతుందనుకో! ఎప్పుడైనా చావాల్సిందేకదా! ఆస్తి మొత్తం మీకు రాసిచ్చి కృష్ణా రామా! అనుకోక సినిమాయాక్టర్‌లా ఎక్సర్‌సైజులూ గాడిదగుడ్డూ. నీవుకాబట్టి ఊరుకున్నావు. అదే నేనయితేనా?" అంటూ 'మందర' లెవెల్లో హితబోధ చేయబోయేది.

సూరమ్మగారి దగ్గరమాత్రం "ఎక్సర్‌సైజులు చెయ్యటం, ఆరోగ్యసూత్రాలు పాటించటం కూడా ఒక కళండీ! అది అందరికీ అబ్బుతుందటండీ! మీలాంటి కారణజన్ములకు తప్ప" అంటూ కొండెక్కించేది.

"కొత్తవారిని సినిమాలో చేర్పించుకుంటున్నారట! ప్రయత్నించకూడదూ!" అంటూ సూరమ్మ మనవడు గణపతినిరెచ్చగొట్టేది. పక్కవీధిలో అరవైఏళ్ల ముసలాడు ఓ అమ్మాయిని లేవదీసుకుపోయాట్ట! అందుక్కారణం మీరు చెప్పిన హరికథ 'రావణలీలలు' కారణమంటున్నారు. అంతా నిజమేనటండీ" అంటూ సూరమ్మ కొడుకు కోపానికి గురి అయ్యేది!

అలాంటి ఆయా రెండు మూడురోజులుగా మౌనంగా పిలిస్తే పలకటం, లేకుంటే నిశ్శబ్దంగా ఉంటూ ఆశ్చర్యకరంగా ప్రవర్తిస్తోంది. అందరికంటే ముందు దుర్గ పసికట్టింది.

"ఏంటి ఆయా! వంట్లో బాగుండలేదా? ఎందుకలా ఉన్నారు" అంటూ గుచ్చి గుచ్చి ప్రశ్నించింది. ఆయా కళ్లనీళ్లు పెట్టుకుంది. చాలా ఆశ్చర్యపోయింది దుర్గ! ఆమె బాధపడటం దుర్గ ఎప్పుడూ చూడలేదు. వింతగా చూస్తున్న దుర్గతో "ఇంక కొద్దిరోజుల్లో నా డ్యూటీ ముగుస్తుంది. వెళ్లిపోతాను. మళ్లీ నీకు ఒంటరిబ్రతుకు. ఆ బాబు మారేట్టు కనిపించటంలేదు. ఒకవేళ మారదామన్నా అతని అక్క మారనిచ్చేట్టులేదు. నక్కలాగా కాచుకుంది కూతుర్ని కట్టబెట్టాలని! నీవెవరో, నేనెవరో ఈ సంవత్సరమంతా కలిసి బతికాము. చివరికి విడిపోతాము. విడిపోక తప్పదు ఎప్పటికైనా. కానీ నిన్ను ఒంటరిగానే మిగిల్చిపోతానన్నదే బాధ! సంసారమన్నాక, భార్యాభర్తలన్న తర్వాత పట్టూవిడుపు ఉండాలి. మీ ఇద్దరిలో ఎవరికివారే పంతం గట్టుకున్నారు. ఇంక కాపురం ఎలా సాగుతుందమ్మా!" అంది బాధగా ఆయా. దుర్గకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. కేవలం డ్యూటీ ముగించుకుపోయేదానిలా కని

నంగా ప్రవర్తించే ఆయా తన గురించి, తన కాపురం గురించి, తన ఒంటరితనం గురించి ఇంతగా ఆలోచించి బాధపడుతోందంటే....?

ఒక్క నిమిషం నిశ్శబ్దంగా ఉండిపోయింది దుర్గ! ఆయా మెల్లిగా లేచి బయటికెళ్ళిపోయింది! దుర్గ అలాగే గోడకు చేరగిలబడింది! తనకుమాత్రం భర్తంటే ఇష్టం, ప్రేమ లేవా? కాపురం చెయ్యాలనేగా ఉద్యోగవిషయం దాచి పెళ్లి చేసుకున్నది! కానీ కథ ఇంతలా అడ్డం తిరుగుతుందని తను ఊహించిందా? ఎవరి పంతం గట్టిదో? ఒక్కమెట్టు కిందకు దిగినా పట్టు సడలుతుందని ఎవరికివారే ఒక్క ఇంచి కూడా కదలటంలేదు. రాఘవ తన తెలివితో నాటకాలాడి తనను అపుడపుడు వశపరచుకున్నా అది తనమీది ప్రేమతోమాత్రం కాదు అన్న విషయం అర్థం అయిపోయింది తనకు! ఇలాంటప్పుడు తనుమాత్రం పట్టుసడలిస్తే తన వ్యక్తిత్వాన్ని అతనికి దాసోహం చేసినట్టవుతుంది. పోనీ అలాగే పంతంగా ఉంటే ఏమవుతుంది? దుర్గ అంతరాత్మ ప్రశ్నించినట్టయింది.

ఆ! ఏమవుతుంది? సంవత్సరకాలం పూర్తవుతుంది! ఎవరిదారి వారిదవుతుంది. విడాకులు మంజూరు చేస్తారు. ఆయన మరో స్త్రీని పెళ్లి చేసుకుంటాడు. నీవు ఎంచక్కా యస్.ఐ. ఉద్యోగం చేసుకుంటూ బతకొచ్చు. వీలైతే నీవూ ఎవరినైనా మళ్లీ పెళ్లి చేసుకోవచ్చు అంది. ఆయనతో సంవత్సరకాలం ఒకే ఇంట్లో ఉండి, మళ్లీ ఆయన లేకుండా బతగ్గలనా? రాఘవను చూడకుండా ఉండలేనేమో! నాకిప్పటినించే దిగులుగా ఉంది. అటు ఆయన్ని వదులుకోలేను. ఇటు ఉద్యోగాన్ని కాదనలేను. ఏదైనా అద్భుతం జరిగి దుర్గా! నీవు ఉద్యోగానికి రాజీనామా చెయ్యక్కర్లేదు. కలిసి కాపురం చేద్దాం. అని ఆయనంటే ఎంత బాగుండు. అది కలలోమాట! ఆ మహానుభావునికి నా ఉద్యోగమంటేనే మంట!

దబ్బున ఏదో పడిన శబ్దం వినిపించి ఆలోచనల్లోంచి బయటపడింది దుర్గ! రాఘవ ఎప్పుడొచ్చాడో సూట్‌కేసు సర్దుకున్నాడు హడావిడిగా! గదిలోకి తొంగిచూసిన దుర్గకు రాఘవ ముఖం వడిలిపోయినట్టనిపించింది. హడావిడిగా బయటకు వచ్చిన రాఘవ గుమ్మం దగ్గర నిలబడ్డ దుర్గ కళ్లల్లోకి చూస్తూ తన చేతిలో ఉన్న ఓ తెల్లకాగితం దర్గ చేతికిచ్చి ''ఓ నాలుగురోజులు సెలవు వ్రాసి కాలేజీకి పంపు నాకు టైం లేదు ప్లీజ్! మా బామ్మ చనిపోయిందిట. టెలిగ్రాం వచ్చింది వెళుతున్నాను'' అంటూ కళ్లల్లో ఉబుకుతున్న నీరును కర్చీఫ్‌తో ఒత్తుకుని గబగబ అంగలేసుకుంటూ వెళ్లిపోయాడు. దుర్గకు నోటమాట రాలేదు. అప్రయత్నంగా ''ఏమండీ!'' అంటూ పిలిచింది తేరుకుని! కానీ అప్పటికే రాఘవ గేటు దాటిపోయాడు.

★ ★ ★

ఆ తర్వాత పదిరోజులకు వచ్చాడు రాఘవ గుండు చేయించుకుని కర్మకాండలన్నీ పూర్తి చేసుకుని! ఈ పదిరోజులు దుర్గకు చాలా భారంగా గడిచాయి. అతను తనను అల్లరి పట్టించటాలు, చూసే దొంగచూపులు తనకు మాత్రమే అర్థమయ్యే ద్వంద్వార్థాల మాటలు గుర్తుకొచ్చి ఎప్పుడొస్తాడా? అన్నట్టు ఎదురుచూసింది. ఛీ! తన ఆలోచనలు తనవి! వాళ్లక్కడ ముసలావిడ చనిపోయి ఏం బాధలో ఉన్నారో పాపం! పెళ్లియిన మూడురోజులకేమో బామ్మ తన పెళ్లి చూడలేకపోయిందంటూ బాధపడ్డారు. బామ్మ దగ్గరే తనకు చనువెక్కువ అమ్మ దగ్గరకంటే అనేవాడు! 'పోనిద్దూ ముసలావిడ. ఆమెపోతే పెద్దగా ఎవరూ బాధపడిఉండరు' అనుకున్న దుర్గ ఆలోచనలకు భిన్నంగా రాఘవ దివాలా తీసిన వాడిలాగా అయిపోయి రావటంతో గతుక్కుమంది. కాంపౌండ్ పరివారమంతా కూడా రాఘవను పరామర్శించారు ''వయసయిపోయింది. కాలం చెల్లింది! మనమూ పోవాల్సినవాళ్లమే! మరీ అంత దిగాలుపడకండి! పుణ్యాత్మురాలు ఓరోగమూ, రొష్టూ లేకుండా పుటుక్కున దేవుడి దగ్గరకెళ్లింది. అలాంటి చావు అందరికొస్తుందా'' ఇలాంటి మాటలతో రాఘవను ఊరడించామనుకుని తమకుతాము తృప్తిపడి పనయిపోయినట్టు వెళ్లిపోయారు. ఈ జీవితంలో అన్నింటికన్నా విసుగు అయినపని ఇతరులను ఊరడించటమేనేమో!

దుర్గ అన్నీ ప్రేక్షకురాలిలా చూస్తోంది! రాఘవను ఆ పరిస్థితిలో చూస్తూంటే బాధగా ఉంది! కానీ అతన్ని మాట్లాడించాలన్నా ఊరడింపు మాటలు మాట్లాడాలన్నా అహం అడ్డొస్తోంది. ముఖ్యంగా తను ఈ టైంలో మాట్లాడితే కాంపౌండ్‌లో అందరి దృష్టిలో పడతానేమో! కోర్టు నిబంధనలు ఉల్లంఘించినట్టవుతుందేమో! దీన్ని అలుసుగా తీసుకుని రాఘవ అతిగా ప్రవర్తిస్తే? ఇప్పటికే తనను ఆటపట్టించటమే ధ్యేయంగా పెట్టుకున్నట్టు ప్రవర్తించే ఈ మనిషికి తనకు తానుగా అవకాశాలు కల్పించినట్టవుతుంది. బామ్మ చనిపోయిన బాధ ఈరోజు బాధించినంతగా రేపు బాధించదు. ఇప్పటికే పన్నెండురోజులు గడిచిపోయాయి. దుర్గ ఇలా ఆలోచిస్తూనే ఒకరోజంతా యాంత్రికంగా గడిపేసింది. ఆరోజు సాయంత్రం ఆయా "అన్నట్టు మరిచిపోయాను. మీరు వెళ్లినరోజే మీకు ఉత్తరం వచ్చిందండీ! మీ మంచంమీదున్న పరుపు కింద ఉంచాను తీసుకోండి" అంది రాఘవతో. రాఘవ ఆ ఉత్తరం చింపి చదవసాగాడు! అది రాఘవ బామ్మ రాసింది.



"రాఘవా! నాయనా!

మరిచిపోయావా ఈ బామ్మని? నిన్ను చూడాలని ఉందిరా! మూడు నెలల క్రితం నీవు వచ్చినప్పుడు ఏం చెప్పావు! నన్ను తీసికెళ్లి నీ దగ్గరే అట్టిపెట్టుకుంటానన్నావు గుర్తుందా? పోన్లే నన్ను తీసికెళ్లకపోతేపోయావు! ముసల్ది పీడ! పిల్లిని చంకలో పెట్టుకుపోయినట్టు ఎందుకొచ్చిన గొడవ అనుకున్నావుకదూ! కాటికి కాళ్లు చాపుకున్నదాన్ని నన్ను గురించి ఆలోచించలేదని నేనేం బాధపట్టంలేదు కానీ రాఘవా! నాన్నా! పెళ్లి అనేది నూరేళ్లపంట! పెళ్లిళ్లు స్వర్గంలోనే జరిపి భూమ్మీదకు పడేస్తాడు దేవుడు అని అంటారు! ఈ ప్రపంచంలో ప్రతివ్యక్తి దేనికో ఒకదానికి రాజీపడిపోయి జీవితం గడిపేస్తున్నారు. తప్పదు! రాజీపడక జీవితాన్నించి పారిపోలేంకదా! ఏ ఒక్కరి జీవితమూ సంపూర్ణంకాదు! చదువుకున్నవాడివి! నీ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని ఒక్కసారి నిశిత దృష్టితో అవగాహన చేసుకో! విలువైన కాలాన్ని జీవితాన్ని వృధాచేసుకోకు! ఇలాంటి ఉత్తరాలు ఇప్పటికి చాలా రాశాను. కానీ జీవితం చరమాంకంలో ఉన్న నా మాటలు నీకు చాదస్తంగా అనిపిస్తూండవచ్చు.

కానీ నీవు పెళ్లి చేసుకోవాలని, నీ కాపురం మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లాలని, అది చూసి తృప్తిగా చనిపోవాలని నా కోరిక! కానీ ఈ జన్మకా కోరిక తీరదని తెలిసిపోయింది. చెప్పేవారు లేక చెడిపోయినట్టు కాపురాన్ని కోర్టుకు లాక్కున్న నీమీద, నీ కాపురం మీద ఆశలు పెట్టుకోవటం ఎండమావుల్ని చూసి నీళ్లని భ్రమపడినట్టవుతుంది. పెద్దదాన్ని నీ మంచికోరే చెబుతున్నాను. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. 'కోర్టుకు వెళ్లటం కాటికి వెళ్లటం ఒకటే' అంటారు పెద్దలు. ఆ కోర్టు మీ సమస్యను పరిష్కరించదు. నీవే సర్దుకుని అమ్మాయితో కాపురం చెయ్యి! మగవాడినన్న భేషజం ప్రక్కకు పెట్టు! నా ఆరోగ్యం అంతంత మాత్రమే ఉంది. ఆ దేముడినించి పిలుపుకోసం ఎదురుచూస్తున్నాను" ఆశీస్సులతో బామ్మ.

ఉత్తరం చదివి కళ్లు తుడుచుకున్నాడు రాఘవ! తలుపు పక్కన నిల్చుండి దుర్గ అతను ఉత్తరం చదువుతున్నంతసేపు అతని ముఖకవళికలు పరిశీలిస్తూపోయింది. ముసలావిడ మరణ ప్రభావం రాఘవ మనసును బాగా దెబ్బతీసిందన్న విషయం దుర్గకు అర్థమైంది. అతనింట్లో లేనపుడు బామ్మ రాసిన ఉత్తరం సభ్యత కాదని తెలిసినా చదివింది! దుర్గ చాలా బాధపడింది. తాము కాపురం చేస్తుంటే చూసి ఆనందించాలని ఆ ముసలి ప్రాణం ఎంత కొట్టుకులాడిందో! కనీసం ఆవిడను ఒక్కసారి కూడా ఇక్కడికి తీసుకురాకపోవటానికి కారణమేమిటో! మనసు పాడయిపోయినట్టయింది దుర్గకు! లేచి చండి దగ్గరకెళ్లింది.

★ ★ ★

దుర్గను చూడగానే చండి కన్నీళ్లు తుడుచుకుని "రాక్కా!" అంటూ పిలిచింది.

"ఎందుకు చండీ! కన్నీళ్లు పెట్టుకుంటున్నావు? ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగింది!

"అబ్బే! ఏంలేదు. కంట్లో నలకపడింది" అంటూ సర్దిచెప్పబోయింది!

"నోర్మూయ్యి! సినిమా డైలాగులు చెప్పకు! కన్నీరు పెట్టుకోవాల్సిన ఖర్మ నీకేమిటి? ప్రేమించి పెళ్లిచేసుకున్న భర్తతో కాపురం చేసుకుంటూ హాయిగా ఉన్నావు. భార్యాభర్తలు పోట్లాడుకున్నారా? నా దగ్గర రహస్యమెందుకు చెప్పవా" అంటూ గెడ్డం పట్టుకుంది దుర్గ చండిని. చండి కళ్లనించి జలజల నీళ్లు కారిపోయాయి. కాసేపయ్యాక సర్దుకుని చెప్ప సాగింది!

"నీ జీవితమూ, నీ పెళ్లి చూశాక మగవారి మనస్తత్వం అర్థం చేసుకోవటం కష్టమనిపించింది! భయం కూడా అనిపించింది! శ్రీశైలంగారు పరిచయమైనప్పుడు, ఆ తర్వాత మా ఇద్దరిమధ్య స్నేహం కుదిరి, అది ప్రేమగా మారిన నేపథ్యంలో 'అతని మనసు పూర్తిగా కాచి వడబోసినట్టు అర్థం చేసుకోవాలి. ఆ తర్వాతే పెళ్లి!' అన్న నిశ్చయానికొచ్చాను. అందుకే అతనెప్పుడు షికారుకు తీసికెళ్లినా అతని ఉత్సాహాన్ని నీరుకార్చేవిధంగా మాట్లాడేదాన్ని! అతనికి కేవలం నామీద వ్యామోహమే అయితే నాతో స్నేహం మానేస్తాడు.

నిజమైన ప్రేమ అయితే పెళ్లిదాకా వస్తాడు అన్న తలంపుతో నా మాటలతో అతన్ని దాదాపు చిత్రహింసలు పెట్టాను. కానీ ఆయన నన్ను పెళ్లి చేసుకునేదాకా వదల్లేదు. ఆయనకు నామీద గల ప్రేమకు మురిసిపోయాను. ప్రతిదానికీ భర్తగా అతను నామీద పెత్తనం చెలాయించకుండా, కొంగుకు ముడివేసుకోవాలనుకున్నాను. కానీ విచిత్రంగా నా మనసును ఎక్స్‌రే ద్వారా కనుక్కున్నట్టున్నారో మరేమిటో అర్థం కావటంలేదు కానీ మొదటిరోజునించే పెళ్లికాకముందు తననేవిధంగా నీరుగార్చేనో అదేవద్ధతిలో నిజం చెప్పాలంటే ఇంకా ఘోరంగా బాధపెడుతున్నాడు. ఆయనతో ఏం మాట్లాడాలన్నా భయంగా ఉంది! ఏదైనా మంచి జోక్ చెప్పినా నవ్వరు సరికదా! 'జోకనుకుని, పిచ్చి డైలాగు చెప్పి నామూడ్ పాడయ్యేట్టు చేశావు చండీ! ఈ పూట మనం సినిమాకెళదామనుకున్నాను. ఛ! ఛ! మూడంతా చెడిపోయింది' అంటూ దుర్వార్త విన్నవాడిలా లేచిపోతారు.

మొన్నామధ్య గవ్వలు చేశానా. చాలా రుచిగా ఉన్నాయని మీరంతా కూడా మెచ్చుకుని తిన్నారా? ఆయేనేమన్నారో తెలుసా? వద్దులే! చండాలపు పోలిక ఒకటి చెప్పి నన్ను తినకుండా చేశారు! ఇంకో ఆశ్చర్యమైన విషయమేమిటంటే ఆఫీసునించి రాగానే గవ్వలు ప్లేట్లో ఉంచుకుని నింపాదిగా తింటారు. ఏ కాయగూరలు చేసినా వాటికి దరిద్రపు పోలికలు చూపించి డోక్కునేలా చేస్తున్నారు.

మంచిచీర కట్టుకుని పువ్వులు పెట్టుకుని అందంగా ముస్తాబైతేనేమో 'ఛీ! ఛీ! ఏమిటా అవతారం శుభ్రంగా ఉండలేవూ! పాకీదానిలా ఉన్నావంటారు! మొన్న ఇల్లు బూజు దులుపుదామని, మంచిచీర పాడవుతుందని చిరిగిన చీర కట్టుకుని తలకు గుడ్డ చుట్టుకొని చెమటలు పట్టి చింపిరిగా ఉన్నాను. వెనకనించి ఎప్పుడు వచ్చారో గబుక్కున వాటేసుకుని అబ్బ! ఈ డ్రస్సులో ఎంతందంగా ఉన్నావు చండీ! ఆ దరిద్రపు డ్రస్సులు వేసుకుని నా మనసంతా పాడుచేస్తుంటావు! ఎప్పుడూ ఈ గెటప్‌లో ఉండి నన్ను సంతోషపెడితే నీ సొమ్మేంపోతుంది'' అన్నారు.

నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు నాకు. పార్వతమ్మ పిన్నిగారితో చెప్పి బాధపడ్డాను. పెద్దదికదా ఏదైనా సలహా ఇస్తుందని! ''డోలు వెళ్లి మద్దెలతో మొరపెట్టుకున్నట్టు నాతో చెబుతావేంటి తల్లీ! నేనూ ఇలాంటి సమస్యలకు సమాధానం వెతికే ప్రయత్నంలోనే ముసలిదాన్నయ్యాను. నేనూ మావారితో కొన్నేళ్లు బాధపడ్డాను. ఇప్పుడు ఇంచుమించు చెవిటిదానిలా అయిపోయి హాయిగా బ్రతికేస్తున్నాను అంది! అక్కా! నాకు దిగులు పట్టుకుంది. ఆ పార్వతమ్మగారిలాగే నేనూ నిర్లిప్తంగా బ్రతకాల్సిందేనా అని భయమేస్తోంది'' అంది చండి!

వాళ్లిద్దరూ మాట్లాడుకుంటుండగానే శ్రీశైలం వచ్చాడు! ''ఏంటండీ వదినెగారూ! ఇన్నాళ్లకు మా ఇంటిమీద దయకలిగింది. పక్కవాటాలో ఉన్నారన్నమాటేగానీ బొత్తిగా నల్లపూస అయిపోయినారు. అన్నయ్యగారి బామ్మగారు చనిపోయార్టగా! ఏమైనా ఆయన చాలా సున్నితమనస్కులండీ బాబూ! దాదాపు ఎనభైఏళ్ల ముసలావిడ చనిపోతే కడుపున పుట్టిన బిడ్డ చనిపోయినట్టు దివాలా తీశారు!'' అంటూ.

ఏంటి చండీ! నిన్నేదో జాంగ్రీలాంటి పదార్థమేదో చేసినట్టున్నావు. వదినెగారికి కాస్త రుచి చూపించకపోయావూ!'' అంటూండగానే చండి లేచివెళ్లింది.

''అలాగే కాస్త టీ చేసుకురా'' అంటూ కేకేశాడు.

''ఏమిటండీ శ్రీశైలంగారూ! మీ మగాళ్లంతా ఒకే కోవకు చెందినవారేనా? నా జీవితమెలాగూ ఇలా ఏడుస్తోంది. మా చెల్లి అయినా సుఖపడుతోంది అని సంతోషించేదాన్ని! దానికీ నాకూ పెద్ద తేడా లేదనిపిస్తోంది! మొత్తంమీద మా అక్కచెల్లెళ్లు పుట్టిన నక్షత్రాలే మంచివి కానట్టున్నాయి అంది.

శ్రీశైలం మొహం దించుకున్నాడు. ''సారీ! వదినెగారూ! ఇందాకట్నించీ మీ ఇద్దరి మాటలు విన్నాను. మీరనుకున్నట్టు, మీ చెల్లి అనుకుంటున్నట్టు నేను దుర్మార్గుణ్ణి కాదు! ఈవిడగారికి నోరు దురుసెక్కువ. కోరిక లెక్కువ అని పెళ్లికాకముందే తెలుసుకున్నాను. అలా అని

ఆమెను వదులుకోలేక పెళ్లిచేసుకున్నాను. ఆమె కోరికలకు, నోటి దురుసుకు నేను బలికాకుండా ఉండటంకోసం కాస్త ఏడిపిస్తున్నానంతే!'' అన్నాడు శ్రీశైలం.

దుర్గ మొహం ప్రసన్నంగా మారిపోయింది. ''అలాగా! మరీ ఓవర్‌గా మాత్రం ఏడ్పించకండి! చండి ఇప్పుడు ఉట్టిమనిషి కాదు!'' అంటూ లేచి వెళ్లిపోయింది దుర్గ. నోరు తెరిచాడు శ్రీశైలం కొత్తగా వింటున్నట్టు.

''అదేంటండీ! అక్క వెళ్లిపోయింది'' అంటూ స్వీటు ప్లేట్లు పట్టుకొచ్చి నిలబడిపోయింది.

''ఇంటికి పంపిద్దాంలే జంటగా తింటారు. ముందు నాకివ్వు నేను తింటాను'' అంటూ ప్లేటు లాక్కున్నాడు శ్రీశైలం. ''భలే రుచిగా ఉన్నాయి చండీ! మాలతీచందూర్ వంటల పుస్తకంలో చూసి చేశావా?''

''మరే! నిన్నంతా ఇది జాంగ్రీలు కావు చేగోడీలు అన్నారుగా'' అంది మూతి ముడుచుకుని!

''అబ్బ! నిన్నేడిపించటానికలా అన్నాను లేవోయ్! అయినా నిన్న అన్నాను! ఈ రోజు అనలేదుగా! మూడ్ బాగాలేనప్పుడు ఏవో అంటుంటాను. అవన్నీ సీరియస్‌గా తీసుకుంటావేమిటి. లే... లే! ఆమధ్య టి.వి. కొందామని గోలచేశావుగా! త్వరగా తయారవు! బజారు వెళదాం'' అన్నాడు శ్రీశైలం!

ఒక్కక్షణం చండి మొహం వెలిగిపోయింది! వెంటనే ఎందుకొచ్చిన టి.వి. లెండి! టి.వి. ఆన్‌చేయగానే 'బాంబు పేలి భార్యాభర్త దుర్మరణం!' అన్న వార్త ఈ రోజే చదివాను పేపర్లో. నాకు భయం బాబూ'' అంది చండి!

''కథ మళ్ళీ మొదటికొచ్చింది బాబోయ్!'' అంటూ రెండు చేతులతో తలపట్టుకున్నాడు శ్రీశైలం!

పకపక నవ్వింది చండి!

★ ★ ★

ఆరోజు రాత్రి పదిగంటలకు వచ్చాడు రాఘవ ఇంటికి! తనకు తెలియకుండానే అతని రాకకోసం ఆత్రుతగా ఎదురు చూసింది దుర్గ. సాధారణంగా అయిదు గంటలు మరీ ఆలస్యమనుకుంటే ఏడుగంటలలోపు ఇల్లు చేరటం, స్నానం అదీ ముగించుకుని తన వంతు పనులేమైనా ఉంటే చేయటం త్వరగా భోంచేసి పదిగంటలలోపు నిద్రపోవటం అతని అలవాటు. అలాంటిది పదిదాకా రాకపోయేసరికి దుర్గకు కంగారెక్కువైంది! అసలే ఊరినించి వచ్చినప్పటినించి సరిగా భోంచెయ్యటంలేదు. కొంపదీసి కళ్లు తిరిగి ఏ రోడ్డుమీదో పడిపోలేదు కదా! దుర్గ ఆలోచనల్లో అన్నీ దడపుట్టించేలాగే ఉన్నాయి. ఆగలేక ఆయాతో అంది - ''ఈయనేమిటి ఆయా! ఇంకా ఇంటికి రాలేదు. ఉదయంనించి భోంచేయలేదు కూడానూ!'' అంది దుర్గ!

''ఎక్కడికెడతారు దుర్గమ్మా! ఏ స్నేహితులతోనో బాతాఖానీ వేసుకునుంటారు. లేదా ఏ డిన్నరో పార్టీనో చేసుకుంటూ ఏ హొటల్లోనో ఉంటారు! ఈ మగాళ్ళ సంగతి తెలియందేముంది!'' అంది ఆయా.

''ఆయనలాంటి వారు కాదు!'' పైకి అనేసి నాలుక్కరుచుకుని, ''ఎపుడూ ఇంత ఆలస్యంగా రాలేదు కదా అందుకే కంగారు!'' అంది మళ్ళీ దుర్గ కాస్త కోపం మిళితమైన స్వరంతో!

దుర్గవైపు తేరిపార చూసింది ఆయా! మనసులో నవ్వుకుంది! పైకిమాత్రం ''ఇంకొద్ది రోజులకు ఎవరిదారి వారు పోతారు రైల్లో ప్రయాణికుల్లా! ఇలా బాధపడుతూ కూర్చుంటే తెల్లారి డ్యూటీకెళ్ళలేవుగానీ వెళ్ళి భోంచేసి పడుకో!'' అంది ఆయా కాస్త గంభీరంగా! మొట్టమొదటిసారిగా ఆయామీద కోపం వచ్చింది దుర్గకు! వెళ్ళి పడుకుంది! కాసేపటికే రాఘవ వచ్చి బట్టలు మార్చుకుని మంచం మీద పడుకున్నాడు! వరండాలోకి తొంగిచూసింది! ఆయా గురుపెడుతోంది! ప్లేటులో భోజనం సర్దుకుని గదిలోకెళ్ళి స్టూలుమీద పెట్టింది! రాఘవ దుర్గ కళ్ళల్లోకి చూస్తూ, ''నేను భోంచేసి వచ్చాను'' అన్నాడు! మూగదానిలా అక్కడ్నించి ప్లేటు తీసుకుని వెళ్ళిపోయింది! ఓ గ్లాసు పాలు తెచ్చి స్టూలు మీదుంచింది. ఈసారి మారుమాట్లాడకుండా పాలు గటగట తాగేసి

పడుకున్నాడు. హాల్లోకి వచ్చేసి పడుకుంది దుర్గ రాఘవ ఆలోచనలతో!

ఉదయం లేచి హడావిడిగా పనిచేసుకుంటోంది దుర్గ! నిజానికి ఆ రోజు రాఘవ వంతు వంట చెయ్యటం! కానీ 'అతను బామ్మ పోయిన దుఃఖం నెపంతో సరిగా భోజనమే చేయట్లేదు! ఇంకేం వంటచేస్తాడు!' అనుకుని తనే చేయసాగింది! బయట సూరమ్మగారి గొంతు గట్టిగా వినిపించటంతో హడావిడిగానూ కంగారుగానూ బయటకు వచ్చింది దుర్గ!

"నాకదంతా తెలియదు రాఘవా! ఈ నెల నాకూ ఖర్చులున్నాయి. ఆయుర్వేద మందులు పార్శిల్స్ వస్తాయి! అవి తెచ్చుకోవాలంటే డబ్బు కావాలి కదా! ఉద్యోగస్థుడివి నీవే అలా అంటే మాలాంటివాళ్ళ సంగతేమిటి? చెప్పు! సాయంకాలంలోగా అద్దె డబ్బు ఇచ్చెయ్యి" అంటోంది సూరమ్మగారు ఖరాఖండిగా!

"చూడండి! ఈనెలమాత్రం మీరెంత గింజుకున్నానేనివ్వను. బామ్మపోయిన దుఃఖంలో ఉన్నానన్న జాలికూడా లేదు మీకు. ఊరెళ్లి వచ్చాను ఖర్చయిపోయిందంటే వినరేం? అంతగా కావాలిస్తే రేపు నెలవడ్డీ వేసి ఇస్తాను" అంటున్నాడు రాఘవ! దుర్గకు విషయం అర్థమైపోయింది! ఈ నెల అద్దె చెల్లించాల్సిన వంతు రాఘవది! బద్ధ శత్రువులా మాట్లాడుతోంది సూరమ్మ.

"ఏమిటీ! సాయంకాలానికి కావాలన్నానా? వడ్డీ వేసిస్తావా? చూడబ్బాయ్ అద్దె డబ్బులకు వడ్డీ వసూలుచేసేదానిలా కనిపిస్తున్నానా? ఎవరిదగ్గరయినా అప్పుచేసి అయినా సరే కట్టు" అంది కసిగా. సూరమ్మగారికి రాఘవంటే అసలు పడదు!

"ఏంటండీ! మెత్తగా చెబుతుంటే రెచ్చిపోతున్నారు. నేను చచ్చినా ఇవ్వను ఏం చేసుకుంటారో చేసుకోండి! నా ఖర్మకాలి మీ యింట్లో ఉంటున్నాను. ఇంకెన్నాళ్ళులెండి. మీ అందరి పీడ తెంచుకుని వెళ్ళిపోతాను" గట్టిగా అనేసి లోపలికెళ్ళాడు. గుమ్మం దగ్గర నిలుచున్న దుర్గ "బామ్మగారూ! నేనిస్తాను తీసుకోండి! మళ్ళీ ఆయనవద్దనుంచి నేను వసూలుచేసుకుంటాను" అంటూ అద్దె డబ్బు ఇచ్చేసింది దుర్గ! కక్కలేక మింగలేక అన్నట్టయింది రాఘవ పరిస్థితి! ఆ సాయంత్రం డబ్బు తెచ్చి దుర్గకిచ్చేశాడు.

"ఇంద తీసికో నీ డబ్బు! నాకసలు ఇతరుల దగ్గర అప్పుచేయటం ఇష్టం ఉండదు!" అన్నాడు!

అక్కడే ఉన్న శ్రీశైలం "అదేంటండీ ఇతరులు అంటారు వదినగారేగా! ఏం! ఆమాత్రం హెల్ప్ చేయకూడదా ఏమిటి?"

"కొద్దిరోజుల్లో దారులు వేరయ్యే మా మధ్య ఈ అప్పులూ గొడవలూ ఎందుకు చెప్పండి" అంటూ వెళ్ళిపోయాడు! అలాగే ఉండిపోయింది దుర్గ! అప్పటికప్పుడే నిర్ణయించుకుంది తనిక ఈ ఊళ్ళో ఉండకూడదని! దుర్గ అహం బాగా దెబ్బతింది ఈ సంఘటనతో!



ఆరోజునించి దుర్గ చాలా ముభావంగా ఉండిపోసాగింది! రాఘవ ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు. బామ్మ పోయిన దుఃఖంనించి తేరుకున్నాడు. నిజానికి బామ్మ పోయిన దుఃఖం కొంచెమే అనుభవించినా చాలా దుఃఖపడుతున్నట్టు, బాధపడుతున్నట్టు కాస్త ఓవర్ యాక్షన్ చేశాడు. అందుక్కారణం ఈ కారణంగానైనా తనమీద జాలితోనైనా తనను ఓదార్చేందుకు దరిచేరుతుందన్న ఆశ! అవిధంగానైనా తాము కలిసి బ్రతకవచ్చు అన్న కోరికతో అలా చేశాడు. కానీ దుర్గ తనమీద జాలిపడుతుందని ఒకటి రెండుసార్లు అనిపించినా 'నన్ను ముట్టుకోకు నా మాల కాకీ' అన్నట్టు ప్రవర్తిస్తుండటంతో వళ్ళు మండిపోతోంది! రాఘవ కోరుకుంటున్నది దుర్గ వగటి

పూట జాలిపడటం కాదు!

రాఘవకర్థమైంది ఒకటే! ఆమె ఉద్యోగాన్ని తను గౌరవించాలి! ప్రేమించాలి! అది ఆరు నెలలక్రితమే జరిగిపోయింది! కానీ ఆ విషయం ఆమెకు నమ్మకంగా తెలియాలికదా! డైరెక్టుగా చెప్పచ్చు! కానీ ఈ ఆయా గుంట దగ్గర నక్కలాగా కాచుకుని నోట్సుతో పెన్నుతో బెదిరింపు చూపులతో చంపుతోంది! రాఘవకేం తోచటంలేదు! ఓ రెండు మూడు రోజుల తర్వాత దుర్గ కొలీగ్ రాజన్, అతని భార్య వకుళాదేవి వచ్చారు. రాజన్ తమిళుడు, వకుళాదేవి తెలుగమ్మాయి. వారిద్దరిదీ ప్రేమవివాహం! వకుళాదేవి గర్ల్స్ కాలేజీలో లెక్చరర్. రాఘవ కాలేజీకి వెళ్ళే దారిలోనే వాళ్ళిల్లుండటంతో వాళ్ళు ఎదురుపడటం కాఫీకో, 'టీ'కో ఆహ్వానించటం కాసేపు కాలేజి కబుర్లు, కాసేపు పోలీసుస్టేషన్ కబుర్లు చెప్పుకుని బయటపడటంలాంటివి జరుగుతుండేవి! రెండు మూడు సార్లు రాఘవ ఇంటికి కూడా రాజన్ దంపతులు రావటం జరిగింది!

రాజన్‌కు విశాఖపట్నం ట్రాన్సఫరయింది! తుది వీడ్కోలు తీసుకోవటానికొచ్చారు. ఎలాగూ చీకటివడ్డాక రావటంతో దుర్గ వారికికూడా భోజనం ఏర్పాట్లు చేసింది! ఇంకా భోజనం పూర్తికాకముందే రాజన్ పక్కింటి అబ్బాయి, వకుళాదేవి నాన్నగారు వచ్చారంటూ కబురు తెచ్చాడు. త్వరగా వెళతామంటూ పట్టుబట్టారు! భోజనాలదగ్గర ''మా వకుళ నన్ను ట్రాన్స్‌ఫర్ చేసినందుకు చాలా భయపడుతోంది సిస్టర్ మీరుదా కాస్త ధైర్యం సెప్పండీ!'' అన్నాడు రాజన్! అయనకు తెలుగు సరిగ్గా మాట్లాడ్డం రాదు! అయన మాటలన్నా అయన్ని మాట్లాడించాలన్నా రాఘవకు ఇష్టం! అందుకే అతనికి బాగా దగ్గరయ్యాడు.

''ఎందుకమ్మా భయం! మీరూ ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చుగా!'' అన్నాడు రాఘవ.

''అదికాదన్నయ్యగారూ! అది నక్సలైట్ల ఏరియా! ఎక్కడపడితే అక్కడ కాల్పుల్లో పోలీసులు మరణిస్తున్నారు! రోజూ పేపర్లో చూస్తున్నాంకదా! నాకు ధైర్యం చాలటంలేదు! అసలు ఈయన చదివింది ఎమ్.ఏ ఎమ్.ఇ.డి! అవన్నీ ప్రక్కకుపెట్టి ఈ యస్.ఐ. ఉద్యోగాన్ని ఎంచుకోవటమేమిటండీ! హాయిగా ఏ లెక్చరర్ ఉద్యోగమో చేస్తూ బ్రతకాల్సింది పోయి ఈ కత్తిమీద సాములాంటి ఉద్యోగమేమిటండీ!'' అంది వకుళాదేవి!

సంభాషణ ఇప్పట్లో ముగిసేలా లేదు. కళ్ళు కూరుకుపోతున్నాయి నిద్రతో అనుకుంది దుర్గ! భోజనాలయి పదిహేను ఇరవై నిమిషాలవుతున్నా ఇంటిదగ్గరనించి కబురు వచ్చినా వీళ్ళు వెళ్ళేట్టు లేరు అనుకుని మనసులో చిరాకుపడుతూ కుర్చీలోనే చేరగిలబడి వారి సంభాషణ వినసాగింది!

''ఎన్నుకోవటమేమిటి! ఇదిదా ఏమన్నా నాకు యిష్టమా! ఏజీ బారు అయిపోతుంటే ఉద్యోగంలేక చస్తుంటే పోలీస్‌సెలెక్షన్స్ అన్నారు. వెళ్ళాను... సెలెక్టుదా అయ్యాను. ఉద్యోగంలో చేరి ఆరేళ్ళుమా అయింది. ఏదో కూడు తింటున్నాం. నాకు ఆ ఉద్యోగందా కావాలి ఈ ఉద్యోగందా కావాలి అని కోరికలు కోరితే మన మేమన్నా ఛీఫ్ మినిష్టరు బంధువులమా? పిచ్చిపిచ్చి కూతలు దా మాట్లాడుతుంది సార్ ఈవిడ!'' అంటూ యాసతో మాట్లాడేశాడు రాజన్. రాఘవకు నవ్వు వచ్చింది!

''ఏమైనా చెప్పండి ఈ ఉద్యోగం చాలా రిస్కుతో కూడినది కాదంటారా?'' అంది రాఘవతో వకుళాదేవి!

''మీరు పొరబడుతున్నారమ్మా! ఈ రోజుల్లో రిస్కులేని ఉద్యోగం అంటూ ఏదీలేదు! మా నాన్నగారు టీచరుగా చేస్తున్న రోజుల్లో విద్యార్థులు టీచర్లు చెప్పిన పనులు అన్నీ చేయటం, ఎంతో వినయవిధేయతలతో చదువుకుంటూ ఉండేవారట! వీధిలో ఎదురు పడితే ఎంతో ఒదిగి నిలబడి నమస్కారం పెట్టేవారుట! కానీ ఇప్పుడు అదే టీచర్ ఎదురుపడితే 'హాయ్!' అనో 'హలో గురూ!' అనో కన్నుకొట్టి పిలిచి మరీ పలకరిస్తున్నారు! మొన్నటికి మొన్న చూశారుగా! కాస్తలో నాకెంత ప్రమాదం తప్పిందో! పూర్వం బతకలేక బడిపంతులు అనేవారు కానీ ఇపుడు బ్రతకటానికి బడిపంతులు అన్నట్టయింది మన పరిస్థితి. చెప్పండి... మన ఉద్యోగంలో రిస్కులేదా? ఈమధ్య పేపర్లో చదివాను 'లెక్చరర్ ఇంటిమీద బాంబులదాడి' అంటూ!

మొన్నామధ్య మా ఫ్రెండు కలిశాడు! వాడికి సేల్స్‌టాక్స్ ఆఫీసులో ఉద్యోగం వచ్చింది! ఎంతో నిజాయితీ పరుడు. లంచం ముట్టడు. ఓరోజు ఆఫీసరు తన గదికి పిలిచి "ఏంటయ్యా! ఏదో వాళ్ల తృప్తికోసమో పనులు జరిపించుకోటానికో మామూలు ముట్టచెప్పబోతే మడిగట్టుక్కూర్చుని గాంధ్రిస్తున్నావట! ఏం డబ్బు చేదయిందా? లేక మీయింట్లో ఎక్కువయి మూలుగుతోందా? నీకంత వద్దనుకుంటే నీవు తీసుకుని మాకిచ్చెయ్యి సద్వినియోగం చేస్తాము. అంతేకానీ సత్యహరిశ్చంద్రుడి పోజెట్టి ధర్మరాజు డైలాగులు చెప్పి విసిగించక! అసలే ఈ ఆఫీసుకు పెద్దవాళ్ళు వస్తూంటారు! మరీ నీలిగావంటే కాలో చెయ్యో విరిచేయిస్తారు జాగ్రత్త!" అన్నాట్ట. అంత నిజాయితీపరుడూ నోరుమూసుకుని, మనసు చంపుకుని లంచం తీసుకుంటున్నాట్ట! తీసుకుంటే ఒక బాధ! లేకుంటే ఒక బాధ! అది రిస్కుతో కూడిన ఉద్యోగం కాదా! ఈ రోజుల్లో ప్రతి ఉద్యోగమూ కత్తిమీద సాములాంటిదే! ఉపాధ్యాయవృత్తి చేసి భావిభారత పౌరులుగా తీర్చిదిద్దాల్సిన మనం మన జీవితాలు గురించి, రాబోయే బాధలగురించి ఆలోచిస్తున్నామే తప్ప మన బాధ్యత ఎంతవరకు నెరవేస్తున్నాము చెప్పండి! కానీ పోలీసు ఉద్యోగంలోమాత్రం మన లాగా ప్రవర్తించటానికి వీలుకాదని నేనను కుంటున్నాను. కర్తవ్య నిర్వహణలో వారు కృతకృత్యులవుతున్నారు అని మనస్ఫూర్తిగా అనిపిస్తుంది! ఏదో పుట్టాం బ్రతికెయ్యాలి! డబ్బు సంపాదించాలి! ఏదో ఓ ఉద్యోగం చెయ్యాలి. ఇలా కాకుండా ఈదేశం లోపుట్టాము. ఈ దేశానికి సేవచెయ్యాలి! 'ఈ దేశం నాకేమిచ్చింది. అని కాకుండా నేను ఈ దేశానికెంత సేవచేశాను' అని ఒక్క పోలీస్ డిపార్టుమెంటు మాత్రమే ఆలోచిస్తుంది అని నేననుకుంటున్నాను. ఆలోచించకపోయినా ఆలోచింపచేసే బాధ్యతాయుతమైన వృత్తి వారిది! అలా అని పోలీస్ డిపార్టుమెంటులో అంతా నిజాయితీపరులు ఉన్నారని నేనసను! తులసివనంలో గంజాయిమొక్కల్లా ప్రతి డిపార్టుమెంటులోనూ ఉన్నారు! ఉంటారు కూడా!"

"చాలా బాగా చెప్పారు! చదువుకుంది, ఉద్యోగం చేస్తోంది ఎందుకూ! ఉట్టిపిరికిది! నా ప్రాణాలు తీసేస్తోంది. నక్సలైట్లు నన్ను చంపేస్తారుట! చావు దగ్గరకొచ్చినపుడు ఎక్కడ ఉన్నా చస్తాము" అన్నాడు రాజన్!

అంతసేపూ తను ఇచ్చిన లెక్చర్ అంతా విని కొయ్యబారిపోయింది కామోను అనుకుని ప్రక్కన కుర్చీలో కూర్చున్న దుర్గవేపు చూసి కాలరెగరేయబోయాడు!

దుర్గ ఎపుడు నిద్రపోయిందో కుర్చీలో చేరగిలబడి గాఢంగా నిద్రపోతోంది!

ఛీ! ఛీ! ఇంతాచేసి తను మాట్లాడింది దుర్గ వినలేదు అనుకుంటే చిరాకేసింది రాఘవకు! వరండాలో తలుపు దగ్గర ఎప్పటినించి కూర్చుని ఉందో ఆయా కల్పించుకుని "మీరు విద్యార్థులు టీచరును కన్నుకొట్టి పిలుస్తారు అని చెప్పారు చూడండి! అపుడు నిద్రపోయింది దుర్గమ్మ!" అంది రాఘవతో!

"అలాగా! అంత కరెక్టుగా వివరణ అక్కర్లేదు లెండి" అన్నాడు రాఘవ పళ్ళు నూరుతూ!

వెళతామంటూ లేచారు రాజన్ దంపతులు.

★ ★ ★

"ఆహా! ఓహో!ఇవి కళ్ళా! కావు కలువరేకులు! ఇది ముక్కా! కాదు సంపెంగ... అహ కాదు బంతిపువ్వు! ఇది జడా! అహ కాదు వానపాము. ఇది నడుమా... అహ కాదు పూచిక పుల్ల!" వర్ణించేస్తున్నాడు గణపతి.

"ఒరే ఒరే చేటమొహం వెధవా? శుభ్రంగా తనమానాన తాను పనిచేసుకుంటున్న పిల్లను పట్టుకుని బావిదగ్గర నించుని ఆ ఉపమానాలేమిటిరా? వెధవకు వర్ణించటం రాదు కానీ సినిమాల్లో తగలడతాడుట" అంటూ విజృంభించాడు తండ్రి శివయ్య.

"నాన్నా! కొత్త దంపతులమధ్య మీ నస పనికిరాదు" స్పీడుగా అనేశాడు.

"ఏమిటంత స్పీడు చీపురుమొహం వెధవా!"

"ఇది నటశేఖర శోభన్‌బాబు వాయిస్"

"నీ పిండాకూడు వాయిస్‌గానీ, నీ గదిలో

ఆ పిల్లను వర్ణించు ముందుంచుకుని. అంతే గానీ బావిదగ్గర అందరూ చూస్తుండగా ఎగ్జిబి షన్ పెట్టావంటే చంపేస్తాను. మంచీ మర్యాద లేదు వెధవకి ఛీ! ఛీ!''

''గదిలో ప్రేక్షకులుండరుగదా పితృదేవా! మనమేం చేసినా ప్రేక్షకుల మనను రంజిల్లచే సే పనులే చేస్తాం''

''చెప్పుచ్చుకు కొడతాను వెధవా! వెళ్లమ్మా వెళ్లు లోపలికి'' అంటూ కోడలు శాంతిని పంపించేడు బట్టలుతకకుండా! శివయ్యగా రు.

అంతవరకు ప్రేక్షకులుగా ఉన్న శ్రీశైలం చండి ముందుకొచ్చారు. ''ఏంటి మాష్టారూ!




మీ ఆఫీసర్ని ఎవరో కిడ్నాప్ చేశార్టగా!'' అంటూ పలకరించేడు శ్రీశైలం టాపిక్ మళ్లి స్తూ.

''సరి సరి! వాడినెవరు కిడ్నాప్ చేస్తారు? ఒకవేళ చేసినా వాడిని భరించేవాడెవడు? బ్రేక్‌ఫాస్ట్‌కు ఒక కోడి, లంచ్‌కు మరో కోడితిని చస్తాడు. ఇంకో రెండేళ్లలో రిటైర్ కాబోయే వెధవనెత్తుకెళ్లి ఎవరు మాత్రం ఏం చేసు కుంటారు'' అన్నాడు.

అయితే ఒట్టి పుకారన్నమాట.

"మా నాన్న హరికథ విన్నాడేమో ఆయన గారీ మధ్య. ఇంకేం జీవితంమీద విరక్తి పుట్టి ఏ హిమాలయాలకో వెళ్లిపోయుంటాడు" గణ పతి జోకాడు.

"నువ్వు నోర్మూయ్! వాడీమధ్య రాజకీయా ల్లోకి వెళ్లాలని తెగప్రయత్నాలు చేస్తున్నాడ య్యా! జనం తనని గుర్తించాలని తెగ తపనప డిపోతున్నాడు. ఆమధ్యనోసారి "ఉస్మానియా ఆస్పత్రిలో హార్ట్ ఫెయిలయి చచ్చిపోయానని పేపర్లో వేయించుకున్నాడు. ఓ పదిరోజులు అందర్నీ హైరానపెట్టి ఆర్.టి.సి. బస్సులోంచి ఫ్రెష్‌గా దిగాడు. అదేంటంటే "జనానికి తన మీద ఎంత అభిమానం ఉందో కనుక్కోవటాని కి చిన్న పరీక్ష" అన్నాడు,

"ఏమో! అలా ఎందుకు అనుకోవాలి. ఈసారి నిజంగానే కిడ్నాప్ చేశారేమో! పాపం నక్సలైట్లు ఆయన్ని అడవుల్లో ఎంత కష్టపెడు తున్నారో!"

"ఆ! వీడి దగ్గరేముందని కిడ్నాప్ చేస్తారు? ఊరినిండా అప్పులు తప్ప చీమలు చీకిన బెల్లం మొహమూ వాడూనూ!"

"ఏమండీ! వడ్డించాను రండి" అన్న పార్వ తమ్మ పిలుపుతో లోపలికెళ్లిపోయాడు.

★ ★ ★

ఆరోజు ఆదివారం! ఉదయనించి రాఘవ హుషారుగా ఉన్నాడు దుర్గతో సినిమాకెళ్లాలని.

ఈరోజు ఎలాగైనా సినిమాలో ఆమె ఆరోగ్యం గురించి అడగాలి! ఇంట్లో ఆయాతో కుదర టంలేదు! ఈవిడనెప్పైనా పంపించి దుర్గను ప్రేమగా దగ్గరకు తీసికొని తన మనసంతా విప్పి చెప్పి మనను తేలిక చేసుకుందామని వారంనించి చూస్తున్నాడు. శ్రీశైలంకు చెబితే ఏదైనా ఉపాయం ఆలోచించేవాడే కానీ తన కెందుకో అది నచ్చలేదు. పైగా సిగ్గని పించింది!

"ఆయాని ఇంటికి పంపించాలని చాలా ప్రయత్నాలు చేశాడు.

"ఇంటిదగ్గర మీ మనవడు మీరు లేకుంటే పడుకోడన్నారు ఇపుడు అలవాటుపడ్డాడా?" చాలా క్యాజువల్‌గా అడిగాడోరోజు.

"సుబ్బరంగా పడుకుంటాడు! ఒకవేళ వాడు నిద్రపోకుంటే వాళ్ళమ్మ చూసు కుంటుంది! కానీ దుర్గమ్మకు నేను లేకుంటే నిద్రపట్టదు!" అంది తమలపాకుల ఈనెలు తాపీగా తీస్తూ.

"మిమ్మల్ని రాజమండ్రి జైలుకు సెంట్రీగా ప్రమోట్ చెయ్యమని పోలీస్‌డిపార్టుమెంటుకు రాయాలి?" అన్నాడు లోలోపల వళ్లు నూరు తూనే పైకి నవ్వుతూ!

"అలాగా! ఎందుకేమిటి?" అంది ఆయా!

"మీలా కావలా కాసే సెంట్రీలు డిపార్టు మెంటులో లేనట్టుంది! అందుకే వారానికిద్దరు చొప్పున రాజమండ్రి జైలునించి దొంగలు పారి పోతున్నారు!" అన్నాడు.

"ఏమిటోనబ్బాయ్! ఒక్కముక్క వినప డలా!" అంది లేస్తూ "అరెరే! సుజాతమ్మగా రా? బావున్నారా" అంటూ ఎదురెళ్ళింది ఆయా!

రాఘవ అక్కయ్య! వచ్చిందన్న మాట! రాఘవ నీళ్ళు కారిపోయాడు!

"బంధువులొచ్చారు. దుర్గమ్మా! సినిమా కా న్సిల్ అయింది! ఇంక నిశ్చింతగా ఉండు" అంటున్న ఆయాకేసి అయోమయంగా చూశా డు రాఘవ!

"ఏంట్రా తమ్ముడూ ఇంత చిక్కిపోయా వేంటి ఈ నాలుగు నెలలకే" అంటూ దీర్ఘాలు తీసింది సుజాత తమ్ముడిమీద ప్రేమ ఒలకబో స్తూ.

"అదేమిటి? ఇపుడేరానన్నావు, అపుడే ఊడి పడ్డావు. వస్తున్నట్టు ఉత్తరం ముక్క రాయకూ డదా?" అన్నాడు రాఘవ వళ్ళ బిగువున కోపాన్ని అణచుకుని!

"అనుకోకుండా బయల్దేరాము! నీకాబోయే పెళ్ళాన్ని కూడా తీసుకొచ్చానురోయ్! అది నిన్ను చూడాలని మారాం చేస్తుంటేనూ! సుగు ణా! దాగుడుమూతలు చాల్లే! రా" అంటూ కేకేసింది!

కాంపౌండు బయట గోడచాటున నక్కిన సుగుణ లేడిపిల్లలా వచ్చింది!

అప్పటికే కాంపౌండ్‌లో వారంతా చేరిపో యారు!

"ఏంటి మామయ్యా! బాగున్నావా?

అదేంటలా బిగుసుకున్నావు పలకరించ కుండా!" అంటుండగానే దుర్గ ఓసారి బయ టకు తొంగిచూసింది! సుగుణ చాలా అంద మైన పిల్ల! కుందనపు బొమ్మలా ఉంది! అనుకుంది దుర్గ!

"పద! పద! లోపలికి" అంటూ రాఘవ ఆ పిల్లచేయి విదిలించుకుని గదిలోకెళ్ళాడు!

ఈవిడేనే సుగుణా! మీ మామయ్యకు విడా కులిస్తున్నది!" అంటూ పరిచయం చేసింది సుజాత దుర్గను కూతురికి.

"ఈ పిల్ల నాకూతురు! నిన్ను కట్టుకోక ముందే దీన్ని కట్టుకొని ఉంటే ఈసరికి నాకు మనవడిని ఇచ్చుండేవాళ్ళు" అంది దుర్గను ద్దేశించి!

దుర్గ తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో "ఇవు డు మాత్రం మించిపోయిందేముందిలెండి మళ్ళీ సంవత్సరానికంతా మనవడు పుడతా డు" అంది రాఘవకు విన్పించేలా.

"ఇంకా ఎన్నాళ్ళుందేమిటి కోర్టు తతంగం!" అడిగిందావిడ దుర్గను.

"అబ్బే! ఎన్నాళ్ళో లేదు. సరిగ్గా ముప్పై రోజులు!" అంది దుర్గ.

"హమ్మయ్య! అయితే ఈ నెల్లాళ్ళకు మళ్ళీ ఊరువెళ్లటం ఎందుకు. ఇక్కడే ఉండిపోతే పోలా" అంది స్వగతంగా!

"నిరభ్యంతరంగా!" అంది దుర్గ నవ్వు తూ!

★ ★ ★

పదిరోజులు గడిచిపోయాయి.

రాఘవ అక్కయ్య, ఆమె కూతురు ఇంట్లో తిష్టవేశారు తప్ప కదలకపోవటంతో రాఘవకు రోజులు గడుస్తున్నకొద్ది టెన్షన్ ఎక్కువ కాసా గింది.

దుర్గతో ఏకాంతంగా మాట్లాడాలని ఎంత ప్రయత్నించినా కుదరటంలేదు. దుర్గ మాత్రం ఏ భావమూ ముఖంలో వ్యక్తం కా కుండా ప్రవర్తిస్తున్నా రాఘవ అక్కయ్యగారూ ఆమె కూతురూ ప్రవర్తించే తీరువలన అప్పుడ ప్పుడు మనసు బాధపెట్టుకోక తప్పటంలేదు.

"మామయ్యా మా ఊరొచ్చినప్పుడు నా బుగ్గ గిల్లాడు. ఆ గుర్తు ఇంకా పోలేదు చూశారా" అంటూ దుర్గకు రాఘవ ముందే బుగ్గ చూ పించిందా పిల్ల. రాఘవకు వళ్లు మండింది.

"ఇదిగో సుగుణా అట్టే వాగావంటే రైలె క్కించేస్తాను జాగ్రత్త" అన్నాడు సీరియస్‌గా.

దుర్గలేచి వంటింట్లోకెళ్లి పనిచేసు కుంటోంది. ఓ నిమిషం దుర్గ మనస్సు కలు క్కుమన్నా మళ్లీ సర్దుకుంది.

"ఏంటమ్మా! నన్ను రైలెక్కించేస్తావా? అలా గే వెళతాను. తర్వాత నువ్వు 'మళ్లీ నిన్ను చూడాలనిపిస్తోంది, నీకు నా ముద్దులు' అంటూ ఉత్తరాలు రాయనని హామీ ఇస్తేనే వెళ్తాను!"

దుర్గకు వినిపిస్తూనే ఉన్నాయి ఈ మాటల న్నీ.

"అందుకే కామోసు ఎప్పుడూ పోస్టాఫీసు పనుంది" అంటూ ఇంటినించి ఓ గంట ముందే వెళుతుంటారు అనుకుంది మన సులో!

అన్నీ సిద్ధంగా ఉంచుకుని విడాకులత తంగం మొదలుపెట్టారు. పోనిద్దూ తన కెందుకు? ఈ ఇరవైరోజులూ గడిస్తే ఎవరిదారి వాళ్లది. అనుకుని సముదాయించుకున్నా అంతర్గతంగా ఇంకా ఏదో బాధ తొలుస్తూనే ఉంది.

ఆ బాధను మరిచిపోవటానికి అర్జంటుగా పనికల్పించుకోవటమో, ఎవరితోనైనా మాటలు కలపడమో అలవాటు చేసుకుంది. ఆ ప్రయ త్నంలోనే అప్పుడు పక్కనే ఉన్న చండి గదిలో కెళ్లింది. అక్కడ మర్దిని, తన బాధ చండితోను, పార్వతమ్మ, సూరమ్మగార్లతో వెళ్లబోసుకోవటం చూసి దుర్గకు చిరాకనిపించింది.

"చూశారా బామ్మగారూ! మీ సలహా ప్ర కారం వంట నేనే చేస్తున్నానా? సాయంత్రమ య్యేసరికి ఫ్రెష్‌గా తయారయి సినిమాకు వెళదాం రమ్మంటే సినిమాకు తీసుకెళ్లారు"

"అలాగా! ఇంకేం? సినిమా బాగుందా వదినా? ఏ సినిమాకేమిటి?" అంది చండి ఆసక్తిగా.

"ఏదిసినట్టుంది! దేవదాసు సినిమాకు తీసికెళ్లారు"

"అంతమంచి సినిమాను పట్టుకుని ఏది

సినట్టుందంటావా?'' అంటూ రంగప్రవేశం చేసింది శాంతి.

''మరేనమ్మా! మీ అన్నయ్యగారిమీద కుళ్లు వట్టలేక చెప్పాను నరేనా? ఏదో కాస్త కామెడీగా, అంతో ఇంతో రొమాంటిక్‌గా ఉండే సినిమాకు తీసుకువెళతారుగదా అనుకుంటే, మొన్నామధ్య పాత దేవదాను, ఇంకోసారి చిరంజీవులు, ఇప్పుడు కొత్త దేవదాసు ఇలా చేస్తున్నారు. ఈ కక్షసాధింపు భరించలేకున్నాను బామ్మగారూ, నాకేదయినా నలహా చెప్పండి'' అంది.

నూరమ్మ బాధపడింది. నన్ను నలహా అడుగుతావేంటి తల్లీ. నాకిలాంటి బాధలేవీ పెట్టటం ఇష్టం లేకనే మావారు నన్నానుల్లో కలిసిపోయారు. ఎక్కడున్నారో కానీ, ఆ పుణ్యాత్ముడు నన్నొక్కమాట అనకుండా నంవత్సరం మాత్రం కాపురం చేసి వెళ్లారు. మా కోడలినడగండి ఏదైనా నలహా చెబుతుంది!'' అంది నూరమ్మగారు!

పార్వతమ్మకి బాగా కోపమొచ్చింది! అత్తగారిమీద.

''అవున్లెండి. మామగారు మిమ్మల్ని బాధపెట్టకపోయినా కాల్చుకుతినే కొడుకును పుట్టించి నన్నానుల్లో కలిసిపోయారు'' అంది కసిగా.

''ఇంతకూ ఆయన సన్నానుల్లో కలిసిపోవటానికి కారణమేమిటట?' దుర్గ కల్పించుకుంది ఆసక్తిగా.

''ఆ! ఏంలేదు తల్లీ నాకు చిన్నప్పటినించి ఎప్పుడు ఏది కావాలంటే అది తెచ్చిపెట్టేవారు మా నాన్నగారు. ఆ గారాబంతో సెప్టెంబరు నెలలో బొడ్డుమల్లెలు కావాలని మారాం చేశాను. ఇప్పుడయితే హైబ్రిడ్ అనీ అవనీ, ఇవనీ, అన్ని కాలాల్లోనూ పూలూ పూయిస్తున్నారు. కాయలు పండిస్తున్నారు. మా కాలంలో ఇవన్నీ లేవుగా. మల్లెలు తేలేదని అన్నంవార్చి వేడివేడి గంజి ఆయన కాళ్లమీద పోశాను. మే నెలలో చింతకాయలు తేలేదని మరుగుతున్న చారు చేతిలో పోశాను. అంతే! వెళ్లిపోయారు చెప్పకుండా''

దుర్గకు నవ్వాగలేదు. పడీపడీ నవ్వింది. అందరూ నవ్వుతున్నారు. ఎప్పట్నించి నిలబడ్డాడో రాఘవ దుర్గ నవ్వుతుంటే మంత్రించినట్లు చూస్తూ నిలబడ్డాడు. ఆమె అంతగా నవ్వటం రాఘవ చూడ్డం అరుదు.

రాఘవను గమనించిన దుర్గ ముఖంలో నవ్వు మాయమయింది. ''దుర్గా! ఈ రోజు ఆదివారం! సినిమాకెళ్లాలి. సాయంత్రం రెడీగా ఉండు'' అని చెప్పేసి వెళ్లిపోయాడు.

వాతావరణం సీరియస్‌గా అయిపోయింది కాసేపు. చంద్రి కల్పించుకుని వాతావరణాన్ని తేలికచేస్తూ ''మా బావగారికి అక్కయ్యతో సినిమాకెళ్లాలంటే మాత్రం భలే మోజు. ఏది ఎలా వున్నా'' అంది.

అందరూ మరోసారి నవ్వేశారు హాయిగా.



ఆ రోజు సాయంత్రం సినిమాకెళ్లాలనీ, అక్కడ దుర్గతో మనసువిప్పి అన్నీ చెప్పాలనీ నిర్ణయించుకున్నాడు రాఘవ. సుగుణ చెప్పినవన్నీ అబద్ధాలనీ, ఆ పిల్ల బుగ్గగిల్లింది అయిదేళ్ల వయసప్పుడనీ, తను ఉత్తరాలు రాసింది కూడా అప్పుడేనని ఆ అమ్మాయిమీద తనకె లాంటి ఉద్దేశంలేదనీ సుగుణకు చిన్నప్పటినించి అబద్ధాలు చెప్పి ఏడిపించే శాడిస్టు స్వభావముందని చెప్పి మనసులో ఉన్న భారం తగ్గించుకోవాలనుకున్నాడు.

కానీ అర్జంటుగా అయిదుగంటలకల్లా స్టేషనుకు రమ్మని దుర్గకు పోలీస్‌స్టేషనునించి కబురొచ్చింది. ఆడబందిపోట్లను పట్టుకున్నారనీ వాళ్లను కస్టడీలో ఉంచారనీ, వారికి సేఫ్టీగా లేడీపోలీసుల్ని దుర్గతోపాటు మరో అయిదారుమందిని స్టేషనుకు రప్పించారు.

రాఘవ మనసు ఉస్సురంది! ఇన్నాళ్ళుగా పోలీస్ డిపార్టుమెంటుమీద మరుగునపడిన కోపం బయటకువచ్చి తిట్టుకున్నాడు.

దుర్గ డ్రస్ వేసుకుని బయల్దేరబోతూ రాఘవ అక్కగారినుద్దేశించి "బహుశ నేను రాత్రికి రాలేకపోవచ్చు" అంటూ చెప్పి రాఘవ వైపు చూసి "ఐయామ్ సారీ" అనేసి వెళ్ళిపోయింది.

రాఘవ అలాగే చూస్తుండిపోయాడు. రాఘవ అక్క రాఘవ దగ్గరికొచ్చి "ఇదేంట్రా రాఘవా! రాత్రికింటికి రానంటోంది. స్టేషన్‌లోనే పడుకుంటుందా?" అంది దీర్ఘాలు తీస్తూ.

"అవునేమో! నాకు తెలీదు" అన్నాడు.

"ఇంకా స్టేషన్‌లో యస్.ఐ.లు, సి.ఐ.లు మగాళ్ళుంటారుకదా!"

"అవును" అన్నాడు విసుగ్గా.

"పోలీసోళ్ళు జైల్లో పెట్టిన ఆడాళ్లనే రేప్‌చేసి బ్రష్టుపట్టిస్తున్నారు. ఈవిడగారు ఇన్నాళ్లుగా ఉద్యోగం వెలగబెడుతోంది. ఇంకా ఏ పాపమూ ఎరగకుండా ఉంటుందంటే నేన్నమ్మను బాబూ?" అంది.

"చాల్లే... ఊరుకో అక్కయ్యా!" కోపంగా అన్నాడు.

"నోరుముయ్యరా, దద్దమ్మనుచేసి అది ఆడించినట్లంతా ఆడుతున్నావు. పోలీసుజాతి పవిత్రంగా ఉంటుందంటే నేను నమ్మను. నేనే కాదు పసిపిల్లాడినడిగినా చెబుతాడు" అంది చీత్కారంగా.

"ఛ! ఈవిడ కొంపవదిలి ఎప్పుడుపోతుందో" అని లోలోపలే తిట్టుకున్నాడు.

రాత్రి పది దాటింది. అంతా నిద్రపోతున్నారుగానీ రాఘవకు నిద్రపట్టలేదు. వెంటనే వెళ్లి దుర్గను చూడాలనిపిస్తోంది. అనుకున్నదే తడవుగా శబ్దంచేయకుండా స్కూటరు కాంపౌండ్ దాటించి స్టార్టుచేసి పోలీస్‌స్టేషనుకు వెళ్లాడు.

దూరంగా స్కూటరు పార్కుచేసి స్టేషను వైపు చూస్తూ నిలుచున్నాడు. దాదాపు యాభై మందిదాకా పోలీసులు ఆడ, మగా కలిసి ఇంచుమించు వహారాకాస్తున్నవిధంగా నిల్చుని ఉన్నారు. అప్పుడప్పుడు ఫోన్‌లో మాట్లాడుతున్నారు. ఇంతలో పోలీసుజీపు వచ్చి ఆగింది. అందులోనించి మరికొంత మంది పోలీసులు దిగారు. స్టేషనులోంచి ఎవరో పడిపోయిన వ్యక్తిని జీపులో ఎక్కించి మళ్లీ జీపు స్టార్టుచేసుకుని వెళ్లిపోయారు.

దూరంనించి చూస్తున్న రాఘవకు దుర్గను గుర్తుపట్టటం కష్టమనిపించింది. లాభంలేదనుకుని వెనుదిరిగాడు.

ఇల్లు దగ్గర పడుతుండగా నరసింహరాజు అనే తెలిసిన కానిస్టేబుల్ ఎదురయ్యాడు రాఘవకు! తను పలకరించేలోగానే "ఏంటి బావగారూ! అక్కయ్యగారు ఇంట్లో లేకపోయేసరికి అర్ధరాత్రి బయటకొచ్చేశారు. ఏంటి కథ స్టేషన్‌కెళ్లి అక్కయ్యకు చెప్పేస్తాను జాగ్రత్త" అన్నాడు నవ్వుతూ.

"అది సరే, మీరేమిటి ఈ టైంలో ఎక్కడికెళుతున్నా"రంటూ అడిగాడు రాఘవ."పక్కవీధిలోనున్న కానిస్టేబుల్ కోకిలమ్మను డ్యూటీ ఉంది రమ్మని చెప్పటానికెళ్లాను. కానీ ఆమెకప్పుడే తెలిసి స్టేషన్‌కెళ్లిపోయిందిట. నేనిప్పుడు స్టేషనుకెళ్లి చీవాట్లుతినాలి లేటుగా వెళుతున్నందుకు" అన్నాడు.

"అవునూ! బందిపోట్లకు కాపలా ఆడాళ్లుంటారుటయ్యా! మగాళ్లేమయ్యారు?" అన్నాడు రాఘవ.

"మగాళ్లకయితే మగాళ్లే ఉంటారు కాపలాగా! ఆడాళ్లు కూడా ఉన్నందువల్ల తోడుగా ఆడాళ్లుండాలి తప్పదు! ఇంతకీ మీ నసఏంటి! మా అక్కయ్యగారు లేనిది నిద్రపట్టని అవస్థా ఇదంతా! పోలీసోళ్లను కట్టుకున్నాక ఈమాత్రం తప్పదుమరి! మేం పడటంలా బాధలు. వస్తానండోయ్" అంటూ వెళ్లిపోయాడు.

నిజంగానే ఆ రాత్రంతా రాఘవకు నిద్రపట్టలేదు. తెల్లవారుజామున కలతనిద్ర పట్టింది. నిద్రలో ఏవేవో పలవరింతలు, కలలు! దుర్గను తననించి దూరంగా ఏవరో లాక్కుపోతున్నట్టు, తను కేకలు పెడుతున్నట్టు.

ఉలిక్కిపడి లేచాడు టైం ఆరుదాటింది. చలికాలం కావటంతో ఇంకా ఎవరూ నిద్రలేవలేదు.



రాఘవ లేచి గబగబ మొహం కడుక్కుని స్కూటర్‌మీద స్టేషనుకు బయల్దేరాడు. అక్కడ స్టేషన్‌లో పరిస్థితి—చూస్తే రాఘవకు గుండె జారినట్లయింది. ఊరి జనమంతా స్టేషన్ దగ్గరే గుమిగూడి ఉన్నారు. రాత్రి రెండు గంటల ప్రాంతంలో పోలీస్‌స్టేషనుపై బందిపోట్ల మిత్రబృందం కాల్పులు జరిపి నానాభీభత్సం చేశారుట. ఇద్దరు పోలీసులు చనిపోయారు. తూటాలు శరీరంలోకి దూసుకుపోయి రక్తం స్రవిస్తూ స్పృహతప్పిన వారిని అంబులెన్స్‌లోకి చేరవేస్తున్నారు. ఒకవైపు ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీస్తున్నారు. విలేఖర్లు రాసుకుంటున్నారు ప్రశ్నలేస్తూ.

రాఘవకు ఒకవైపు కంగారు, మరోవైపు దుఃఖం ముంచుకొస్తున్నాయి. జనాన్ని తప్పించుకుని స్టేషనులోకెళ్లాడు. తనకు పరిచయమున్న ముఖాలు కనిపించలేదు. "సార్! దుర్గ అనే యస్.ఐ. ఎక్కడుంది ప్లీజ్... చెప్పండి" అంటూ వాళ్లచుట్టూ దాదాపు వదిహేను నిమిషాలు తిరిగాడు. మాకు తెలియదన్నారు. ఇక్కడ చూసుకుని, లేకపోతే హాస్పిటల్‌కి వెళ్లి చూసుకోండి" అన్నాడొకడు.



మా బొచ్చుకుక్క కనిపించలేదనో, కోడిని దొంగలెత్తుకెళ్ళారనో పోలీస్ రిపోర్టు ఇస్తే తేలిగ్గా ఇచ్చే సమాధానంలాగా ఉందది. వీళ్ల జీవితాలే కత్తిమీద సాములాంటివి! యుద్ధంలో పక్కవాడి శవాన్ని చూడటంకంటే ఎదురుగా వస్తున్న శత్రువును ఎదుర్కొనటమే ముఖ్యంగా వృత్తిధర్మాన్ని నేర్చుకొన్నవారు! వాళ్లకిప్పుడు ఈ చనిపోయిన మనుమలకంటే, మళ్లీ ఏదైనా దారుణం జరిగి మరికొంతమంది బలికాకుండా ఎలా అడ్డుకోవాలనేదే ముఖ్యం. అంత టెన్షన్లో ఉన్నవాళ్లు ఇలాకాక ఇంకెలా మాట్లాడుతారు?'' అనుకున్నాడు రాఘవ.

మరుక్షణం హాస్పిటల్‌కు పరిగెత్తాడు.

గేట్లోనే తెలిసిన పోలీసాఫీసర్ కనిపించాడు. ''సార్! మా దుర్గ'' అంటూ ఏడ్చేశాడు రాఘవ బేలగా.

''అయ్యో! బావగారూ! అదేటంలా బెంబేలు పడతారు. మా చెల్లికేం ఫర్వాలేదు. భుజానికి రెండు తూటాలు గుచ్చుకున్నాయిట. ఆపరేషను చేస్తున్నారు. కంగారు పడకండి'' అంటూ వెళ్లిపోయాడు.

రాఘవకు కాళ్లు చేతులు వణుకుతున్నాయి. ఆపరేషను చేసినవారందనీ బెడ్‌మీదకు చేరుస్తున్నారు. దుర్గను కూడా తీసుకువచ్చారు. కానీ ఆ గదిలోకెవర్నీ రానివ్వటంలేదు. అద్దాల్లోంచి చూడనిచ్చారు. దుర్గ తలకు చేతులకు పూర్తిగా బ్యాండేజి వేశారు. రక్తం ఉన్న బాటిల్ స్టాండుకు వేలాడుతోంది. ఆక్సిజన్ సిలిండర్ పక్కనే ఉంది. ముక్కునించి ట్యూబులు అమర్చారు. ఆ గదిలోనివారంతా ఇంచుమించు అదే పరిస్థితిలో ఉన్నారు.

వారి వారి బంధువులు అద్దాల్లోంచి చూస్తూ శోకాలు పెడుతున్నారు. హాస్పిటల్ సిబ్బంది అందర్నీ కసురుతూ బయటకు పంపించేస్తున్నారు. రాఘవ వచ్చి వరండాలో బెంచీమీద కూలబడ్డాడు. అతనిలోని శక్తి అంతా హరించుకుపోయి అరవైఏళ్ల వృద్ధాప్యంమీద పడినవాడిలా అయిపోయాడు ఈ కొద్దిగంటల్లోనే!

శ్రీశైలం, చండి, ఆయా, పార్వతమ్మ మొత్తం కాంపౌండులోని పరివారమంతా హాస్పిటల్‌కి వచ్చేశారు శోకాలు పెడుతూ! ఒక్కొక్కరే వెళ్లి దుర్గను చూసివచ్చారు. ఆయా దుర్గనాపరిస్థితిలో చూసి నేలమీద విరుచుకుపడిపోయి ఏడ్వసాగింది. ''తల్లీ! దుర్గమ్మా! నీకెంత ఆపద వచ్చింది తల్లీ'' అంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న ఆయాను చూసి ఈ మునలిప్రాణానికి ఆ దుర్గకు ఏ జన్మలోనో విడదీయరానిబంధం ఉండివుంటుంది అనుకున్నాడు రాఘవ.

ఆయాను ఓదార్చుతుండగానే శ్రీశైలం చొరవగా డాక్టర్ల దగ్గరకు దూసుకెళ్లి వివరాలన్నీ కనుక్కునివచ్చాడు. ''తూటాల దెబ్బలవల్ల దుర్గకు రక్తం చాలా పోయిందిట. షాక్‌వల్ల అబార్షన్ అయిందిట. రేపు సాయంకాలంవరకు స్పృహలోకి రాదుట! స్పృహలోకొస్తే తప్ప మనల్ని ఆ గదిలోకి అడ్మిట్ చెయ్యరుట'' అంటూ చెప్పాడు శ్రీశైలం.

''అబార్షన్ అయ్యిందా?'' రాఘవ మనసు బాధతో కుంచించుకుపోయింది.

దుర్గ గర్భవతి అన్న విషయం తనకింతవరకు తెలియదే!

ఆయావైపు చూశాడు రాఘవ.

బాధగా చూసింది ఆయా.

''నేను మీకేం ద్రోహం చేశాను? ఒక్కమాట కూడా నాతో చెప్పలేదు'' అన్నట్లున్న అతని ముఖంలోని భావాలు చదువుకుని ముఖం కప్పుకుని రోదించింది ఆయా.

కళ్లతోనే మాట్లాడుకుని సముదాయించుకున్నారంతా! శాంతమ్మగారికి అప్పుడే తెలిసిందేమో ఏడుస్తూ వచ్చింది కూతుర్ని చూడ్డానికి.

రాఘవ అక్క సుజాత సుగుణతోసహా ఊరెళ్లిపోయింది, భర్తనించి టెలిగ్రాం రావటంతో.

★ ★ ★

మరునటి రోజు దుర్గ స్పృహలోకి వచ్చినా ''చాలా నీరసంగా ఉంది. మాట్లాడించకూడదు. డిస్టర్బ్ చేయకూడదు. అసలింకా ఆమె ఎవర్నీ గుర్తు పట్టేస్థితిలో లేద''ంటూ డాక్టర్లు, దుర్గను చూడటానికి ససేమిరా ఒప్పుకోలేదు.

అలాగే ఇదిగో రేపు, అదిగో రేపు అంటూనే వారం రోజులు గడిచిపోయాయి. మిగతా వారంతా రోజుకోసారి వచ్చి చూసి పోతున్నా

దుర్గ తల్లి శాంతమ్మగారు, చండి, శ్రీశైలం, రాఘవ మాత్రం హాస్పిటల్‌ను వదలలేదు. అప్పటికే పది రోజులయింది దుర్గ హాస్పిటల్‌లో జాయినయి.

రాఘవ దగ్గరికి సర్కిల్ ఇన్‌స్పెక్టరు ప్రసాద్ వచ్చి "ఏమిటి బావగారూ! మా చెల్లికన్నా మీరే పెద్ద పేషెంటులా తయారయ్యారే! గెడ్డం పెరిగి, ముఖం పీక్కుపోయి... ఛ... ఛ... మీరు మరీ ఇంత బెంబేలు పడిపోయే మనిషనుకోలేదు సుమా! అవునూ మీకు చిత్తూరుకు ట్రాన్స్‌ఫర్ అయిందా?" అనడిగాడు.

"అబ్బే! లేదే! ఎందుకలా అడిగారు?" అన్నాడు రాఘవ.

"ఏం లేదు... మా చెల్లి చిత్తూరుకు ట్రాన్స్‌ఫర్‌కు అప్లై చేసింది! ఈ రోజు ఆర్డర్స్ వచ్చాయి. మీకు చిత్తూరుకు ట్రాన్స్‌ఫర్ అయిందేమో భార్యాభర్తలిద్దరూ ఒకే చోట ఉండచ్చని అర్జీపెట్టుకుందేమో అనుకున్నాం. మరి ట్రాన్స్‌ఫర్ ఎందుకు చేయించుకున్నట్టు?" అనడిగాడు సందేహంగా ప్రసాద్.

రాఘవ మొహం నల్లగా అయిపోయింది. అతనికే సమాధానం చెప్పాలో అర్థంకాక తికమకపడ్డాడు.

శ్రీశైలం, చండి మొహాలు చూసుకున్నారు. శాంతమ్మ కన్నీళ్లు చీర చెంగుతో వత్తుకుంది.

సిస్టర్ వచ్చి "దుర్గతో మీరు మాట్లాడవచ్చు. ఓ పదినిముషాలకన్నా ఎక్కువసేపు మాట్లాడకూడదని డాక్టరుగారు చెప్పారు" అంటూ వెళ్లిపోయింది.

ఆత్రుతగా శాంతమ్మ శ్రీశైలం, ఛండి వెళ్లారు! రాఘవ మాత్రం నిర్లిప్తంగా అలాగే కూర్చున్నాడు. అతనికెందుకో భోరున ఏడవాలనిపిస్తోంది. కానీ ఏడుపురావటం లేదు. ఎవరి మీదనైనా కసి తీర్చుకోవాలనిపిస్తోంది. తనంత ఒంటరివాడు ఈ ప్రపంచంలో ఎవ్వరూ లేరనిపిస్తోంది. ఇక దుర్గ ఇకపైనుంచి తనకేమీ కాదు. అసలామె ఈ ఊళ్లోనే ఉండదు. తనకిక కనిపించదు. స్టేజీమీద నాటకం ముగిసినట్టు తమ వంతు పాత్ర అయిపోయింది. ఇక ఎవరి దారి వారిది.

ఒకదానికొకటి పొంతనలేని ఆలోచనలు పిచ్చిపిచ్చిగా మనసులో ముసురుకుంటుంటే అలాగే కూర్చున్నాడు రాఘవ.

★ ★ ★

దుర్గతో మాట్లాడవచ్చు అని నర్సు వచ్చి మళ్లీ చెప్పటంతో ఆలోచనల్లోంచి బయటపడ్డాడు రాఘవ! చండి, శ్రీశైలం, దుర్గ తల్లి శాంతమ్మ, సూరమ్మగారూ మొత్తం పరివారమంతా అప్పటికే దుర్గవద్ద వున్నారు. అంతదాకా ఆమెను గురించి, ఆమె ఆరోగ్యం గురించి, ఆమెతో తన జీవితం గురించి ఆలోచిస్తూ బాధపడిన రాఘవ ఆమెను చూడ్డానికి వెళ్లి ఆమెకు ఎదురుగా ఉండి చూడాలన్నా మాట్లాడాలన్నా మొహమాటంగా, సిగ్గుగానూ అనిపించసాగింది. కాసేపు దూరంగానే వుండి బయటకు వచ్చేశాడు. దుర్గ ఆరోగ్యం మెరుగయిందన్న ఆలోచన రాఘవకు చాలా రిలీఫ్‌నిచ్చింది. ఇన్నిరోజులు పడ్డ టెన్షన్ అంతా గాలికెగిరిపోయినట్టయింది! ఇంటికి వచ్చి స్నానం చేసి పడుకున్నాడు. ఓ గంట తర్వాత హాస్పిటల్‌నించి అంతా వచ్చారు ఒక్క శాంతమ్మగారు తప్ప!

"అదేమిటి! మీరు వదినగారిని చూట్టానికి రాకుండా ఇటునించి ఇటేవచ్చారు! ఆవిడ మీరెక్కడికెళ్ళారని అడిగింది కూడా!" శ్రీశైలం అన్నాడు!

"కాస్త తలనెప్పిగా ఉంటేనూ..." నసిగాడు.

చండితోసహా మిగతావారంతా రాఘవమీద కోపంగా ఉన్నట్టు వాళ్ళ ముఖాల్లో అప్రసన్నత చెబుతోంది! రాఘవకు వెళ్ళాలనిపించినా ఎందుకో వెళ్ళలేకపోతున్నాడు. సాయంకాలం శాంతమ్మగారు ఇంటికి వచ్చేసింది! శ్రీశైలం కంగారుపడిపోయి "అదేంటి మీరూ వచ్చేశారు వదినగారి దగ్గరెవరున్నారు? ఆవిడకేమయినా అవసరమయితే మనిషి తోడులేకుంటే ఎలా?"

"నాకు ఉదయంనించి హాస్పిటల్ వాసనకు కడుపులో వికారంగా ఉంది బాబూ! సిస్టర్లు చూసుకుంటార్లెండి" అందావిడ.

"చండీ! రెడీఅవు. హాస్పిటల్‌కు వెళదాం. ఈ రాత్రికి అక్కడే పడుకుందువుగానీ మీ అక్కకు తోడుగా!" అన్నాడు శ్రీశైలం!

"నాకు ఉదయంనించి వంట్లో బాగా

లేదండీ! నే వెళ్ళలేను. ఆయా! మీరెళ్లి పడుకో రాదూ'' అంది!

''నాకూ దుర్గమ్మకు తోడుండాలనె ఉంది! కానీ చంటివెధవకు ఒంట్లో బాగోలేదు! నే లేకుంటే అస్సలు నిద్రపోడు!'' అంది ఆయా! అందరూ నీవంటే నీవని మాట్లాడుకుంటుంటే రాఘవకు ఇహ తాళలేనట్లు ''మీరెవరూ వెళ్ళక్కర్లేదు! నేను వెళతాను!'' అనేసి గబగబ స్కూటర్‌తీసుకుని వెళ్ళాడు!

హాస్పిటల్‌నించి ఆ తరువాత మూడురోజులకు దుర్గను డిశ్చార్జి చేయించి ఇంటికి తీసుకువచ్చాడు రాఘవ! ఈ మూడు రోజులూ హాస్పిటల్ ఛాయలకు ఎవ్వరూ రాలేదు! నిశ్శబ్దంగా రాఘవతో సేవలు చేయించుకోక తప్పలేదు దుర్గకు. అవును, కాదు, కావాలి, వద్దు లాంటి పొడి మాటలు తప్ప దుర్గ మాట్లాడలేదు! రాఘవ అంత దగ్గరగా ఉంటూ తనకు సేవలు చెయ్యటం కలలోలాగానూ, వింతగానూ, ఇష్టంగాకూడా ఉంది!

'జరిగితే రోగమంత భోగం లేదం'టారు ఇదేనేమో అనుకుని నవ్వుకుంది కూడా! విచిత్రంగా ఆ మూడురోజులూ ఇక దేన్నిగురించి కూడా ఆలోచించలేదు! కానీ ఇంటికి రాగానే వాతావరణం మారిపోయినట్టయింది! ఇద్దరికీ నిస్పృహ ఆవరించింది! ఎవరికో భయపడి బతుకుతున్నట్టయింది ఇద్దరి పరిస్థితి!

ఆ మరునటివారం దుర్గ కోలుకుని లేచి తిరగడం ప్రారంభించింది.

''సార్! కోర్టు గుమాస్తానొచ్చాను
సార్! కోర్టు గుమాస్తానొచ్చాను
సార్! కోర్టు గుమాస్తానొచ్చాను''

గుమ్మంముందు కాకిలా అరుస్తున్న కోర్టు



గుమాస్తా దగ్గరికి దుర్గ, రాఘవ వచ్చారు! సంతకం చేశారు!

"సార్ ఈ రోజుతో నా డ్యూటీ అయిపోయింది! మీరు ఇద్దరూ కలిసి రేపు సాయంత్రం అయిదు గంటలలోగా జడ్జి దగ్గర హాజరు కావాలట! ఇద్దరూ తప్పని సరిగా కలిసి రావాలట! ఏ ఒక్కరు రాకపోయినా, అయిదు గంటలుదాటాక వచ్చినా విడాకులు మంజూరు చెయ్యరట! ఇవిగోండి విడాకులకు సంబంధించిన కాగితాలు ఇవి తీసుకుని రావాలట! ఆయాగారూ! రేపు వీరిద్దరూ మరిచిపోతారేమో గుర్తుచేసి పంపాలట!" అన్నాడు కోర్టు గుమాస్తా. వింటున్న సూరమ్మగారికి వళ్ళు మండి "చూడు బాబూ! నువ్వు 'ట' బాష మానేసి దయచెయ్యి! వినలేక చస్తున్నాం"

'మందర'లాంటి ఆయా ఉంది. నిక్షేపంగా కోర్టుకు హాజరుపరుస్తుంది వారిద్దరినీ" ఇక నీవెళ్లు. అంది కోపంగా!

"ఏంటండీ! ఆపోలిక!" అంటూ గయ్యిన లేచింది ఆయా!

"మందర కైకేయి అంటూ నోటికొచ్చినట్టు మాట్లాడితే ఊరుకునేది లేదు" అంది ఆయా

"చూడు తల్లీ! నిన్ను మందర అనటంలేదు! 'మధర్‌థెరిస్సా'లాంటి దానివంటున్నాను నీ చెముడుతో చంపేస్తున్నావు" అంది సూరమ్మ.

"అలాగా! మరి చెప్పవేం! చూశావా మర్దినీ! వాళ్లాయనకు ముందర వళ్ళూడగొట్టి నన్నాను ల్లోకి తరిమేసింది ఈవిడేనట! ఇన్నాళ్ళకు రహస్యం బయటపడింది!" అంది చెముడు నటిస్తూ.

జుట్టు పీక్కున్నంత పనయింది సూరమ్మకు.

ఆరాత్రంతా రాఘవ, దుర్గ నిద్రపోలేదు! ఎవరి ఆలోచనల్లో వారు ఉండిపోయారు!

ఎవరి మట్టుకు వారు కోర్టుకు వెళ్ళకూడదనుకున్నారు! కోర్టుకు వెళ్ళటం విడాకులు తీసికోవటం ఇద్దరికీ ఇష్టం లేదు! కానీ దుర్గ వెళుతుందేమో తనకు తప్పనిసరిగా విడాకులు కావాలి అని పట్టుబడుతుందేమో! నిజంగా అలా జరిగితే తను నోరు మూసుకుని విడాకులు తీసికోవాల్సిందేనా? లేదు లేదు! "నాకు విడాకులు వద్దు! యస్.ఐ. దుర్గతో నేను మన స్ఫూర్తిగా కాపురంచేస్తాను!" అని జడ్జితో చెప్పాలి! చెబుతాను. దుర్గ అంత పరిస్థితి రాకుండా చేస్తే బాగుండు!' రాఘవ ఆలోచనలు ఇలా సాగుతూంటే దుర్గ ఆలోచనలు మరోలా ఉన్నాయి!

ఎలాగూ ఓ సంవత్సరం కాపురం చేశాము అడపాదడపా వశపరచుకుని కడుపు కూడా చేశాడు. దీనిపొగరణచాలి అనుకుని అక్క కూతుర్ని పెళ్ళిచేసుకుంటాడేమో! ఛ! ఛ! తను అలాంటి మనిషి కాడు! హాస్పిటల్‌లోనే తెలిసిపోయింది ఆయన మనస్తత్వం! నన్ను విడిచిపోరు! కానీ "ఉద్యోగానికి రిజైన్ చెయ్యి" అంటూ కథ మళ్ళీ మొదటికి తెస్తారేమో!

పోనీద్దూ! చేసేస్తాను! ఎందుకొచ్చిన ఉద్యోగం! ప్చ్! ఉద్యోగానికిరిజైన్ చెయ్యడమంటే బాధనిపిస్తోంది! ఆయన ఆ మాట అనకుండా ఉంటే బావుంటుంది! మరుసటిరోజు ఉదయంవరకు ఇద్దరి ఆలోచనలు దారీ తెన్నూ లేకుండా సాగిపోతున్నాయి!

"ఏంటి దుర్గమ్మా! కోర్టు గుమాస్తా చెప్పింది విన్నావుగా! త్వరగా రెడీ అయిపోతే మిమ్మల్ని కోర్టుకు తీసికెళతాను! ఈరోజుతోనా డ్యూటీ అయిపోతుంది బాబూ" అంది ఆయా కష్టపడిపోతున్నట్టు!

"నాకు గుర్తుందిలే ఆయా! నసపెట్టక! అసలే ఈరోజు ఉదయంనించి నీరసంగా ఉంది" అంటూ భోంచేసి పడుకుంది దుర్గ! పిచ్చికోపం వస్తోంది ఆయామీద దుర్గకు.

"ఏంటండీ రాఘవగారూ! సాయంకాలం అయిదులోగా కోర్టుకు వెళ్ళాలి! తయారవుతున్నారా!" అంటూ అరగంటకోసారి గుర్తుచేస్తోంది ఆయా!

పీక పిసికెయ్యాలనిపించింది రాఘవకు!

తమాయించుకుని "చూడండి! మీరంతగా గుర్తు చేయక్కర్లేదు! మాకు కోర్టుకు వెళ్ళే దారి తెలుసు! మీరు ముందుగా వెళ్ళండి! సాయంత్రం అయిదులోగా కోర్టు దగ్గర కొస్తాము సరేనా!" అని చెప్పి మరో మాటకు అవకాశం ఇవ్వకుండా గదిలోకెళ్ళి తలుపేసుకున్నాడు రాఘవే!

నాలుగిళ్ళల్లో ఉన్న గోడగడియారాలు, తమను మింగేసేలాగా చూస్తున్న కళ్ళను చూసి తెగ తిట్టుకున్నాయి. సాయంత్రం అయిదు గంటల అయిదు నిమిషాలకు రాఘవ గది తలుపు తీసుకుని బయటకు వచ్చాడు. ఒక్కసారి వళ్ళు విరుచుకుని గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు.

''దుర్గా! కాఫీ వట్రా'' అంటూ కేకెయ్యాలనుకుని వెనక్కు తిరిగాడు. కాఫీ కప్పుతో చిరునవ్వు నవ్వుతూ నిలబడి ఉంది దుర్గ రాఘవనే చూస్తూ!

మనోహరంగా ఉన్న ఆ దృశ్యాన్ని చూసిన గిన్నీస్‌బుక్ పరివారం 'హమ్మయ్య' అంటూ గాలిపీల్చారు!

★ ★ ★

''ఏమిటండీ నాన్నగారూ! ఇదంతా! ఎప్పుడూ నిదానంగా నిశ్శబ్దంగా ఉండే మీరు ఇంత హైరాణపడ్డారంటే నమ్మశక్యం కావటంలేదు. అమ్మ చనిపోవటంతో మీ జీవితం 'ట్రాజెడీ' అయింది కదా! మరి మీరు ఈ నవలను సుఖాంతం చేశారేమిటి?'' అంది పరిమళ తండ్రితో!

''మీ అమ్మతో కలిసి కాపురంచేసింది పదేళ్ళే అయినా అనుభవాలు అనుభూతులు జీవితానికి సరిపడా మిగిల్చి వెళ్ళిందమ్మా! మానసికంగా మీ అమ్మ చనిపోలేదు. నా హృదయంలో జీవించే ఉంది! దుఃఖాంతం ఎలా చెయ్యను తల్లీ!'' ఎదిగిన కూతురితో ఈ మాటలు అనలేక చిరునవ్వే సమాధానంగా ఇచ్చారు!

ఇంతకీ ఆ కథలో లోపాలుంటే చెప్పమ్మా! సరిచేద్దాం! అన్నారు రాఘవయ్యగారు!

''నా ప్రశ్నలకు సమాధానం చెబితేగా మీరు అంది'' పరిమళ.

'' అలాగే చెబుతాను! ఒక పాఠకుడుగానీ, ఒక ప్రేక్షకుడు కానీ అది కథ అయినా, సినిమా అయినా అంతర్గతంగా తనకు తెలియకుండానే సుఖాంతంకోసం నిరీక్షిస్తుంటాడు. చదివినంత సేపు చదివి పూర్తవగానే బరువుగా నిట్టూరుస్తూ పుస్తకం మూసేయాల్సివస్తే నవల ప్రభావంవల్ల పాఠకుడు అశాంతికి లోనవుతాడు! ఇంకో పుస్తకం తెరవటానికి జంకుతాడు కూడా! అందుకే సుఖాంతం చేశానమ్మా!'' రాఘవయ్య కూతురి కర్థమయ్యేలా వివరించారు!

''అది సరే! పోలీస్‌డిపార్టుమెంటంటే అలర్జీ అని రాసుకున్నారు. కొన్ని సంఘటనలకే ఒక్క సంవత్సరం కాలానికే మీకు అపోహలు పోయి అవగాహన కుదిరిందా? లేక అమ్మను కావాలనుకున్నారు కాబట్టి ఆ డిపార్టుమెంటు మీద ఇష్టం పెంచుకున్నారా?'' ప్రధాన మంత్రిని పత్రికా విలేఖరి అడిగినట్టుగా జంకు లేకుండా అడుగుతున్న కూతుర్ని చూసి ముచ్చటేసింది రాఘవయ్యగారికి! కాస్త సిగ్గుపడ్డారు కూడా ఆ ప్రశ్నకు!

''జబ్బు నయం కావాలంటే చేదుమందు మింగాలి! అంటే ముందు చేదును ఇష్టపడాలి! అపుడే మందు పనిచేస్తుంది!'' అనేది మీ అమ్మ! ఏ విషయాన్ని అయినా అపోహలు పెంచుకుని వక్రమార్గంలో ఆలోచించకూడదు! సక్రమమార్గంలో ఆలోచించాలి! మంచి చెడులన్నవి ప్రతి డిపార్టుమెంటులోనూ ఉన్నాయి! రిస్కులు, టెన్షన్‌లు ప్రతి ఉద్యోగంలోనూ ఉన్నాయి! ఎక్కడో ఏదో చిన్న సంఘటన జరిగితే మొత్తం డిపార్టుమెంటునే అసహ్యించుకుని వెలివేసినట్లు మాట్లాడ్డం, ప్రవర్తించటం,ఇతరుల్ని ముఖ్యంగా వృత్తిని గౌరవించే మీ అమ్మలాంటి వారిని కించపరచటం తప్పని తెలుసుకున్నాను! ఇంకో విషయం ఏమిటంటే స్త్రీలు ఫలానా ఉద్యోగానికే పరిమితులు అన్న 'కొటేషను' కొట్టివేసుకున్నాను మనసులో! అందుకే పోలీసుడిపార్టుమెంటులో చేరమని మీయిద్దర్ని ప్రోత్సహించాను!'' అన్నారు రాఘవయ్యగారు!

''ఇప్పటికైనా ఆ 'లారీ'గారి సంబంధం ఒప్పుకో తల్లీ ప్రాబ్లం సాల్వ్ అవుతుంది!'' అంది పరిమళ.

చిర్రు బుర్రులాడకుండా ముఖం ప్రసన్నంగా పెట్టింది సుధ.

కూతుళ్ళిద్దర్ని కళ్ళనిండుగా చూసుకుని మురిసిపోయారు రాఘవయ్యగారు!

★

# విచిత్ర ప్రపంచం

## వేడినీళ్ల జలపాతం

**అ**ల్జీరియాకి ఉత్తర ప్రాంతంలో 'కెమ్లా' అనే గ్రామానికి చేరువలో ఒక 'వేడినీళ్ల జలపాతం' ఇప్పటికీ పర్యాటకులను విశేషంగా ఆకట్టుకుంటోంది. దానిపేరు హమామ్మెస్కోటిన్. ఈ వింతైన పేరు వెనక ఓ కథ కూడా వున్నట్టు తెలుస్తోంది. 'హమామ్ మస్కోటిన్' అనేది ఒక అరబిక్ పదం. ఆ భాషలో దీనర్థం 'కఠిన శిక్షలువడే నేరస్థుల స్నాన ప్రదేశం' అని. ఈ పేరు రావడానికున్న కథని అక్కడి గ్రామస్థులు ఈవిధంగా చెబుతారు. ఎప్పుడో శతాబ్దాలకి పూర్వం ఓ యువకుడు తన స్వంత చెల్లెలిని వివాహమాడి ఈ ప్రాంతంమీదుగా బంధుబలగంతో ఊరేగుతూ వస్తున్నాడు. ఊరేగింపు ఈ ప్రాంతానికి చేరుకోగానే ఆకాశంలో హటాత్తుగా కారుమబ్బులు కమ్ముకుని, ప్రచండవేగంతో గాలి వీచనారంభించింది. ఈ తుఫాను అంతకంతకి ఉధృతమై పెళ్లిగుంపులో చాలా మందిని నిర్దాక్షిణ్యంగా బలి తీసుకుంది. పైగా చనిపోయినవారి శరీరాలన్నీ శిలలుగా మారనారంభించాయి. అంతలో ఆకాశంనుంచి ఓ గొంతు గర్జించింది. 'ఇది ఒక అన్న తన చెల్లెలినే పెళ్లి చేసుకున్నందుకు శిక్ష' అంటూ. ఆ మనిషెత్తురాళ్లమీదనుంచి ప్రవహించే నీరు వేడిగా వుండటమే కాకుండా విభిన్న వర్ణాల్లో, విభిన్న పరిమాణాల్లో కనిపిస్తూ వుంటాయి ఈ శిలలు.

ఈ రాళ్లమీంచి ప్రవహించే నీరు భూమిలో అట్టడుగున ఒక ప్రత్యేకస్థానంలో పుట్టి, విపరీ



తమైన ఉష్ణోగ్రతను కలిగివుంటుంది. అంటే ఆ నీరు పుట్టినచోట ఉష్ణోగ్రత అధికంగా వుంటుందని శాస్త్రజ్ఞుల అంచనా.

ఈ నీటిలో ఎన్నో రోగాలను నయంచేసే గుణముందని వైద్యులంటున్నారు. ఈ నీళ్లు సెగలు కక్కుతూ బయటకు వచ్చిన కాసేపటి కి ఆవిరిగా మారిపోతాయి.

వచ్చిన యాత్రికులు ఈ వేడినీటిలో బియ్యం, కూరగాయలు ఉడికించుకుని **భోజనం చేస్తారు. కాఫీ, టీలు కూడా తయారు చేసుకుంటారు.**

## అభ్యాస బలం

కర్నాటకలోని ఓ మారుమూల కుగ్రామంలో ఎల్లప్ప, తిమ్మమ్మ దంపతులకు పుట్టిన వెంకటసామయ్య తన అవిటితనాన్ని చూసి ఎప్పుడూ దిగులుపడలేదు. జ్ఞానం వచ్చినప్పటి





నుంచీ తన బతుకు గడవడానికి తనే స్వయంగా కష్టపడటం ప్రారంభించాడు. కాళ్లూ చేతులూ పుల్లల్లా వుండి, వంకర్లుపోయినా మామూలు బలిష్టుడైన వ్యక్తి చేయలేని పనుల ను కూడా చాకచక్యంగా, అతినేర్పుగా చేయసా గాడు వెంకటసామయ్య. ఇతని ప్రధానవృత్తి టైలరింగ్. బహుశా ఈ వృత్తినెన్నుకున్న అవిటి వాళ్లలో వెంటకసామయ్యే ప్రథముడు కావచ్చు. కాలివేళ్లతో అవలీలగా సూదిలోకి దారమెక్కించే వెంకటసామయ్యను చూస్తే తప్పకుండా అతడు గిన్నీస్ బుక్‌లో కెక్కగలడని పిస్తుంది.

ఆ గ్రామంలో వున్న ఒకేఒక్క టైలరు లక్ష్మన్న వెంకటసామయ్యలోని సామర్థ్యాన్ని ఉత్సాహాన్నీ చూసి బట్టలు కత్తిరించడం, రక

రకాల ఫ్యాషన్లలో కుట్టడం శ్రద్ధగా నేర్పాడు అతనికి. కాళ్ళతోనే బట్టలు కత్తిరించడం, ఆపైన మిషనుమీద కుట్టడమయ్యాక, బొత్తాలు కుట్టి వాటికి కాజాలు కుట్టడం, హెమ్మింగ్ వర్క్ చెయ్యడం... లాంటివి ఆ వూరిలో అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తాయి. భోజనం కూడా కాళ్లతోనే స్పూను సాయంతో చేస్తాడతడు. కాళ్లను మాత్రమే అతినులువుగా కదపగలడతడు. ఇతని సామర్థ్యాన్ని చూసి అక్కడి గ్రామీణ బ్యాంకు కుట్టుమిషను కొనుక్కుందుకు లోను మంజూరు చేసింది. రెడీమేడ్ దుస్తులను తయారుచెయ్యగలిగితే దానికి కావలసిన పెట్టుబడి కూడా ఇస్తామని సదరు బ్యాంకు హామీ ఇచ్చింది. కుట్టుపనే కాకుండా రంగుకాగితాలను కత్తిరించి అందమైన పూలు, మాలలు తయారుచేస్తాడు వెంకటసామయ్య. స్కూళ్ళల్లో జరిగే సంవత్సర వేడుకలూ మొదలైన వాటికి ఈ కాగితం పూలమాలలు విరివిగా అమ్ముడయి మంచి లాభాలు తెచ్చిపెడుతున్నాయతనికి.

తనకున్న శారీరకలోపం చూసుకుని చింతిస్తూ మరొకరికి భారంగా వుండటంకన్న చేతనయినంతలో కష్టపడి జీవితాన్ని నడుపుకు రావచ్చన్న స్ఫూర్తిని ఎంతోమంది వికలాంగుల్లో కలిగిస్తున్నాడు వెంకటసామయ్య.

## కారు పిచ్చి

‘పిచ్చి కుదిరింది, తలకి రోకలి చుట్టండి’ అని వెనకటికి ఓ పిచ్చివాడన్నాడన్నమాట నిజమో కాదోగానీ ప్రస్తుతం స్టాన్లీమార్ష్ అనే అమెరికా ఆసామికి మాత్రం ‘తలకి కారు చుట్టాల్సిందే’. ఎందుకంటే ఈయన ‘కారు పిచ్చి’కయ్యే ఖర్చుతో ఎన్నో పరిశ్రమలు నిర్మించి, ఎందరికో ఉపాధి కల్పించవచ్చు’ అన్నది ఖాయం. మార్ష్ ఓ పెద్ద బిలియనీరు. దానికి తగ్గట్టు కార్లపిచ్చి, ఫ్యాషన్‌దుస్తుల పిచ్చీ వుండటంతో ఎన్ని కోట్లూ వాటికి చాలడంలేదు. ముఖ్యంగా ఈయనకి కాడిలాక్ కార్లంటే చాలా ఇష్టం. ఆ కంపెనీకి సంబంధించిన ఏ కొత్త మోడల్ కారొచ్చినా వెంటనే కొనేస్తాడు మార్ష్. అంతటితో పాతకారును తన ఇంటివెనక ఖాళీ స్థలంలో భూస్థాపితం చేస్తాడు. ఇలా ఒక కారు వదిలి మరోటి, అది పాతి ఇంకోటి కొంటూనే వుంటాడు మార్ష్. పాతకార్లన్నిటినీ తన ఇంటివెనక కార్ల స్థలంలో, ఒక్కొక్కదాన్నీ 60 డిగ్రీలకోణంలో నిలబెట్టి భూస్థాపితం చేస్తాడు.



సగం కారు బయట మిగిలినది భూమిలోకి వుండి వివిధ రంగుల్లో చూడ్డానికి వింతగా వుంటాయా కార్లు. కారుకీ కారుకీ మధ్యదూరం 20 గజాలుంటుంది. ఒక్కొక్క కారుని భూస్థాపితం చెయ్యడానికి బోలెడంత డబ్బు ఖర్చుపెడతాడు మార్ష్. ఎందుకంటే దాన్నో పెద్ద వేడుకగా జరిపించడమేకాక, కార్లకంపెనీ ప్రొప్రయిటర్ని కూడా ప్రత్యేకంగా ఆ వేడుకకు ఆహ్వానిస్తాడు మార్ష్. ఈవిధంగా ఇప్పటికి ఓ రెండు డజన్ల



కార్లదాకా పాతిపెట్టాడు మార్ష్. వీటన్నిటికీ సుమారు 8 కోట్లరూపాయలు ఖర్చు అయి వుంటుందని అంచనా. అంతేకాక ఈ విషయం యాత్రికులకు కూడా ఓ ఆకర్షణగా మారి, అనేకమంది సందర్శకులతో కిటకిటలాడుతూ వుంటుంది ఆ ప్రదేశం.

మార్ష్ వస్త్రధారణ కూడా వింతగానే వుంటుంది. కొన్ని దుస్తులమీద కాడిలాక్ కార్ల ఫొటోలు చక్కని డిజైనులా అతికించబడి వుంటాయి.

ఇంక ఇతనికిగల అతివిచిత్రమైన మరో పిచ్చి... కారు హారన్ శబ్దాలను వినడం. అనేక కాడిలాక్ కార్లు ఒకేసారి హారన్లు మోగిస్తే వచ్చే శబ్దాన్ని ప్రత్యేకంగా ఒక మ్యూజిక్ డైరెక్టరుచేత కంపోజ్ చేయించుకుని ఆ టేప్‌ను తరచు వింటూవుంటాడు మార్ష్.

## గణిత కళాఖండాలు

ఏంట్రిమ్ అనేది ఐర్లాండ్‌లో ఓ ముఖ్యనగరం. సముద్రపు ఒడ్డున వున్న ఈ నగరం ప్రకృతి సంపదకు ప్రసిద్ధిగాంచింది. ఈ సముద్రపు ఒడ్డున గుట్టలు గుట్టలుగా కనిపించే వేలాది రాళ్లు... అక్కడి అద్భుతవింత. ఇవి కొన్ని స్థూపాకారంగాను, మరి కొన్ని చతురస్రంగానూ వుంటే ఇంకొన్ని షడ్భుజి, త్రిభుజిల్లా వుండి క్షేత్రగణిత నమూనాలకి ప్రతీకలుగా కనిపిస్తాయి. ప్రతిరాతిని ఓ గణితశాస్త్రవేత్త తీరిగ్గా కూర్చుని ఓ క్రమపద్ధతిలో చెక్కినట్టు అనిపిస్తుంది తప్ప ఏ ఒక్క రాయీ మామూలుగా వున్నట్టు కనిపించదు. ఈ రాతిగుట్టల మధ్య చిన్నచిన్న గుహల్లాంటివి వుంటాయి. సముద్రపు అలలహోరు ఈ గుహల్లో మారుమోగి, విచిత్రధ్వనులు చేస్తూ సందర్శకులకు వింత అనుభూతిని కలిగిస్తాయి.



ఇంతకీ ఈ రాళ్ళగురించి జియాలజిస్టులు చెప్పేదేమంటే 5 కోట్ల సంవత్సరాల క్రితం జరిగిన అగ్నిపర్వతవిస్ఫోట కారణంగా ఈ రాళ్ళు ఇలా గుట్టలుగా వచ్చిపడ్డాయనీ అప్పటినుంచీ ఒకే పద్ధతిలో సముద్రపు అలలు వీటిని తాకి, కడిగి, అరగదీసి ఈ రకమైన ఆకారాలు తీసుకొచ్చాయనీ అంటున్నారు. నమ్మాల్సిందేమరి.

# కవిగారి కీర్తి

కు.వెం.పు అనేది మైసూరులో ఓ ప్రసిద్ధి చెందిన ప్రాంతం. అది అసలు కె.వి. పుట్టప్ప అనే ఓ ప్రసిద్ధ కన్నడ కవి పేరు. ఈయన పేరుతోనే ఆ ప్రాంతానికి కు.వెం.పు నగర్ అని పేరొచ్చింది. ఇంతకీ అసలు విశేషం... ఈ లొకాలిటీలోని ఇళ్ళను వాటికున్న వాటర్ టాంకులనుబట్టి గుర్తించవచ్చునట. ఒక ఇంటికి కట్టిన మోడల్‌లో మరో ఇంటికి కట్టకుండా కట్టి 'వాటర్ టాంకు నిర్మాణం' లో తమకో ప్రత్యేకతను ఆపాదించుకున్నారీ ప్రాంతం గృహస్థులు. మేడలకి పైభాగంలో నీళ్ళు నిలవచేసుకునే ఈ టాంకులు అక్కడ





వివిధ రూపాల్లో, వింత వింత ఆకారాల్లో దర్శనమిస్తాయి. వాటర్ జగ్, ఓడ, చేప, యుద్ధపు టాంకు, కమండలం... ఇలా వివిధ రూపాల్లో కట్టి వుంటాయక్కడ. ఎవరైనా ఆ ప్రాంతానికెడితే ఫలానా వాటర్ టాంకుగలవారిల్లెక్కడ?' అని అడుగుతారుగానీ, ఫలానా రంగన్నగారి ల్లేదీ అనో, రామయ్యగారిల్లిదేనా అనో అడగరు.

ఈ ప్రత్యేకమైన డిజైన్ల వాటర్‌టాంకుల అభిరుచి ఆ చుట్టుపక్కల ప్రాంతాలకి కూడా సోకిందిగానీ ఈ ప్రాంతానికున్న మరో ప్రత్యేకతమాత్రం మిగతా ప్రాంతాలకు దక్కటం కష్టమే. అదేమిటంటే... ఏ కవిగారి పేరున ఈ ప్రాంతం వెలిసిందో ఆ కవిగారి ఒక్కో కవిత పేరుతో ఒక్కొక్కరోడ్డును పిలుస్తారు. ఉదాహరణకు 'పంచమంత్ర' రోడ్డు, 'సప్తసూత్ర' రోడ్డు, అంటూ...

ఇవన్నీ గృహనిర్మాణంలో వారి అభిరుచినే గాక, సాహిత్యం పట్లవారి అభిమానాన్ని కూడా చెప్పక చెబుతున్నాయి.

# పరిమళ ముత్యాలు

★ ఎవరినీ ఎదురుగా ప్రశంసించవద్దు. అలాగే ఒకరి లోపాన్ని పరోక్షంగా విమర్శించవద్దు. మంచి పనిచేసినవారిని ఎదుటపడి ప్రశంసించడంకన్నా అతని మంచిని గ్రహించి ఊరుకోవడం ఉత్తమం. కాని ఒక చెడు పనిచేసినవారిని ఉపేక్షించడంకన్నా చేసిన తప్పు వారికి చూపించడం అవసరం.

— క్వార్లెస్

★ మన యోగ్యతకు తగిన ప్రశంస లభించినప్పుడు హాయిగానే ఉంటుంది. కాని ప్రశంసలకు తగిన శక్తి మనలో లేనప్పుడు అవి మనకున్న కాస్తశక్తిసామర్థ్యాలను హరించివేస్తాయి.

— గోల్డ్‌స్మిత్

★ కరుణకన్నా గొప్పధనం లేదు. స్వతంత్రంకంటే మించిన సంపాదనలేదు. మనిషి, మనిషికి మధ్య మమత ఉండటంకన్నా కావాల్సింది మరొటిలేదు.

— తిలక్

★ మన మమతలు కూడా మన సిరిసంపదలకు అనుగుణంగా మారడం విచిత్రమైన అంశమే.

— షేక్స్‌పియర్‌బ

★ ఎక్కువగా మాట్లాడేవారెప్పుడూ తక్కువగా ఆలోచిస్తారు.

— డ్రైడన్

★ మంచిమాటలకు వ్యయముండదు. కానీ విలువ ఉంటుంది.

— ఆంగ్ల లోకోక్తి

★ అతిగా మాట్లాడటానికి ప్రయత్నించకు. మాట్లాడితే హుందాగా, మర్యాదగా మాట్లాడు. ఎప్పుడూ మాట్లాడే వ్యక్తివైపే చూడు.

— డిజ్రాయిలి

★ చూపించేదానికంటే ఎక్కువ కలిగి ఉండాలి. తెలిసినదానికంటే తక్కువ మాట్లాడాలి.

— షేక్స్‌పియర్

★ అవసరం ఉన్నప్పుడు మాట్లాడకుండా ఉండటం, అవసరం లేనప్పుడు మాట్లాడటం; ఈ రెండూ బలహీనతను తెలియజేస్తాయి.

★ ఋషులు మాట్లాడరు. మేధావులు మాట్లాడతారు. మూర్ఖులు వాదిస్తారు.

— చైనా సూక్తి

★ మాటఇచ్చి నిలబెట్టుకోలేకపోవడంకన్నా మాట ఇవ్వకుండా చేయగల సహాయం చేయడం మేలు.

★ ఎంతసేపయినా మాట్లాడు. కాని ప్రతిసారి అరనిముషం మించి మాట్లాడకు. అరనిముషమయితే కొంచం ఆగు. ఆలోచించు లేదా ఎదుటి వ్యక్తికి మాట్లాడే అవకాశం ఇవ్వు.

— స్విఫ్ట్

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

# 'బంద్'పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన జె.వి.బాబు నవల 'బంద్'పై మాకందిన ఉత్తమ సమీక్షలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## అసాధారణం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

అసాధారణ ఇతివృత్తంగల రచనల ప్రచురణలో 'చతుర'ది ఎప్పుడూ ముందడుగే అన్న విషయాన్ని మరోసారి నిరూపించింది 'బంద్'.

పండుగలతోపాటు ప్రతినెలా అతిథుల్లా వచ్చిపడే బంద్‌లు, కర్ఫ్యూలు సామాన్యులపాలిట గుదిబండలే.

అతిసామాన్యంగా కార్మికుల విషయంలో యాజమాన్యం తీసుకున్న పొరపాటు నిర్ణయం, చిలికి చిలికి గాలివానగా మారి రాజకీయంగా మారి ఇరుపక్షాల మధ్య రాజుకొని బలాబలాలు తేల్చుకొనే 'బంద్'గా మారింది. ఆ అగ్నికి బలైపోయిన 'లక్ష్మి'లాంటి సమిధలు ఎందరో.

నెలలు నిండిన గర్భిణీ స్త్రీలు, రోగులు, వృద్ధులు మాత్రమే కాదు, రెక్కాడితేగానీ డొక్కాడని కష్టజీవులు, అన్నార్తులు, పేవ్‌మెంట్‌మీద వ్యాపారం చేసుకొనే వారి దగ్గరనుండి పెద్ద ఫ్యాక్టరీలు నడిపించేవారివరకు ఎవరూ ఈ 'బంద్' సమస్యకి మినహాయింపు కాదు. ప్రతివారూ ఎక్కడో ఒకచోట ఎప్పుడో ఒకసారి ఈ 'బంద్' రాక్షసిబారిన పడక తప్పదు. అందర్నీ ఇబ్బంది పెడుతున్న 'బంద్'లని ఎవరు సమర్థిస్తున్నట్టు? సరిగ్గా ఇక్కడే రచయిత ఈ 'బంద్' వికృతరూపాన్ని బట్టబయలు చేశారు.

రచయిత ఎన్నుకొన్న వస్తువులో నూతనత్వం ఉంది. తేలికగా పరిష్కరించదగిన కార్మిక సమస్యని కార్మికనాయకులూ, రాజకీయ పార్టీలు జటిలతరం చేసిన సన్నివేశాల కల్పన కథాగమనాన్ని వేగవంతం చేసింది.

శ్రీనివాస్ పరంగా లక్ష్మితో అతని చెలిమి, ఆమెపట్ల అతని ఆరాధనని వివరించిన తీరు వారిరువురి స్నేహభావంపట్ల గౌరవం కలిగించాయి. కానీ అవినాష్ లక్ష్మి డైరీలు శ్రీనివాస్‌కి అందజేయడంలో లక్ష్మి శ్రీనివాస్‌కోసం తపించినట్లుగా చిత్రించడం ఎబ్బెట్టుగా ఉంది. మరయితే వారిరువురూ ఎందుకు దూరంగా ఉండిపోయినట్లు?

'బంద్' సమస్య పరిణామతీవ్రతవలన చనిపోయిన 'లక్ష్మి'పట్ల అనిర్వచనీయమైన జాలి కలుగుతుంది. ఆఖరున 'కేవలం' లక్ష్మి పాపకి పేరుపెట్టడం, శ్రీనివాస్ గాయత్రిలకి పెళ్ళిచేయడం అనే రెండు కారణాలు తప్ప లక్ష్మి డైరీలు బయటపెట్టే సన్నివేశం అనవసరంగా తోచింది. తద్వారా 'లక్ష్మి'కి పాఠకుల సానుభూతి లభించదు కూడా.

-పి. లక్ష్మీదేవి,
అసిఫ్‌నగర్.

## 'బంద్'లు బంద్ కావాలి

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

సామాన్య ప్రజల నిత్యజీవన సమస్యలలో ఈ 'బంద్' ఒకటిగా తయారయింది. ఈ 'బంద్'లవల్ల నెరవేరే ప్రయోజనం ఏమిటో 'ఆ నిర్వాహకుల'కే తెలియాలి తప్ప, ప్రజలు పడేబాధలు, ఎదుర్కొనే సమస్యల గురించి ఎవరూ ఆలోచించటంలేదు. ఈ నవలలో రచయిత చాలావరకు సమస్యలని చర్చించిన మాట నిజమే అయినా అవి ఒక వర్గంవారి సమస్యలుగానే కనిపిస్తాయి. రోజుకూలీ చేసుకు బతికేవారు, రిక్షాతొక్కి సంపాదించుకునేవారు, ఏ రోజుకారోజు ఏ కాయగూరలో అమ్మి పొట్టపోషించుకునేవారూ- ఇలాంటివారు

మరింతగా బంద్‌లవల్ల నష్టపోతున్నారనేది రచయిత కనీసమాత్రంగానైనా చర్చించలేదు.

ఇక పరిష్కారం అనేది- నిజమే, ప్రజల నుంచీ చైతన్యం రావాల్సిందే! ఆ విషయమే రచయిత వారపత్రికలో ఉత్తరాల శీర్షిక పేరిట వెల్లడిచేసినా, పరిష్కారం అనేది ఇంకేవిధంగానూ చూపించలేకపోయినా 'మీరెంత మంది ఉన్నారు?' అని లారీడ్రైవర్లను, క్లీనర్లనూ అడిగి 'అయితే మీరు యాభైమంది ఈ పదిమందికి భయపడి లారీలు ఆపుకోవటం ఏమిటి? నాన్సెన్స్' అని వారిలోనూ, ఇటు మనలోనూ ఆలోచనకలగజేసి, చైతన్యభావాన్ని రేకెత్తించే సన్నివేశం బాగుంది. ఇదే ఏ సినిమాలోనో అయితే ఏదో ఒక క్లాసు ప్రేక్షకులతో చప్పట్లు కొట్టించేదే.

నవల మొత్తంమీద నిరుత్సాహం కలిగించే విషయం- అంజనేయులునాయుడికి పోటీగా డాక్టర్ అవినాష్‌ని నిలబెట్టి గెలిపించి సాధించినదేమిటి? గెలిచాక అవినాష్ పాత్ర శ్రీనివాస్ గాయత్రిల పెళ్ళి జరిపించటానికి తన కూతురికి శ్రీనివాస్‌చేత పేరు పెట్టించటానికి మాత్రమే పరిమితమైపోయిందా?

ఏమయినా 'బంద్'లు బంద్ కావాలన్న ఆర్తితో నవల రాసిన జె.వి.బాబు అభినందనీయులు. ఇలాంటి ఉత్తమ నవలల ప్రచురణ 'చతుర'కే సాధ్యం అనేది మరోసారి రుజువయింది.

-శ్రీమతి కొండపల్లి లక్ష్మి,
న్యూపాల్వంచ.

# రాజకీయలాభం!

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**నే**టి సామాజిక పరిస్థితులలో బంద్‌లవల్ల పొందేలబ్ధి ఏమిటో రాజకీయ నాయకులే వివరించాల్సి ఉంది. వాటి నిర్వహణ వెనుక ఉన్న అంతరార్థం ఎదుటి పక్షపు ఇమేజ్‌ని పాడు చేస్తున్నామనుకుంటూ ఆనందంపొందే శాడిజమో, సామాన్య ప్రజానీకం కష్టాలపాలవుతున్నాపట్టించుకోని అనాగరికత్వమో అర్థం కాదు.

నాయకులనే వారి ఆశయం ప్రజాశ్రేయస్సే అయితే అధికారంలోవున్నా లేకపోయినా వారి లక్ష్యం ప్రజాసేవే! కానీ ఈనాడు యావత్ రాజకీయాలే స్వార్థపూరిత దృక్పథంతో రూపొందుతున్నట్లు స్పష్టంగా గోచరిస్తున్నది! అధికారం, డబ్బూ, మనుషులను ఎలా ఆడిస్తున్నాయో వేరే చెప్పవలసిన పనిలేదు. ఈ పరిస్థితినుండి ప్రజలు విముక్తినీ, మార్పునీ కోరుకోవడం సహజమే! కానీ పిల్లి మెడలో గంటకట్టే మొనగాడెవరు? ప్రతివారికీ సామాజిక జీవితంతోపాటు వ్యక్తిగత జీవితం ఒకటుంటుంది. అందులో రెండోదెప్పుడూ మొదటిదాన్ని డామినేట్ చేస్తూనే ఉంటుంది. 'బంద్' నవలలో ఎంతో తెలివిగల జె.యస్సే అవినాష్‌ని ఎం.ఎల్.ఏ.గా గెలిపించడానికి ఎంత డబ్బు ఖర్చయినా సరే ఓట్లు సంపాదించాలనుకోవడం కూడా కొంతలోకొంత ఆత్మవంచనే కదా!

మార్పును కోరుకుంటే ప్రజలే తిరగబడ్తారులే అని సరిపెట్టుకోలేకపోయాడు జె.యస్. రేపు మరేదో సందర్భంలో ఈ రాజకీయ విషవలయం ఎదుటివారికి అనుకూలంగా తిరిగినప్పుడు నిజాయితీపరుడయిన అవినాష్‌పైనే తప్పుడు కేసులు బనాయించి తమ పబ్బం గడుపుకోరని గ్యారంటీ ఏమిటి? నిరంతరం కాలచక్రంతోపాటు తిరగే ఈ వలయపు ఆటుపోట్లూ అవకాశాన్నిబట్టి కొందరిని ఆకాశానికీ, మరికొందరిని అథః పాతాళానికి నెట్టడమన్నది బిజినెస్ సైకిల్స్‌లో వచ్చే ఆటుపోట్లంత సహజం. కనుక ఈ సమస్యను పరిష్కరించుకోవడానికి రాజకీయాలనే ఆశ్రయించవలసిన పనిలేదు. పైగా ప్రచారాలప్పుడు అందరు నాయకులూ ప్రజలను ఆకట్టుకునే మాటలే చెప్తారు. ఎవరు చెప్పేదాంట్లో ఎంత నిజాయితీ ఉందో ముందుగా ఊహించటం కష్టం. అందుకని రచయితే నవలలో చెప్పినట్లు ఒక పత్రిక సారా సమస్యను ఒక ఉద్యమంలా ఎలా కొనసాగించిందో అలాగే జె.యస్.లాంటివారు ఒక స్వచ్ఛంద సంస్థను స్థాపించి ప్రజలను ఇటువంటి సమస్యల బారినుండి కొంతయినా కాపాడగలరు.

ప్రాధాన్యతే ఇవ్వనవసరం లేనంత చిన్న సంఘటనతో ప్రారంభమయి, కోతి పుండు బ్రహ్మారాక్షసి చందాన చిలువలు పలవలై ఎంతటి దారుణాలవరకూ దారితీయగలదో

బంద్ నవల బాగా వివరించింది. ఆద్యంతం హృద్యంగా ఒక్కపెట్టున చదివించే శైలిలో విషయాన్ని విపులీకరించిన తీరు బాగుంది. ప్రేయసిని పెళ్లాడలేకపోయినంత మాత్రాన ప్రతివాడూ దేవదాసులా మారాల్సిన అవసరం లేదనీ, ఆ వ్యధనీ, కసినీ ప్రయోజనకరమైన పనివైపు మళ్లిస్తే పొందే విజయం ఎలాంటి తృప్తినివ్వగలదో ఈ నవల నిరూపించిందన డంలో సందేహం లేదు. జీవితం ప్రేమా, పెళ్లీ మాత్రమే కాదుగదా!

అయితే లక్ష్మి దగ్గర అంత చనువున్నా జె.యస్. ఆమెను తన దానిని చేసుకోలేక పోవడానికీ, లక్ష్మి అతణ్ణెందుకు పెళ్లి చేసుకోలే కపోయిందీ చెప్పడానికి బలమైన కారణం నవలలో ఎక్కడా కనుపించలేదు.

అశ్లీలపు అడకత్తెరలో అలమటిస్తున్న ఆంధ్ర పాఠకులకు, అర్థంలేని కథలలో అవస రంలేని అశ్లీలాన్ని జొప్పిస్తున్న కాలంలో చతుర తనదైన అహ్లాదకరమైన, ఆరోగ్యకర మైన బాణీలో అందించిన ఈ నవల అందరూ చదవతగినది.

-జి.భవాని
లాలాగూడ

## తిరోగమన సంకేతాలు

*(నాలుగవ బహుమతి రూ.25/- పొందిన సమీక్ష)*

**ఇ**టీవలి కాలంలో చీటికిమాటికి జరుగుతున్న బంద్‌లకు సజీవదర్పణం 'బంద్' నవల. మన సామాజిక జీవనంలో బంద్‌లు సర్వసా మాన్యం అయిపోయినట్లు అనిపిస్తుంది. స్వా తంత్ర్యోద్యమ కాలంలో ఆనాటి బ్రిటిష ప్రభు త్వపు ప్రజావ్యతిరేక చర్యలకు వ్యతిరేకంగా, ప్రజలు వ్యక్తపరిచిన నిరసనకు ప్రతిరూపంగా ఉపయోగపడిన బంద్‌లేదా హర్తాల్ ఈనాడు స్వార్థ రాజకీయుల చేతిలో ఎంతగా దిగజా రిందనేది మనందరికీ మిగిలిన చేదు అనుభ వమే.

ఈ నవలలో రెండు విషయాలు ప్రధానంగా గోచరిస్తాయి. అవి బంద్ పూర్వాపరాలు మరి యు శ్రీనివాస్ ఉదాత్తవ్యక్తిత్వం.

అపూర్వమైన తెలివితేటలు, అచంచల మైన పట్టుదల, సామర్థ్యంతోపాటు విశాల, ఉదార హృదయుడు అయిన శ్రీనివాస్ యువ తరానికి ఆదర్శప్రాయం. డాక్టర్ లక్ష్మి వ్యక్తిత్వం కొత్త తరహాగా ఉందనవచ్చు.

ఫ్యాక్టరీలో సాధారణంగా ఉపేక్షించదగిన స్వల్ప విషయాలు కొందరి ఇగోల కారణంగా సమ్మెలకు దారి తీయడం, సమ్మెను విజయ వంతం చేయడంలో భాగంగా రాజకీయుల రంగ ప్రవేశంలో అసలు సమస్య ప్రక్కదోవనబ డి సమస్త సభ్య సమాజాన్నీ అతలాకుతలం చేసే బంద్‌గా రూపొందడాన్ని చక్కగా చిత్రీక రించారు రచయిత. బంద్‌వలన ఒనగూరే కష్టనష్టాలను ముఖ్యంగా రెక్కాడితే గాని డొక్కా డని కార్మికులు, కూలీలు, ప్రయాణీకులు, అత్యవసర వైద్య సహాయం అవసరమైన రోగు లు అనుభవించే నరకయాతన వాస్తవంగా వర్ణించారు. బంద్‌ల వలన నిజానికి నష్టపో యేది ఆ బంద్‌తో ఏమాత్రం సంబంధంలేని అమాయకులే. బంద్‌తో సంబంధంగలవర్గా లు సదా అప్రమత్తంగానే ఉంటారు.

నవల ఉత్కంఠభరితంగా కొనసాగుతూ చివరి వరకూ పాఠకుల చేత వదలకుండా చదివిస్తుంది. ఆ తర్వాత కొనసాగింపు కృత్రి మంగా తోస్తుంది. అలా కాకుండా శ్రీనివాస్ హైదరాబాద్ తిరిగి రావడంతోనే కథ ముగిస్తే బాగుండేదేమో.

మొత్తానికి సమకాలీన సమాజాన్ని పట్టిపీడి స్తున్న రుగ్మతను ఎన్నుకొని దాని ఆవిర్భావా న్ని విస్తృతిని సవివరంగా వివరిస్తూ దాన్ని నిరోధించే మార్గం చెప్పడంలో రచయిత కృత కృత్యుడయ్యాడు.

-ఆడెపు సుదర్శన్
హైదరాబాద్

## ప్రధాన సమస్య

*(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

**జూ**లై '93 'చతుర'లోని 'బంద్' నవలాకథ ఒక ప్రధానమైన సమస్యే. అది ప్రజలకెంత యిబ్బందికరమో రచయిత జె.వి.బాబు బాగా స్పష్టపరిచారు! కేవలం ఒక చిన్నవిషయం పెద్ద గాలిదుమారమై ప్రజలకు యిష్టంలే

కుండానే కేవలం కొద్దిమంది అరాచకశక్తులు బంద్‌పేరిట ఎంతమందిని యిబ్బందిలో పడే స్తారో ఈ కథ చదువుతుంటే తెలిసిరావటంతో పాటు ఆయా సందర్భాల్లో తామెదుర్కొన్న కష్టనష్టాల్ని పాఠకుల కనులముందు మరల ఒకసారి నిలబెట్టిందీకథ!

పుచ్చలపల్లి సుందరయ్యగారు మహానుభావుడే! పార్టీ అభిప్రాయాలకు అంకితమైన నిజమైన కమ్యూనిస్టు ఆయన! వయసుపైబడి సహజంగా చనిపోయారు. ఆ విషయం తెలియని నేను బోలెడు సామానుతో విజయవాడ వెళ్ళాను. సడెన్‌గా బంద్ ప్రకటించారు. ఇక ఆ సామానుతో మావాళ్ళింటికి వెళ్ళాలంటే ఏ రిక్షావాడూ రానన్నాడు. ఎంత డబ్బయినా యిస్తానని బతిమాలుకున్నాగానీ, ''ఏం చేయ మమ్మా! రిక్షా చక్రాల టైర్లకు సూదితో రంధ్రాలు చేసేస్తున్నా''రని వారి అసహాయత ప్రకటించారు. ఒక ఆడదానిగా అక్కడే పడివుండలేక, వెళ్ళనూలేక నేను పడిన అవస్థ ఈనాటికీ మరువలేను. ముందు మరణవార్త తెలియగానే మనస్ఫూర్తిగా బాధపడిన నేను ఆయన మరణాన్ని ఇలా వాడుకుంటున్నవారిపై చెప్పలేనంత కోపం వచ్చింది. మహాత్ములు బతికివుండగా ఎందరికో మేలు కలుగజేస్తారు! అలాగే వారి మరణమూ ఎవరినీ యిబ్బందిలో పడవేయకూడదని ఆయన అభిమానులు ఆలోచించివుంటే బాగుండేది.

బంద్ ఒక్కటేకాదు రాజీవ్‌గాంధీ హత్యానంతరం ఇందిరాగాంధీ హత్యానంతరం చెలరేగిన హింస, దహనకాండలు ఎవరికి న్యాయం చేకూర్చాలని? బస్సులు తగులబెట్టడం, దుకాణాలు, వూళ్ళకు వూళ్ళే తగలబెట్టేస్తుంటే అయ్యో! మనదేశాన్ని మనమే నాశనం చేసుకుంటున్నామే! అని ఎవరూ ఎందుకు ఆలోచించరో? సినిమాలలో, కథలలో అశ్లీలత, అసభ్యత, సోమరితనం, హత్యలు, మారణకాండ - అన్నీ సమస్యలే! ప్రజానీకం సమస్యలు!

అందుకే రచయిత చివరగా ఈ బంద్‌లు వగయిరా జరుగకుండా సమస్యల పరిష్కారంగా పత్రికాముఖంగా చర్చలు, పోటీలు, బహుమతులు పెట్టడం బాగుంది. పత్రికలు ప్రజలకెంతో సేవలు చేస్తున్నాయి. సాహిత్యం ప్రజలను సన్మార్గంలో పెట్టే శక్తిగలది. అందుకే కేవలం ఒక్కసారి ఈ చర్చలతో పోటీలు నడిపి వూరుకుంటే చాలదు. ప్రజలను చైతన్యవంతులను చేయాలి. 'బంద్'లాంటి కథలు, నవలలు యింకా రావాలి. 'బంద్'లు వగయిరాలను ఎదుర్కొనేవిధంగా ప్రజలను చైతన్యవంతం చేయాలి.

-ఎస్.సులోచన
భీమావారిపాలెం

## సామాజిక సమస్య

*(ఆరవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

ఈనాడు ప్రజల జీవితాలను అస్తవ్యస్తం చేస్తున్నవాటిలో ఒక ముఖ్యాంశంగా 'బంద్'ను చెప్పుకోవచ్చు. బంద్‌వల్ల ఏ పాపమూ ఎరుగని లక్ష్మిలాంటి అమాయకులు ప్రాణాలు కోల్పోవడమే కాకుండా, ఏరోజుకారోజు కూలిపని చేసుకుని బతికేవారికి మనుగడే కష్టమవుతోంది. బంద్‌ను ఒక సమస్యగా తీసుకుని రచయిత జె.వి.బాబుగారు నవలను రాయడం బావుంది. దీనిలో బంద్‌ను గూర్చి చాలా సున్నితంగా చర్చించారు. ఈరోజులలో ఎవరూ బంద్‌ను స్వచ్ఛందంగా చేయటంలేదు. ఒక రోజు ఆఫీసులు, దుకాణాలు మూసేస్తే వచ్చే నష్టంకంటే అల్లరిమూకలు చేసే నష్టమే ఎక్కువ. స్వార్థపూరిత రాజకీయాలకోసం ఆంజనేయులు నాయుడులాంటివారు చిన్న సమస్యను పెద్దదిగా చేసి, రాజశేఖరంలాంటి వారిని ఈ ఆటలో పావులను చేస్తున్నారు. తద్వారా శ్రీనివాస్‌లాంటి నిజాయితీపరులు విసుగెత్తి తమ కంపెనీలు మూసేస్తే నష్టపోయేది మళ్ళీ రాజశేఖరంలాంటివాళ్ళే. అప్పుడు వారిని ఈ రాజకీయనాయకులు ఆదుకోరు.

ఈ బంద్‌పట్ల ప్రజలలోనుంచేవ్యతిరేకత రావాలి. ప్రజలంతా కలిసిముక్తకంఠంతో దానినివ్యతిరేకించిననాడు మనం దేశాన్ని ఒక మహమ్మారి నుంచి రక్షించుకోవచ్చు. నవలలో శ్రీనివాస్, గాయత్రి, లక్ష్మి, అవినాష్, ప్రకాశం పాత్రల కల్పన బావుంది. మొత్తానికి 'చతుర' నవల ప్రశంసనీయంగా రూపొందింది.

-కె.వి.కృష్ణకుమారి
ఏలూరు

సచిత్ర విచిత్రం

# కేశ భారం తీరిన క్షణాన...



★ ఎక్కడ చూసినా కేశాభివృద్ధికీ, బట్టతలమీద జుట్టు మొలవడానికీ చిట్కాలు రాస్తుంటే అవి చదివి స్త్రీ, పురుష బేధం లేకుండా శాయశక్తులా సదరు చిట్కాలు పాటిస్తున్న ఈ రోజుల్లో ఆస్ట్రేలియాలోకెల్లా పొడవైన జుట్టు గల అతివగా పేరుప్రఖ్యాతలు తెచ్చుకున్న బెస్లిమ్ హాక్లిజల్‌కి హటాత్తుగా ఆ జుట్టు మీదే విసుగు పుట్టింది. పాపం! ఆ జుట్టు మూలంగా ఆవిడకి తరుచు తల నెప్పి వస్తోందట. పైగా దాని సంరక్షణకి రోజూ కనీసం మూడు గంటలు పడుతోందిట. నిజానికి అంతటి నిడుపాటి జడని ఒక్కసారి కత్తిరించేసరికి మొదట ఘొల్లుమని ఏడ్చినా సంవత్సరాల తరబడి మోస్తున్న భారమేదో దిగిపోయినట్టు మనసు కూడా తేలికయిపోయిందిట. ఆవిడను జుట్టు పోయిందన్న బాధనుంచి మరిపించడానికి హెయిర్ డ్రసర్ ఓ అందమైన హెయిర్‌స్టయిల్‌తో అలంకరించేసరికి అద్దంలో ఆ కొత్తరూపం చూసుకుని మురిసిపోయిందిట.







# చమత్కారకథలు

## పతివ్రత

ఆ పేటలో వున్నవాళ్ళందరికీ ఆరోజు పండగనే చెప్పొచ్చు. ఎందుకంటే అది జీతాలరోజు. ఫ్యాక్టరీలో పనిచేస్తున్న వర్కర్లందరూ అక్కడే నివశిస్తున్నారు.

యించుమించు ఓ పదిపదిహేనుమంది ఓ బృందంగా జీతాలు పుచ్చుకొని, యింటికి బయల్దేరారు. నెల రోజులూ పడిన కష్టమంతా మరచిపోయి, ఒకరిపై ఒకరు జోకులు విసురుకుంటూ సంతోషంగా నడుస్తున్నారు.



"ఒరేయ్ చిట్టీ! మా మాటకేంగాని, నిన్ను చూస్తే జాలేస్తోందిరా! ఇటు యింటివద్దా, అటు ఫ్యాక్టరీలోనూ ఎక్కడా నీకు సుఖం వుండదు. ఔను, సూర్యకాంతం, ఛాయాదేవిలకు మించిపోయిన భార్య నీకెలా దొరికిందిరా!" అంటూ విచారం వ్యక్తంచేశాడు బలరాం.

"నాకేంవోయ్! దర్జాగా బతుకుతుంటేనూ. నా భార్య మహా పతివ్రత. నేనంటే పంచప్రాణాలు తెలుసా!" అన్నాడు చిట్టిబ్బాయ్.

ఆమాటకందరూ ఘొల్లున నవ్వారు.

"ఔనౌను! నీ భార్య సంగతి మాకు తెలీదా మరి. నిత్యం చూస్తూనే వున్నాంగదా!" అన్నారంతా.

"అంతెందుగ్గానీ! పందెం కాద్దామా ఏం?

నా భార్య నాకు సకల ఉపచర్యలూ చేస్తుంది చూడండి'' ధీమాగా అన్నాడు చిట్టి.

''అలాగే'' అని తలొక వందేసి పందెంకాశారు, లోలోపలే నవ్వుకుంటూ.

చిట్టబ్బాయి యింటికి రాగానే అతని భార్య ఎదురుగా వచ్చి సాదరంగా చిట్టిని లోనికి తీసుకెళ్ళి స్నానం చేయించింది. తలకి నూనె రాసి, వేడివేడి భోజనం పెట్టి, అది పూర్తయి మంచంమీద పడుకున్నాక కాళ్ళుపట్టింది.

ఈ తతంగమంతా చాటుగా కిటికీల్లోంచి చూస్తున్న మిత్రులందరికీ అది కలో నిజమో తెలియలేదు.

సాయంకాలం చిట్టబ్బాయి ''నా పందెం డబ్బు యివ్వండ''ని వాళ్ళనడిగాడు.

''ఇప్పుడివ్వం. నీవు మన పందెం విషయం ముందుగా చెప్పేసి వుంటావు. రేపు కూడా యిలాగ జరిగితే అప్పుడు నీ పందెం డబ్బు యిస్తాంలే'' అన్నారు వాళ్ళు.

''రేపా... రేపొద్దు... మళ్ళీ జీతాలరోజున చూడండి'' అనగానే

''ఆఁ...!'' అన్నారంతా!

-భైరి విశ్వనాథం

---

## సెంటు దెబ్బ

ఇవాళ్టికి రెండు నెలలు దాటిపోయింది. ఇంకా ఎన్ని నెలలు తిరగాలో ఈ ఎమ్మార్వో ఆఫీసుచుట్టూ... ఈ తిరగటంతోనే నా ఒంట్లో ఓపిక మట్టిగొట్టుకుపోయేట్టుంది.

ఈ తిరుగుడంతా దేనికోసమంటే ఓ రేషన్ కార్డుకోసం...

రెండు నెలల క్రితం నాకు ఈ వూరికి బదిలీ అయ్యింది. బదిలీ అయి వచ్చేటప్పుడు అక్కడి కార్డును ఆ వూరు ఎమ్మార్వో ఆఫీసులో సరెండర్ చేసి వచ్చేశాను. అందుకు సంబంధించిన దాఖలా చూపిస్తూ కొత్తగా రేషన్‌కార్డు కావాలని ఇక్కడ ఓ అప్లికేషన్ పెట్టేశాను, రెండు నెలలక్రితమే! కానీ ఇప్పటిక్కూడా ఆ గుమస్తాకు నామీద దయకలగలేదు.

లోపలకు వెళ్ళేసరికి కళ్ళజోడును వెనక్కు తోసుకుంటూ ఏదో ఫైలును బరబరా రాసుకుపోతున్నాడు ఆ సెక్షన్ క్లర్కు.

''నమస్కారమండీ'' అన్నాను.

వెంటనే తలెత్తి ''నువ్వా... మళ్ళీ ఎందుకొచ్చావ్?'' అన్నాడు కోపంగా చూస్తూ...

కనీస మర్యాదకూడా లేకుండా ఆయన మాట్లాడినా నాకు కోపం రాలేదు. అంతా అలవాటయిపోయింది.

''రేషన్‌కార్డుకోసం'' చిన్నగా నసిగాను.

''ఇప్పుడు కుదరదు''

''ఎప్పుడు రమ్మంటారు?'' వినయంగా అడిగాను.

''రేపు'' అన్నాడు మళ్ళీ రాసుకుంటూ.

''ఇప్పటికే రెండు నెలలు దాటిపోయింది'' గుర్తుచేశాను.

''ఐతే... వారం రోజులు ఆగి రా'' అన్నాడు చాలా మామూలుగా.

''నిన్న వచ్చినప్పుడు ఇవాళ రమ్మని తమరే చెప్పారు'' అన్నాను గుర్తుచేస్తున్నట్టు...

''వారంతర్వాత రమ్మని కూడా నేనే చెబుతున్నాను. ఇహ వెళ్ళు... నన్ను డిస్టర్బ్ చెయ్యకు'' మళ్ళీ కసురుకున్నాడు.

ఆ విసురుకు బయటకు వచ్చిపడ్డాను. ఇంకేదైనా మాట్లాడితే ఏడాది తర్వాత రమ్మంటాడేమోనని భయమేసింది.

లంచంగా పాతికో, యాభయ్యో ఇస్తే పనవుతుందని ఒకళ్ళిద్దరు చెప్పినా ఆ పద్ధతికి నేను పూర్తిగా వ్యతిరేకిని. ఇంకెవరయినా తెలిసినవాళ్లు చెబితే పనవుతుందని ప్రయత్నం చేశానుగానీ ఎవ్వరూ దొరకలేదు. ఏం చేద్దామా అని ఆలోచిస్తూ రోడ్డుమీదికొచ్చేసరికి, మా ఆఫీసులో నా పక్కసీటు గోవిందరావు కనిపించాడు నవ్వుతూ... అతన్నుంచి భయంకరమైన వెగటువాసన వస్తోంది. ఆ సెంటు గల్ఫ్‌నించి వచ్చిందని అతనే చెప్పాడు సగర్వంగా. ఆ సెంటు వాసన దరిద్రంగా వుందని అతనితో చెప్పలేకపోయాను. నా తలంతా గిర్రున తిరిగిపోయింది ఆ వాసనను గోవిందరావు ఎట్లా

భరిస్తున్నాడో!

పనుంది రమ్మని ఎమ్మార్వో ఆఫీసులోకి తీసుకెళ్ళాను గోవిందరావును!

వెళ్ళీవెళ్ళగానే సెక్షన్ క్లర్కు రాసుకుంటున్న వాడల్లా ఎవరో వీపుమీద చరిచినట్టు తలెత్తాడు. సెంటు బాగానే పనిచేసినట్టుంది.

"వారం తర్వాత రమ్మన్నానుగా" అన్నాడు మళ్ళీ కోపంగా.

"కుదరదు... మీరు కార్డు ఇచ్చేవరకూ ఇక్కడినుంచి కదలం" అన్నాను, గోవిందరావు భుజంమీద చెయ్యేసి.



"ముందు మీరిక్కడినించి వెళ్లండి" అన్నాడు అతను లేచి నిలబడి, ముక్కుమూసుకుంటూ.

అప్పటికే అక్కడి ఇతర గుమస్తాలు గోవిందరావు సెంటు వాసనకు కాబోలు కలవరపడుతున్నారు.

"వెళ్లం... ముందు నా రేషన్‌కార్డు ఇవ్వండి" అన్నాన్నేను.

"వెళ్ళండయ్యాబాబూ... ముందు ఇక్కడి నుంచి బయటకు పోయి ఆ చెట్టుకింద కూర్చోండి... పది నిముషాల్లో కార్డును నేనే మీదగ్గరకు పంపిస్తాను... వెళ్ళండి... వెళ్ళండి..." అన్నాడు చీదరించుకుంటూ.

గోవిందరావుతో కలిసి బయటకు వచ్చి చెట్టుకింద నిలబడ్డాము. సరిగ్గా తొమ్మిది నిముషాలకు అటెండర్‌చేత నా రేషన్‌కార్డును పంపించాడు సెక్షన్‌క్లర్కు. ఆ రేషన్‌కార్డును నా చేతికిచ్చి అక్కడినించి వెనక్కు పరిగెత్తాడు అటెండర్.

"థాంక్సండీ గోవిందరావుగారూ" అన్నాను సంతోషంగా కార్డును ముక్కుకు అడ్డంగా పెట్టుకుని.

"నాకెందుకండీ థాంక్స్" అన్నాడు అయోమయంగా సెంటువీరుడు గోవిందరావు.

— ప్రతాప రవిశంకర్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402